అపరాధ పరిశోధన అనుబంధం—4

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## నేరస్థుల ఆట?
రచన: మల్లాది వెంకటకృష్ణమూర్తి

## బానిస బ్రతుకులు?
రచన: మిస్. మధుబాల

## జడ్—6
రచన: సుజనశ్రీ

## అడుగడుగునా ఆపదలే!
రచన: కె. శివరామ్

అపరాధ పరిశోధన సప్లిమెంట్—4
ఏప్రిల్, 1974
వెల: రు. 2-50
ఏడాది చందా 33 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదకవర్గం:
మల్లాది వెంకటకృష్ణమూర్తి
వాసవదత్త
కంచర్ల రమణ
ఏ. వీ. మోహన్రావ్
కె. శివరామ్
ఉప్పలూరి ఉషారాణి
మిస్. మధుబాల

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్—36959

ముద్రణ:
క్రాంతి ప్రెస్
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్
మద్రాసు—1

# మీరే ఎన్నుకోండి?

ఈ "సప్లిమెంట్" లో మొత్తం నాలుగు క్రైమ్ నవలలు ప్రచురించబడ్డాయి. నాలుగు నవలలూ మీ అభిమాన రచయితలు రాసినవే. వీటిలో మీకు అత్యుత్తమంగా తోచిన నవల పేరు ఒకటవ నెంబరు ప్రక్కన వ్రాయండి. తర్వాత వరుసక్రమంలో మీకు నచ్చిన మిగతా మూడు నవలల పేర్లు పూరించండి. పాఠకుల ఎన్నిక ప్రకారం అత్యుత్తమ నవల నిర్ణయించబడుతుంది.

పాఠకులు ఉత్తమ నవలగా ఎన్నుకొన్న ఆ నవలా రచయితకు రు. 116/- లు బహుమతి, నాలుగు నవలల ఎన్నికను సరైన వరుసక్రమంలో చెప్పగలిగిన పాఠకులకు ఒక్కొక్కరికి రు. 10/- లు చొప్పున బహుమతి ఇవ్వబడుతుంది.

కూపన్

ఏప్రిల్ '74 నెల "సప్లిమెంట్"లో మేము మెచ్చిన నవలలు వరుసగా ఇవి:

1 ..............................

2 ..............................

3 ..............................

4 ..............................

పై కూపను కొట్టివేతలు లేకుండా పూర్తి చేసి, యీ పేజీ పూర్తిగా కత్తిరించి, యీ నెల 10 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి. మీ చిరునామా వెనుక ప్రక్కన వ్రాయటం మరచిపోవద్దు. ఫలితాలు వచ్చే నెల "అపరాధ పరిశోధన" మాసపత్రికలో ప్రచురించబడతాయి.

అట్టమీది బొమ్మ:

పిస్తోలు పేల్చకు

అట్టచివరి బొమ్మ:

కత్తి చూపకు

# నేరస్థుల ఆట?

## మల్లాది వెంకటకృష్ణమూర్తి

కూపర్ దూరంగా ఆకాశంలో ఎగురుతున్న విమానం వంక చూసాడు. తర్వాత తన చేతిగడియారంవంక చూసుకున్నాడు.

పదకొండు అయింది ఉదయం సరిగ్గా.

రన్ వేవంక చూసాడు. బెంగుళూరు ఏర్ పోర్ట్ లో పేసెంజర్స్ లాంజ్ లో కూర్చున్నాడు ఫ్లైట్ నంబర్ IC-403 కోసం ఎదురుచూస్తూ. లేచి అద్దాల కిటికీ దగ్గరికి వెళ్ళాడు.

బోయింగ్ 737 రన్ వేకి టచ్ అయి, కొంచెందూరం పరిగెత్తింది. క్రమంగా వేగం తగ్గిపోయింది. ఆగింది పూర్తిగా. నిచ్చెన తగిలించారు విమానానికి. దిగుతున్నారు ప్రయాణీకులు ఒక్కొక్కరే.

6

కూపర్ తన చేతిలో సిగరెట్ తాగుతూ చూడసాగాడు దిగుతున్న వాళ్ళవంక పరిశీలనగా. అతనికి కావాల్సిన వ్యక్తి హేరిస్.

కూపర్ అంతకుమునుపు ఎప్పుడూ హేరిస్‌ని చూడలేదు. ఎన్నేళ్ళో, ఎంతఎత్తో, ఎలావుంటాడో కూడా తెలియదు. హేరిస్ ఎవరో కనుక్కోవాల్సిన బాధ్యత తనమీదేవుంది.

ముప్పైరెండుమంది దిగారు మొత్తం విమానంలోంచి. రన్‌వేనుంచి నడిచివస్తున్న వాళ్ళలో పదిహేడుమంది చిన్న పిల్లలు, ఆడవాళ్లు. మిగతావాళ్ళు మగవాళ్లు.

వాళ్ళలో ఎవరయినా అయివుండచ్చు హేరిస్.

కూపర్‌కి వాళ్ళలో ఎవరూ విదేశీయులలాగా కనిపించలేదు ఇద్దరు ముసలివాళ్లు తప్ప. ఆ ఇద్దరూ కలసి మాట్లాడుకుంటూ వస్తున్నారు. అంటే హేరిస్ వాళ్ళలో వుండకపోవచ్చు. హేరిస్‌తోపాటు మరెవరో వస్తున్నారని తనకి సమాచారం అందలేదు.

అంతా పేసెంజర్స్ లాంజ్ చేరారు. కూపర్ సిగరెట్ తాగుతూ, పేపర్‌లోకి చూస్తూండిపోయాడు తనని ఎవరూ పనికట్టకుండా. హేరిస్ ఇండియన్ అని తెలుసు కూపర్‌కి.

"ఎటెన్షన్ ప్లీజ్. మిస్టర్ హేరిస్ ఈజ్ రిక్వెస్టెడ్ టు కాంటాక్ట్ ది రిసెప్షనిస్ట్ ఎట్ వన్స్. రిపీట్. మిస్టర్ హేరిస్ ఈజ్ రి..."

బెంగుళూరు ఏర్‌పోర్ట్‌లోని రిసెప్షనిస్ట్ కంఠం మైక్‌లో వినబడింది వినసొంపుగా.

కూపర్ వీలైనంత మామూలుగా చూసాడు రిసెప్షన్ కౌంటర్ వైపు, హేరిస్ కోసం.

రెండు నిముషాల తర్వాత విమానంలోంచి దిగివచ్చిన ప్రయాణీకులలో ఒకతను రిసెప్షన్ కౌంటర్ ముందు ఆగి, ఏదో చెప్పాడు.

రిసెప్షన్ కౌంటర్‌లోని యువతి అతనికి ఓ తెల్లకవరు అందించింది ఏదో చెప్పి. అతను తలవూపి ఆ కవరు అందుకుని జేబులో వుంచుకున్నాడు.

పేపర్ వెనక కొంగ జపం చేస్తున్న కూపర్ పథకం ఫలించింది. హేరిస్ రాగానే ఏదో వోమిషతో రిసెప్షన్ కౌంటర్ దగ్గరకి రప్పిస్తే, అతనెవరో తెలుసుకోవచ్చు. ఆ వుద్దేశంతో ఓ కవరులో 'వెల్‌కం టు బెంగుళూర్' అని వ్రాసిన కాగితం వుంచి రిసెప్షనిస్ట్‌కిచ్చాడు, పబ్లిక్ ఎడ్రస్ సిస్టమ్ ద్వారా హేరిస్‌ని పిలిచి, ఆ కవరు హేరిస్‌కి అందజేయవలసిందిగా.

పేపర్ మడిచి కూపర్ లేచాడు. బయటకొచ్చి తను ఏర్‌పోర్ట్‌కి తీసుకువచ్చిన కారులో కూర్చున్నాడు, హేరిస్ కోసం ఎదురు చూస్తూ.

పది నిమిషాల తర్వాత వచ్చాడు హేరిస్. ఆగివున్న టేక్సీలో వెనకాల తన చేతిలోని వి. ఐ. పి. సూట్‌కేస్ పడేసి, ముందు సీట్లో కూర్చుని డ్రయివర్‌తో ఏదో చెప్పాడు హేరిస్.

టేక్సీ బయలుదేరింది. వెనకే, కొంచెం దూరంలో, కూపర్ తన కారుని తోలసాగాడు.

## 2

"హలో."

"జానీ?" అడిగాడు కూపర్ ఫోన్‌లో.

"అవును. ఎవరు?" వినిపించింది.

'జానీ. నేను కూపర్."

"హలో. ఏమిటి విశేషం?"

"చిన్న సహాయం చెయ్యాలి బ్రదర్."

"అది మనకి రివాజేగా. అడుగు. చేస్తాను.ఏం, చెయ్యాలి? హిమాలయాలు ఎక్కాలచ్చి..."

"అశోకా హోటల్‌లో రూం నంబర్ తొమ్మిదిలో హేరిస్ అనే అతను వున్నాడు."

"హేరిస్? ఎక్కడో విన్నట్లుగా వుందే పేరు."

"అతన్ని నీడలా కనిపెట్టి వుండాలి నువు."

"అతనికేం ప్రమాదం జరగకుండానా?"

"నా వుద్దేశం నీ కర్థం కాలేదయితే పూర్తిగా. అతనికి అనుమానం కలగకుండా, జాగ్రత్తగా వెంటాడాలి నువు అతన్ని. ఎక్కడికి వెళ్ళింది, ఏం చేసింది మొత్తం నాకు చెప్పాలి."

"అర్థమయింది. అలాగే."

"జాగ్రత్త సుమా. అతను హంతకుడు."

"నేను కూడా. మీ డిపార్ట్‌మెంట్ మరి నాకు దీనివల్ల చేసే వుపకారం ఏం వుంటుంది?"

"రోజుకి పదిహేను రూపాయలు."

"ఎప్పటినుంచి ఇలా రోజువారిగా మనుషులకి వుద్యోగం ఇస్తోంది మీ డిపార్ట్‌మెంట్?"

"ఇది నా స్వంతపని. డిపార్ట్‌మెంట్‌తో దీని కేమీ సంబంధం లేదు. డబ్బు నేనిస్తాను. రైట్?"

"మీ ఇంట్రెస్ట్ ఏమిటి దీంట్లో?"

"నీ ఇంట్రెస్ట్ మాత్రం చూసుకో చాలు. వెంటనే పని ప్రారంభించు."

ఫోన్ పెట్టేశాడు కూపర్. బెంగుళూరులో క్రొత్తగా కట్టిన అశోకా హోటల్ లాంజ్‌లో కూర్చునున్నాడు కూపర్, సిగరెట్ కాలుస్తూ, పబ్లిక్ కాల్ టెలిఫోన్ బూత్ లోంచి వచ్చి.

ఏర్‌పోర్ట్ నుంచి కూపర్ హేరిస్‌ని అనుసరించాడు అశోకాకి, హేరిస్‌కి అనుమానం కలగకుండా. దారిలో ఏ సంఘటన జరగలేదు. సరాసరి టేక్సీలో హోటల్‌కి వచ్చేసాడు

హారిస్.

పదిహేను నిముషాల తర్వాత లోపలికి వస్తున్న జానీని చూసి లేచాడు కూపర్, చేతిలోని పేపర్ మడిచి. ఏష్ట్రేలో పడేసాడు సిగరెట్ ని.

"ఏమిటి సంగతి?" అడిగాడు జానీ, కూపర్ ని రహస్యంగా.

"అవసరం వచ్చినప్పుడు చెప్తాను."

"ఉదయం ఓ అమ్మాయిని పంపాను. గొడవ చేసావటగా?" అడిగాడు జానీ.

"ఛీ. ఛీ. అదీ ఆడదేనా? రాక్షసి. అలాంటి వాళ్ళని పంపింతే ఇక నీకు డబ్బు ముట్టదు," అన్నాడు కూపర్.

"ఏం? నీ మాట వినలేదా?"

"తన మాట వినమని గోల చేసింది. ఐ హేట్ సచ్ అబ్సీన్ మెథడ్స్ ఆఫ్ ప్లెషర్."

చిన్నగా నవ్వి అన్నాడు జానీ.

"దిగితే గాని రుచి తెలియదు."

"జాగ్రత్త" మరోసారి హెచ్చరించి బయటికి కదిలాడు కూపర్, క్రొత్త సిగరెట్ వెలిగించుకొని.

# 3

డియర్ కూపర్,

చాలా కాలం తర్వాత ఉత్తరం వ్రాస్తున్నాను, ఒక ముఖ్యమయిన సంగతి తెలియచేయడానికి.

హారిస్ గుర్తున్నాడా నీకు?

మూడేళ్ళక్రితం మనం ఇద్దరం హారిస్ గురించి ఎంత తంటాలుపడ్డామో గుర్తుంది కదా? ఆ హారిస్ బెంగుళూరు వస్తున్నాడు త్వరలో. బెంగుళూరు ప్రాంతంలో వున్న ఆ బంగారం కోసం వస్తున్నాడని నాకు నమ్మకంగా తెలిసింది.

హారిస్ ఎప్పుడు వచ్చేది, ఎలా వచ్చేది నీకు టెలిగ్రాం

ద్వారా త్వరలో తెలియపరుస్తాను, గ్రూపింగ్ 3 కోడ్ ద్వారా. నీ ప్రయత్నం నువు చేయి. నా వాటా నాకిస్తావని నమ్మి ఈపని నీకు అప్పచెబుతున్నాను.

విష్ యు బెస్ట్ ఆఫ్ లక్....

— కూపర్ మూడురోజుల క్రితం వచ్చిన ఆ వుత్తరాన్ని మరోసారి చదివాడు. ఆ వుత్తరాన్ని కావాలనే చించెయ్యలేదు. తన స్నేహితుడి చేతివ్రాతతో లేకపోయినా, ఎందుకయినా మంచిదని, ఎప్పటికయినా వుపయోగిస్తుందని దాన్ని దాచి వుంచాడు.

కూపర్ దాదాపు మూడేళ్ళ క్రితం సంగతి గుర్తుచేసుకోసాగాడు.

* * *

హేరిస్ పేరువిని ఏ యూరోపియనో అనుకున్నాడు తను. యూరోపియన్ కాదు. భారతీయుడే.

క్రిష్టియన్ కాబట్టి హేరిస్ అనే పేరుపెట్టారు తలితండ్రులు. చిన్నప్పటినుంచీ పోకిరీగానే తిరిగాడు హేరిస్, చిల్లరమల్లర దొంగతనాలు చేస్తూ. మంచి పేరులేదు హేరిస్‌కి మంగుళూరులో.

మంగుళూరులో పుట్టిన హేరిస్ కొంకిణీ క్రిష్టియన్. ఓ స్మగ్లింగ్ గేంగ్‌లో ప్రవేశించాడు తన పనిహేడ్డో ఏటే. బంగారం, వాచీలు, టెర్లిన్ బట్టలు, బ్లేడ్స్ వగైరాలు స్మగ్లింగ్ చేయటంలో ఎంతో అనుభవం గ్రహించాడు.

హేరిస్‌ని ముఖాముఖి ఎప్పుడూ చూడలేదు కూపర్. ఆ అవకాశం దొరకలేదు ఎప్పటికీ, ఎంత ప్రయత్నించినా. మూడేళ్ళ క్రితమే గ్రహించాడు కూపర్, హేరిస్ ఎంతో చతురుడనీ, ఎంతో సమర్థుడైన నేరస్థుడనీ.

దుబాయ్‌లోని ఓ సంస్థకి బంగారం పంపి, అక్కడనుంచి కొన్ని వస్తువులు దిగుమతి చేయడం హేరిస్ వృత్తి. ఓసారి

ముందే సమాచారం అందింది. కూపర్ ఎలాగైనా హేరిస్ విషయం అంతు చూడలనుకున్నాడు.

దాదాపు ఇరవై అయిదు లక్షల రూపాయలు విలువచేసే, ఇరవై అయిదు బంగారం బార్స్ హేరిస్ రహస్యంగా పంపాలనే ప్రయత్నంలో వున్నాడు మంగుళూరుకి పదిహేను మైళ్ళ దూరంలోవున్న సముద్రప్రాంతం నుంచి.

కూపర్, అతని స్నేహితుడు, మరో ఇద్దరు, ఎంతో ప్రయాసపడి కనుక్కోగలిగారు వందల మైళ్ళువున్న సముద్రం వడ్డులోని ఆ చోటు.

గంటముందే వెళ్ళారు నలుగురూ. ఆ రాత్రి పదిన్నర నుంచి, తెల్లవారుఝామున మూడుదాకా వేచి వున్నారు హేరిస్ కోసం. అనుకున్నట్లుగానే చీకట్లో వచ్చాడు హేరిస్.

నలుగురూ మోసపోయారు. హేరిస్ ముందర రాకుండా, కారుదగ్గరే ఆగి, తన డ్రయివర్‌ని పంపాడు ముందర.

పట్టుకున్నాక ఆ సంగతి తెలిసింది, హేరిస్ కాదని. కారులో పారిపోయాడు, ఆ నలుగురికీ చిక్కకుండా. ఎంతో నిరుత్సాహపడ్డారు ఆ నలుగురూ. కూపర్ చాలా బాధ పడ్డాడు నలుగురుండీ ఏంచేయలేకపోయినందుకు, హేరిస్ ఆ బంగారంతో కారులో పారిపోయినందుకు.

మర్నాడు మధ్యాహ్నం మంగుళూరులో అరెస్ట్ చేశారు పోలీసులు హేరిస్‌ని. హేరిస్ మీద ఎన్నో కేసులున్నాయి. చాలారోజులనుంచి వెతుకుతున్నారు పోలీసులు హేరిస్ కోసం.

కూపర్‌కి హేరిస్ అరెస్ట్ వార్త పేపర్ద్వారా తెలిసింది. హేరిస్ దగ్గర ఆ పాతిక లక్షలు విలువచేసే బంగారం దొరకలేదు. హేరిస్ ఇల్లు సోదాచేశారు రహస్యంగా. హేరిస్ ఆఫీసు క్షుణ్ణంగా వెదికారు.

మరో నెలరోజులదాకా ప్రయత్నించి, ప్రయత్నించి విసిగి వేసారిపోయి విరమించుకున్నారు ఆ ప్రయత్నంనుంచి. హేరిస్‌కి రెండున్నర సంవత్సరాల కఠినశిక్ష పడింది, అతని నేరాలలో చాలాభాగం రుజువయి.

హైకోర్ట్‌కి కూడా వెళ్ళి ప్రయత్నించాడు కాని శిక్ష సడలలేదు. జైలుకి వెళ్ళాడు హేరిస్.

తర్వాత క్రమంగా ఆ సంగతే మర్చిపోయాడు కూపర్, కొత్తవిషయాలలోపడి. హేరిస్ ఆ బంగారాన్ని ఏంచేశాడో మాత్రం అంతుచిక్కలేదు కూపర్‌కిగాని, మరెవరికయినా గాని.

అనేక వూహాగానాలుచేసి, అనేకచోట్ల వెతికి, అనేక ప్రయత్నాలు చేసాడు తన స్నేహితుడు. కూపర్ మాత్రం ఇక అట్టే వుత్సాహం చూపక వదిలేసాడు, దొరుకుతుందనే నమ్మకం పూర్తిగా నశించటంవల్ల.

తర్వాత తన స్నేహితుడు ఢిల్లీ వెళ్ళిపోయాడు.

హేరిస్ జైలునుంచి వచ్చాడు బయటకి, బెంగుళూర్‌కి. మళ్ళీ వేట మొదలయింది బంగారంకోసం.

# 4

హేరిస్ చేత్తో తనకత్తిపదును పరీక్షించి చూసుకున్నాడు ఓసారి. దాన్ని మడిచి, కుడికాలి బూటుకున్న సాక్స్‌లోకి తోసాడు.

రూమ్‌బాయ్ టేబిల్‌మీద పెట్టిన కాఫీకప్పు నందుకుని కాఫీతాగాడు, కొంచెంకొంచెం సిప్‌చేస్తూ, ఆలోచిస్తూ.

జైలునుంచి విడుదలయి మూడునెలలుదాటింది. మూడు నెలలు, ఢిల్లీలో ఉన్నంతకాలం, ఎంతోజాగ్రత్తగా గమనించాడు తననెవరైనా వెంటాడుతున్నారానని. పోలీస్‌లు నెలరోజులదాకా వెంటాడి తర్వాత మానేసారు.

పూర్తిగా మానేయలేదని మరో పదిరోజుల తర్వాత గ్రహించాడు. అప్పుడప్పుడు తన రొటీన్ ని చెక్ చేయడానికి ఎవరో తనని వెన్నాడుతూండేవారు. వాళ్ళని అంతగా పట్టించుకోలేదు.

ఈ వృత్తిలోని పరిచయస్థుల నెవ్వరినీ కలవకుండా దూరంగావుండి మామూలు జీవితం గడిపాడు హేరిస్, ఎప్పటిలాగానే. ఢిల్లీలో వున్నంతకాలం ఖరీదయినఅశోకా హోటల్ లో తను ఉండటానికి తనకి డబ్బు ఎలా లభిస్తోందనే అంశంమీదే పోలీసులు తర్వాత పరిశోధించినట్లు గ్రహించాడు హేరిస్.

అంటే తను పట్టుపడబోయేముందు జరిగిన ఆ పాతిక లక్షల విషయంగురించి ఎవరూ అంతగా శ్రద్ధవహించటం లేదన్నమాట. పోలీస్ లకి అసలు దానిసంగతే తెలియదు.

మరో నెలా పదిహేనురోజులు ఆగి, తన విషయంలో ఎవరూ ఇంట్రెస్ట్ చూపించటంలేదని గ్రహించాక మళ్ళీ తనపని ప్రారంభించదలచుకున్నాడు హేరిస్.

ఫలితంగా, రహస్యంగా ఓ సీట్ బుక్ చేయించుకుని బెంగుళూరు వచ్చాడు.

జేబులోంచి ఓ చిన్నకవరు తీసి దానివంక పరీక్షగా చూశాడు హేరిస్. అలా ఎన్నోసార్లు చూసాడు బెంగుళూరు వచ్చిన ఈ రెండురోజుల్లో.

చిన్నగా నవ్వుకున్నాడు.

తనని ఇంకా వదలలేదు ఎవరో. తనకోసం, తనుదాచిన ఆ బంగారంకోసం ప్రయత్నిస్తూనే వున్నారు. ఏర్ పోర్ట్ లో, పబ్లిక్ ఎడ్రస్ సిస్టమ్ద్వారా పిలచి, తనకి అందచేసారు ఆ కవరు. ఎందుకు?

ఆ కవరులోని కాగితంమీద వ్రాసివుంది.

"వెల్ కం టు బెంగుళూర్."

ఎవరు అందచేసారు ఆ కవరు? ఎందుకు? ఆ ఉత్తరంలోని మాటలలోని అంతరార్థం ఏమయివుంటుంది?

ఎన్నిసార్లు ఆలోచించినా అంతుపట్టలేదు హేరిస్ కి.

తన మిత్రు లెవరయినా ప్రాక్టికల్ జోక్ వేసివుంటారా? ఇది జోక్ కాదే? అయినా తను బెంగుళూరు వస్తున్నట్లు ఎవరికీ తెలియనివ్వలేదే, తన మిత్రులకికూడా?

ఇంకా తనకి ప్రమాదం ముగియలేదనే నిర్ధారణకి వచ్చాడు హేరిస్. జాగ్రత్తగా వుండాలి.

చిన్న గంబాటిల్ తో, ఆ కాగితంకి ఓ మూల కొద్దిగా తుమ్మజిగురు పూసాడు. ఆ కవరులో తెల్లకాగితాన్ని వుంచి మూసాడు కవరు. నిర్లక్ష్యంగా డ్రాయర్ మీద పడేసాడు ఆ కవరుని.

కొన్ని నిముషాల్లో ఆ కవరులో అతుక్కుంటుంది ఆ తెల్లకాగితం, ఓ మూల స్వల్పంగా, తుమ్మజిగురువల్ల.

హేరిస్ బయటకివచ్చి, తన గదితలుపుమూసి, తాళం వేసి కిందకి వచ్చాడు. రిసెప్షనిస్ట్ కి తాళంచెవి అందించి బయటకి నడిచాడు.

టాక్సీలో ఎక్కి చెప్పాడు డ్రయివర్ కి.

“లాల్ బాగ్.”

టాక్సీలో వెనకసీట్ లో కూర్చుని, ఇర్వింగ్ వేలెస్ నవల ‘ది ప్రైజ్’ తెరిచాడు. అది చదువుతూ, మధ్య మధ్యలో వెనక్కి తిరిగి చూడసాగాడు.

మోటార్ సైకిల్ మీద కొంచెందూరంలో, రెండుకార్ల వెనకాల వస్తున్న ఒకతన్ని గమనించాడు హేరిస్. అశోకా హోటల్ లాంజ్ లో, బయట, కారిడార్ లో అనేకసార్లు తచ్చాడుతూ తిరగడం గమనించాడు హేరిస్ అతన్ని.

కావాలని లాల్ బాగ్ కి చుట్టూ తిరిగి పోనివ్వమన్నాడు హేరిస్ డ్రయివర్ని. టేక్సీ లాల్ బాగ్ ముందు ఆగుతుం

డగా తన అనుమానం ధృవపడింది హేరిస్‌కి, కొంచెం దూరంలో మోటార్ సైకిల్ ఆపుతున్న అతన్ని చూసి.

తనని ఖచ్చితంగా వెంటాడుతున్నాడు.

టేక్సీ ఫేర్ చెల్లించి లోపలికి నడిచాడు హేరిస్ తీవీగా. లాల్ బాగ్, బెంగుళూరులోని అత్యంత అందమయిన తోట. బొటానికల్ గార్డెన్ నిజానికది. అనేక రకాల మొక్కలు, లతలు, చెట్లు, ఔషధాలు తయారు చేయగలగడానికి ఉపయోగించే పాదలతో నిండివుంటుంది లాల్ బాగ్.

అరగంట దాకా లాల్ బాగ్‌లో తిరుగాడుతూ తనవెంట పడ్డ అతన్ని గమనించాడు హేరిస్.

బయటికి వచ్చి, టేక్సీలో ఎక్కి చెప్పాడు డ్రయివర్‌కి.

"హోటల్ సెఫైర్."

పావుగంట తర్వాత సెఫైర్ హోటల్ ముందు ఆగింది టేక్సీ. హేరిస్ ఫేర్ చెల్లించి లోపలకి నడిచాడు.

ఇద్దరు ముగ్గురు స్నేహితులు గుర్తుపట్టారు హేరిస్‌ని, ఓ మూల బల్లముందు కూర్చోగానే. ఆశ్చర్యంతో దగ్గరకివచ్చి పలకరించారు.

"ఎలావున్నావ్? ఎప్పుడు వచ్చావ్?"

సమాధానంగా చిరునవ్వునవ్వేడు హేరిస్.

"ఎక్కడ వుండేది?" అడిగాడు ఒకతను.

"హోటల్ క్లేరిడ్జస్" కావాలని అబద్ధం చెప్పాడు హేరిస్ తన స్నేహితులకి.

బేరర్ రాగానే చెప్పాడు హేరిస్.

"గురూబీర్, ఆమ్లెట్, మటన్ కోఫ్తా, తండూరిరోటి, బ్రెడ్ విత్ జామ్."

బేరర్ వెళ్ళిపోయాక అడిగాడు హేరిస్ తన స్నేహితులలో ఒకతన్ని.

"ఆమూల టేబిల్ ముందు కూర్చుని దొంగ చూపులు చూస్తున్న అతనెవరో చెప్పగలవా?"

హారిస్ స్నేహితుడు తేరిపారజూసి అన్నాడు.

"జానీ."

"జానీ? నా వెంట పడ్డాడేం?"

"ఏమో! అడగనా వెళ్ళి?"

"వద్దు. నేనే కనుక్కుంటాను."

"ఎలావుంది జైలు జీవితం?"

"మొదటిసారికాదుగా. అయినా మన జైల్స్‌లో ఇంకా డెవలప్‌మెంట్ చాలారావాలి."

"నేనుకూడా ఈ మధ్యోసారి వెళ్ళివచ్చాను" అన్నాడు వాళ్ళలో ఒకతను నవ్వి.

బేరర్ ఆర్డరిచ్చినవన్నీ తీసుకువచ్చి అమర్చాడు టేబిల్ మీద, హారిస్ ముందు, నీట్‌గా.

తండూరిరోటీ, మటన్ కోఫ్తా కలిపితింటూ అన్నాడు హారిస్, కొద్దిగా బీరు చప్పరించి.

"ఇక్కడ విశేషాలేమిటి?

"కష్టమ్స్, ఎక్సైజ్ కలెక్టర్స్ కొత్తవాళ్ళొచ్చారు. చాకు లాంటివాళ్ళు. విపరీతంగా రెయిడ్స్ చేస్తున్నారు ఇద్దరూ. పనికిదివరకటిలా సులభంగా చేసుకోవటం కష్టమయిపోతోంది."

గంటదాకా స్నేహితులతో కబుర్లు చెప్తూ హారిస్ తన లంచ్ ముగించాడు. బేరర్ బిల్ తీసుకు రాగానే రెండు ఇరవై రూపాయల నోట్లని పడేసాడు ప్లేట్‌లో.

బేరర్‌కి టిప్ వదిలి మిగతా డబ్బు తీసుకున్నాడు హారిస్.

"మళ్ళీ ఏమయినా అవసరంవస్తే కబురు చెయ్యి బ్రదర్. ఈ మధ్య చేతిలో పనేంలేదు" అన్నారు హారిస్ స్నేహితులు.

"తప్పకుండా. ముందర మళ్ళీ కాంటాక్ట్ చెయ్యాలిగా పార్ట్లని. ఆపనిలోనే వున్నాను" అన్నాడు హేరిస్ లేచి.

బయటకి నడిచాడు, తను తాగిన గురూబీర్ బావుందను కుంటూ. క్రొత్త ప్రొడక్ట్ అది. తను జైలుకు వెళ్ళక మునుపు ఆ బ్రాండ్ తయారు చెయ్యటంలేదు మోహన్ మీకిన్స్.

టేక్సీలో సరాసరి అషోకా హోటల్‌కి చేరుకున్నాడు హేరిస్. రిసెప్షనిస్ట్ దగ్గర తాళంచెవి తీసుకుని తన గదివైపు అడుగులు వేసాడు.

## 5

కూపర్ ఆ అవకాశం కోసమే ఎదురు చూస్తున్నాడు. హేరిస్ బెంగుళూరు వచ్చి రెండు రోజులయింది. రెండు రోజులనుంచి కదలలేదు అషోకా హోటల్ తన గదిలోంచి.

హేరిస్ బయటకి రావటం, తాళంచెవి రిసెప్షనిస్ట్‌కిచ్చి టేక్సీలో ఎటో వెళ్ళడం గమనించాడు. కూపర్‌తో చెప్పి జాన్, హేరిస్‌ని అనుసరించడానికి బయలుదేరాడు, తన మోటర్ సైకిల్ మీద.

మూడు నిముషాల తర్వాత కూపర్ లేచి తొమ్మిదో నెంబర్ గదివైపు అడుగులు వేసాడు. నడవాలో ఎవరూ లేరు. జేబులోంచి 'పిక్ లాక్' తీసి, తొమ్మిదో నెంబర్ గది తలుపు తెరుచుకుని లోపలకి వెళ్ళాడు క్షణాలలో.

లోపల మళ్ళీ తలుపు తాళంవేసి, పరీక్షగా చూశాడు ఆ గదివంక. ఖరీదైన ఫర్నిచర్, సోఫా సెట్స్, నిలువెత్తు అద్దం, టేబిల్, బెడ్, టెలిఫోన్.

వెతకడం మొదలు పెట్టాడు కూపర్, నిదానంగా. ప్రతీ వస్తువు పరీక్షగా చూడసాగాడు. హేరిస్ వి. ఐ. పి. సూట్ కేస్ నిండా బట్టలు, ఛేస్ నవలలు రెండు, ఎలక్ట్రిక్ షేవర్, టూత్ బ్రష్, టూత్ పేస్టు మొదలయినవి వున్నాయి.

ఛేస్ నవలలు రెండూ తెరచి లోపల ఏమయినా కాగితాలు దొరుకుతాయేమోనని చూసాడు. ఏమీ లేవు.

టేబిల్ దగ్గరకి వెళ్ళి, దానిమీద వున్న స్క్రిబిలింగ్ పేడ్ తెరచి చూసాడు. ఖాళీగావుంది అంతా. అద్దం వెనక, కార్పెట్ కింద, సోఫా సెట్ల కింద చూసాడు. ఏమీ దొరకలేదు. హేరిస్ రహస్యంగా ఏమయినా దాచి వుండచ్చని, అనుమానంతో వెదికాడు కూపర్.

డ్రాయర్ తెరిచాడు తరువాత.

లోపల తను ఏర్ పోర్ట్‌లో రిసెప్షనిస్ట్ ద్వారా అందజేసిన కవరువుంది. తెరచి బయటకి కాగితంలాగి చూసాడు. మళ్ళీ కాగితం మడచి లోపలపెట్టి, డ్రాయల్‌లో పడేసాడు కవరుని.

మరో అయిదు నిముషాలసేపు వెదికాడు హేరిస్ ఆ గదంతా. వెదుకుతుంటే చప్పుడయింది తలుపు బయట తాళం చెవితో తాళం తీస్తున్నట్టుగా.

కూపర్ గుండె ఝల్లుమంది. గుండెలో రైళ్లు పరుగెడుతున్నట్లుగా అనిపించింది. చటుక్కున ఒక్క గెంతులో బాత్ రూంలోకి దూకి తలుపు మూసాడు. హేరిస్ అంత త్వరగా తిరిగి వస్తాడనుకోలేదు కూపర్.

కూపర్ తలుపు మూయగానే లోపలికి వచ్చాడు వకడు. తనవెనకే తలుపుమూసి ఆ గదివంక నిశితంగా చూసాడు. సూట్ కేస్ వైపు నడిచి జాగ్రత్తగా తెరచి, ఒకొక్క వస్తువునే తీసి వెదకసాగాడు. తర్వాత డ్రాయర్ వైపు నడిచాడు.

కూపర్‌కి లోపల చమటలు పడుతోంది భయంతో. తనని కనుక్కుంటే?

వణకుతున్న చేతుల్తో, ఎంతో జాగ్రత్తగా, వూపిరి బిగబట్టి వెంట్రుకవాసంత తెరిచాడు బాత్ రూంకీ, ఆ గదికీ

మధ్యవున్న తలుపుని. ఇంకొంచెం తెరచి సందులోంచి చూసాడు.

ఆశ్చర్యపోయాడు కూపర్.

హారిస్ కాదు. మరెవరో. అతను చేస్తున్న పనిని చూసి మరింత ఆశ్చర్యపోయాడు. తనలాగే వెదుకుతున్నాడు గదిని జాగ్రత్తగా, అంగుళం, అంగుళం.

ఎవరతను? ఎందుకు వెదుకుతున్నాడు? తనలాగే హారిస్ దాచిన బంగారం కోసం వెదుకుతున్నాడా? అయితే ఆ రహస్యం ఇతనికెలా తెలుసు?

అతని రూపు రేఖలు, బట్టలూ, వెనకనుంచి కనబడే తల, జుట్టు, కదలికలు గుర్తు పెట్టుకున్నాడు కూపర్ జాగ్రత్తగా. అతను బాత్ రూం వైపు తిరుగుతూండగా తలుపు మూసేసాడు పూర్తిగా. ఖాకీ కలర్ షర్ట్, బ్లూ కలర్ పేంట్ గుర్తు పెట్టుకున్నాడు!

లోపలికి వస్తాడా?

వూపిరి బిగబట్టి, బలమంతా వుపయోగించి, బాత్ రూం తలుపు పిడిగట్టిగా పట్టుకున్నాడు కూపర్, లోపల లాచ్ లాక్ చేసి, అతను బయటనుంచి తలుపు తెరవకుండా.

కూపర్ భయపడ్డట్టుగా అతని దృష్టి బాత్ రూం మీద పడలేదు. వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిపోయిన రెండు నిముషాలకి, అలికిడి వినబడక పోవటంవల్ల కూపర్ తలుపుకువున్న లాచ్ తీసి, కొంచెం తెరచి చూసాడు, జాగ్రత్తగా.

ఖాళీగా వుంది గది. వెళ్ళిపోయాడు అతను.

బయటికివచ్చి, తలుపుమూసి తనూ బయటకి వెళ్ళాడు కూపర్. నడవ ఖాళీగా వుంది.

గబగబా లాంజ్ వైపు నడిచాడు. లాంజ్ లోని వాళ్ళ వంక చూసాడు బయటకి వెళుతూ.

ఇందాక హేరిస్ గది వెదికినతను కూర్చుని వున్నాడు ఓ మూల, ప్రక్కన కూర్చునున్న మరొకతనితో మాట్లాడుతూ.

# 6

హేరిస్ తాళం చెవితో గది తలుపు తెరిచి లోపలకి వెళ్ళాడు.

తలుపుమూసి ఓసారి గదివంక చూసాడు. సూట్ కేస్ దగ్గరకి వెళ్ళి ఆగి దానివంక చూసి, మూత తెరచి చూసాడు ఆలోచనగా.

వెదకబడింది సూట్ కేస్. లోపల వస్తువులు తనుంచి నట్లుగా లేవు. గబగబా టేబిల్ దగ్గరకి నడిచి, డ్రాయర్ లాగి, లోపలనుంచి కవరు బయటకి తీసాడు.

కవరులోంచి కాగితం తీయకుండా కవరు అంచులని చింపాడు కుడిచేతి చూపుడు వేలితో. లోపలనుంచి కాగితం జారి కిందపడింది. అతుక్కునిలేదు కవరు లోపల.

అంటే ఎవరో కాగితాన్ని బయటకితీసి చూసారు. అలా తీయడంవల్ల, ఆ కాగితం ఓ మూలగా తను జిగురులో అంటిం చిన కాగితం విడదీయబడింది కవరునుంచి. లేకపోతే అతు క్కునే వుండేది.

ఎవరు వచ్చి వెదికివుంటారు తను లేనప్పుడు?

జానీకాదు. జానీ తనని వెంబడిస్తూ, తన చుట్టుప్రక్కలే ఉన్నాడు. మరెవరో ఈ పని చేసారు.

ఎవరయి వుంటారు? జానీకి, ఆ మరొకరికి సంబంధం ఉండివుంటుందా? లేక తనమీద ఇంకొకరుకూడా కన్ను వేసివుంచారా? మొత్తానికి తనని రహస్యంగా గమనిస్తు న్నారు ఎవరో.

చాలా జాగ్రత్తగా ఉండాలి తను. చిన్నగా నిట్టూ ర్చాడు హేరిస్. ముందర తనచుట్టూవున్న ఆగ్రహాలని

వదిలించుకోవాలి. అప్పటిదాకా తను శాంతిగా, స్వేచ్ఛగా ఉండలేదు. అలా తనని రహస్యంగా, తనకి తెలియకుండా దొంగతనంగా వాచ్ చేస్తూండటం తనకి నచ్చదు ఎంత మాత్రం.

## 7

"హలో కూపర్?"

"జానీ ఏమయిందో చెప్పు" ఫోన్‌లో అడిగాడు కూపర్.

"చాలాచోట్లకి వెళ్ళాడు."

"చెప్పు. వివరంగా అంతా చెప్పు."

జానీ వివరంగా చెప్పాడు మొదటినుంచి చివరదాకా, హేరిస్ ఎక్కడెక్కడికి వెళ్ళిందీ, ఏం చేసిందీ, తిరిగి అశోక్ హోటల్‌కి వచ్చేదాకా.

"హోటల్ సెఫైర్‌లో ఎవరితో మాట్లాడాడో తెలుసా? ఏం మాట్లాడాడో తెలుసా?" అడిగాడు కూపర్ అంతా శ్రద్ధగా విని.

"ఏంమాట్లాడాడో తెలియదు. ఎవరితో మాట్లాడాడో తెలుసు. నాలాంటివాళ్ళే వాళ్లుకూడా."

"హేరిస్ వాళ్ళకేమైనా పనిచెప్పాడా?"

"లేదనుకుంటాను. తెలీదు."

"జానీ. లాంజ్‌లో, ఖాకీకలర్ షర్ట్, బ్లూకలర్ పేంట్‌లో ఉన్నాడొకడు, ఎర్ర టై కట్టుకుని. అతనిమీద ఓ కన్నేసి వుంచు" చెప్పాడు కూపర్.

"ఏం? ఎవరతను?"

"అదే తెలుసుకోవాలి. ఎవరో ఊహించగలనుగాని, నిశ్చయంగా తెలియదు. నాకు శత్రువులని గుర్తుంచుకో."

"అలాగే."

"ఏమయినా ముఖ్యమయిన సంఘటనలు జరుగుతే నాకు తెలియచేయి వెంటనే."

"ష్యూర్."

ఫోన్ పెట్టేశాడు కూపర్.

తను జాగ్రత్తగా ఉండాలి. ఢిల్లీలోని తన మిత్రుడు చేతులు ముడుచుకుని కేవలం తనమీదే ఆధారపడి కూర్చోలేదు. తన మనుషులని నియమించుకున్నాడు బంగారం వేటలో. ఆ కాఫీకలర్ షర్టు అతను నిస్సందేహంగా తన మిత్రుడి మనిషే అవచ్చు. బహుశ, తననికూడా ఎవరయినా గమనిస్తూ ఉండివుండచ్చు.

# 8

జానీ మళ్ళీ బయలుదేరాడు, హేరిస్ వెంబడే. హేరిస్ మళ్ళీ బయటకి వచ్చాడు. టేక్సీలో బయలుదేరగానే తన మోటార్ సైకిల్ మీద టేక్సీ వెనకపడ్డాడు.

ఓ చిన్న డొక్కు కారులో ఆ కాఫీకలర్ షర్టు అతను కూడా హేరిస్ వెనకే రావడం గమనించాడు జానీ. కూపర్ తెలివికి కొద్దిగా అబ్బురపడ్డాడు. ఎలా కనుక్కోగలిగాడు ఇంట్లో కూర్చునున్న కూపర్, లాంజ్ లోవున్న ఈ కాఫీకలర్ షర్టు అతని గురించి?

అసలు హేరిస్ ఎవరు? ఎందుకు అతన్ని తను ఇలా వెంబడించడం? ఆ కాఫీకలర్ షర్టు అతను దేనికి వెంబడిస్తున్నాడు? ఏమిటి తనకి తెలియని ఆ పరమరహస్యం? ఎలా కనుక్కోవటం?

ఆ కాఫీకలర్ షర్టు అతన్ని ఇదివరకెక్కడా చూడలేదు. ప్రక్కనే కారులోవున్న ఆ బోండాంగాడెవడు? దెబ్బలాడటానికా, అవసరంవస్తే?

హేరిస్ టేక్సీ ఓ చిన్నషాపు ముందర ఆగటంచూసి,

తను ఆపాడు జానీ మోటార్ సైకిల్ ని, ఆ డొక్కు కారుకి ప్రక్కగా, కొంచెం దూరంలో. వాళ్ళలో వాళ్ళు మాట్లాడుకుంటున్న మాటలు వినిపించాయి.

'పాతిక...బంగారం' అన్న రెండు ముక్కలుమాత్రం జానీ చెవుల్లో దూరాయి. బంగారం మాటవింటే చాలు జానీకి ఎక్కడలేని ఉత్సాహం వస్తుంది.

బంగారం!

హేరిస్ దగ్గర బంగారం ఉండివుంటుందా?

ఉంటే ఎంత? పాతిక?? ఏమిటా పాతిక?

తులాలయివుండవు. వేలో, లక్షలో ఖరీదుచేసే బంగారం అయివుంటుంది. తగదు అంతకి. అంతకంటె తక్కువయితే, కూపర్ కి ఇంట్రెస్ట్ ఉండదు హేరిస్ మీద.

ఆ షాప్ లోంచి చిన్న సూట్ కేస్ తో హేరిస్ బయటకి రావడం చూసాడు జానీ. మళ్ళీ, టేక్సీ ఎక్కగానే కదిలింది వాళ్ళ టేక్సీ.

ఏంవుండివుంటుంది ఆ చిన్న సూట్ కేస్ లో? పుస్తకాల షాప్ అది. పుస్తకాలయివుండవు. మరేమయివుండచ్చు? బంగారం అయివుండచ్చు. ఆ సూట్ కేస్ కోసమే ఎదురు చూస్తున్నాడేమో కూపర్.

కూపర్ కి ఫోన్ చేయబోయేముందు తనోసారి ప్రయత్నించి చూస్తే? అదృష్టం తనపక్షంవుంటే, తప్పకుండా ఆ బంగారం తనపక్ష మవుతుంది. లేకపోయినా ప్రయత్నించటంవల్ల వచ్చేనష్టం ఏమీవుండదు.

అషోకాహోటల్ ముందు ఆగింది టేక్సీ మళ్ళీ. తన బైక్ ని ఆపి లోపలికి వెళ్ళాడు జానీ. జానీకికూడా విసుగు పుడుతోంది ఇలా తోక తెలియకుండా ఇలా పూరికే హేరిస్ వెంట తిరగడం. లాంజ్ లో రిసెప్షనిస్ట్ తనవంకే అనుమానంగా చూస్తున్నాడు.

తన స్నేహితుడు ఢిల్లీనుంచి రావాలని, అతనికోసం ఎదురుచూస్తున్నాననీ అబద్ధం చెప్పాడు ఓసారి అడిగితే.

హేరిస్ తన గదిలోకి వెళ్ళాక అయిదు నిమిషాలు ఆగాడు జానీ. తర్వాత రూం నంబర్ తొమ్మిది ముందుకు వెళ్ళి ఆగాడు. తలుపు తీసాడు గట్టిగా. తెరుచుకుంది వెంటనే.

లోపల హేరిస్ కూర్చునివున్నాడు టేబిల్ కి ఎదురుగా; ఆ సూట్ కేస్ తెరచి వుంది. దాంట్లోకి చూస్తున్నాడు హేరిస్.

'ఎవరునువ్వు? ఏంకావాలి?' అని అడుగుతాడనుకున్నాడు జానీ హేరిస్ తనని గదిలోకి రాగానే. సమాధానం ఆలోచించి పెట్టుకున్నాడు ముందరే.

అలా అడగలేదు. పైపెచ్చు తనవంక చూసి చిరునవ్వు నవ్వటం ఆశ్చర్యాన్ని కలిగించింది.

''కమాన్ మైడియర్ బోయ్. ఆలస్యం చేసావే? నీకోసమే ఎదురుచూస్తున్నాను'' అన్నాడు హేరిస్ నవ్వుతూ.

సూట్ కేస్ లోంచి హేరిస్ తనచేతిని బయటకితీసి, జానీకి కనపడేలా పట్టుకున్నాడు.

హేరిస్ చేతిలో నల్లగా నిగనిగలాడుతున్న రివాల్వర్ వంక చూసాడు జానీ కొంచెం భయంగా. సైలెన్సర్ అమర్చి వుంది దానికి.

''కూర్చో ఆ సోఫాలో.''

రివాల్వర్ తో సోఫాని చూపిస్తూ ఆజ్ఞాపించాడు హేరిస్. జానీ కిక్కురుమనకుండా సోఫాలో కూర్చున్నాడు ఎదురుగా.

''ఇప్పుడు చెప్పు. ఎవరు నువ్వు? ఎందుకు నీ మోటార్ సైకిల్ మీద నన్ను వెంటాడుతున్నావ్? నీ స్నేహితులు ఇంకా ఎంతమంది వున్నారు?'' అడిగాడు హేరిస్.

జానీ సమాధానం చెప్పలేదు. అలాగే చూస్తూ కూర్చున్నాడు.

"నా ప్రశ్నలకి సమాధానం ఇవ్వకుండా ఈ గదిలోంచి బయటపడలేవు."

లేచాడు హేరిస్. రివాల్వర్ జానీకి గురిపెట్టే, తలుపు దగ్గరకి నడిచి వెళ్ళి, తలుపు లోపల బోల్ట్ పెట్టాడు. ఎదురుగా వెళ్ళి కూర్చున్నాడు సోఫాలో జానీవంక చూస్తూ.

"నీ పేరు?"

"..."

"జానీ. ఆలస్యం నా శత్రువు. త్వరగా చెప్పు. ఎందుకు నన్ను వెంటాడుతున్నావ్?"

జానీ కొద్దిగా వులిక్కి పడ్డాడు తనపేరు హేరిస్‌కి ఎలా తెలిసిందా అని. హేరిస్ కుడిచేయి కుడికాలి సాక్స్‌లో వున్న కత్తిని బయటకి తీసింది. క్లిక్‌మన్న చప్పుడుతో కత్తి తెరుచుకుంది యాంత్రికంగా జానీ కళ్ళ ముందే.

కర్కశంగా చూస్తూ అన్నాడు హేరిస్.

"కదిలితే ఎడంచేతిలో రివాల్వర్ గుండెల్లోకి కాలుస్తుంది. కదలకపోతే కుడిచేతిలో కత్తి చర్మాన్ని నెమ్మదిగా వలుస్తుంది. నీ సంగతులు ఎక్కడ దాచావో వెదకడానికి."

జానీ ఒళ్ళు బిగుసుకుపోయింది.

"చెప్పు."

"ఎవరు నువ్వు?" గొణిగాడు జానీ.

"నేనెవరో తెలియకుండానే నా వెంట పడ్డావా నీడలాగా?" నవ్వి అడిగాడు హేరిస్.

"నీ పేరు హేరిస్ అని మాత్రమే తెలుసు. ఇంకేం తెలియదు. కూపర్ రోజుకి పదిహేను రూపాయలిస్తానన్నాడు నిన్ను వెంటాడి, నువు ఎక్కడికి వెళ్తున్నదీ, ఏం చేస్తున్నదీ మొదలయిన సంగతులు తెలియచేయడానికి. అందుకని

వెంటాడుతున్నాను నిన్ను."
"కూపర్ ఎవరు?"
"నా స్నేహితుడు."
"ఎక్కడుంటాడు?"
"ఆనంద్ నగర్."
"ఏం చేస్తాడు?"
ఏం చేస్తాడో చెప్పాడు జానీ.
చిన్నగా ఈలవేసి అన్నాడు హేరిస్.
"ఏస్. దటీజ్ వెరీగుడ్. కూపర్ ఎడ్రస్?"
చెప్పాడు జానీ.
"ఇందాక నేను సూట్ కేస్ తీసుకు వచ్చిన సంగతి చెప్పావా కూపర్ కి ఫోన్ చేసి?"
"లేదు."
"అయితే చెప్పు. అంతేకాదు. నేను గదిలో లేననీ, ఎటో వెళ్తుంటే నువ్వు వెంటపడుతున్నావనీ కూడా చెప్పు."
టెలీఫోన్ అందించాడు హేరిస్ జానీకి.
"కనెక్షన్ అడుగు. నే చెప్పింది మినహా మరేమయినా చెబితే మాత్రం పీక తెగుతుంది."
కూపర్ ఇంటి నంబర్ చెప్పి, కనెక్షన్ అడిగాడు జానీ, అషోకా హోటల్ ఆపరేటర్ని. అవతలనుంచి కూపర్ కంఠం వినబడగానే చెప్పాడు గబగబా.
"కూపర్. హేరిస్ మళ్ళీ ఎటో వెళ్తున్నాడు. నేను వెంట వెళుతున్నాను. ఓ చిన్న సూట్ కేస్ తీసుకొచ్చి గదిలో పెట్టాడు కొద్ది క్షణాల క్రితం."
"జానీ. తప్పిపోనివ్వద్దు హేరిస్ని. ఎక్కడ నించి మాట్లాడుతున్నావ్?" అడిగాడు కూపర్.
"పబ్లిక్ టెలిఫోన్ బూత్ నుంచి."
"మళ్ళీ ఓ గంట తర్వాత ఫోన్ చేయి ఇంటికి."

ఫోన్ పెట్టేశాడు జానీ.

టెలీఫోన్‌కి అవతలవున్న కూపర్‌కి కొద్దిగా అనుమానం వేసింది. ఎక్స్‌టెన్షన్‌లో కనెక్షన్ ఇచ్చిన ఆపరేటర్ 'స్పీకాన్ సర్' అన్న మాటలు వినపడ్డాయి.

అంతేకాదు.

రెండుసార్లు కట్ అయింది లైన్. ఎక్స్‌టెన్షన్ లైన్ ఒకసారి, మెయిన్‌లైన్ వకసారి.

పబ్లిక్ టెలీఫోన్ బూత్‌నుంచి మాట్లాడలేదు జానీ. అబద్ధం. ఎందుకు అబద్ధం ఆడాడు? ఎక్కడనుంచి ఫోన్ చేసాడు?

అకస్మాత్తుగా గుర్తుకు వచ్చింది కూపర్‌కి. రూం నంబర్ తొమ్మిదిలో టెలీఫోన్ ఎక్స్‌టెన్షన్ వున్నట్లుగా.

జానీ లైన్ కట్ చేసాక హేరిస్ కత్తిని మళ్ళీ మడిచి యధాస్థానంలో వుంచాడు.

జేబులోంచి ఓ చిన్న టేబ్లెట్‌ని తీసి జానీకి అందించి అన్నాడు.

"మింగు."

"ఏమిటది?" అడిగాడు జానీ భయంగా.

జానీ భయాన్ని గ్రహించి నవ్వి అన్నాడు హేరిస్.

"ప్రాణం పోదులే. మింగు. గార్డినాల్ అది. హాయిగా నిద్రపడుతుంది. లేద్దామన్నా లేవలేవు."

జానీ ఆ టేబ్లెట్‌ని పరిశీలనగా చూసి, గార్డినాలేనని ధృవపరుచుకున్నాక నోట్లో వేసుకుని మింగాడు దాన్ని. రెండు గ్లాసుల నీళ్ళు త్రాగించాడు హేరిస్, జానీ చేత, నోట్లో మింగకుండా దాచుకునుంటాడనే అనుమానంతో.

"గుడ్. నా వెంటపడ్డ ఇద్దరినీ వదిలించుకున్నాక ఆ బంగారంతో మంగుళూరు వెళ్ళాలి."

"బంగారం? ఎంత మొత్తం?" అడిగాడు జానీ.

"పాతిక లక్షలు."

"రూపాయలే?"

"అవును. ధర పెరిగిందిగా మూడు సంవత్సరాల క్రితం కన్నా. ముప్ఫై లక్షల ఖరీదు తప్పక లేకుండా చేస్తుంది."

"నిజంగా?"

"అవును" నవ్వాడు గర్వంగా హేరిస్.

"నాకు చెప్పనే లేదు ఈ సంగతి కూపర్."

"సర్లే. నిద్రపో."

ఇంకో టేబ్లెట్ మింగించాడు బలవంతంగా హేరిస్ జానీ చేత.

# 9

కాఫీ కలర్ షర్ట్ అతను కూడా చూసాడు హేరిస్‌ని, తన రూంలోకి తీసుకు వెళ్ళిన సూట్ కేస్‌ని.

జానీలానే దాంట్లో బంగారమో, డబ్బో, లేక అలాంటి ముఖ్యమయిన వస్తువులే ఏవో దాంట్లో తప్పకుండా వుండా లని తీర్మానించుకున్నాడు. జానీ వెళ్ళిన పావుగంట తర్వాత, బోండాంతో నడిచాడు హేరిస్ గది వైపు.

తలుపు ముందు ఆగి తోసాడు కాని తెరచుకోలేదు. తలుపుమీద తట్టాడు నెమ్మదిగా.

"ఎవరు?" వినిపించింది.

"రూమ్ సర్వీస్" అన్నాడు కాఫీ కలర్ అతను.

హేరిస్‌కి తెలుసు అది రూమ్ సర్వీస్ బాయ్ కంఠం కాదని. తను ఏమీ తీసుకు రమ్మని చెప్పలేదు కూడా. తన గదిలో ఏం పని లేదు రూమ్ సర్వీస్ బాయ్‌కి.

వచ్చింది కూపరే అయి వుండచ్చని గ్రహించాడు.

"వన్ సెకండ్" అన్నాడు.

తలుపు లోపల బోల్ట్‌ని నిశ్శబ్దంగా తీసి దూరంగా వెళ్ళి

కుర్చీలో కూర్చుని అన్నాడు గట్టిగా.

“తీసేవుంది. లోపలకి రా.”

ఇద్దరూ తలుపు తోసుకుని లోపలికి వెళ్ళారు. కాఫీ కలర్ షర్ట్ అతని జేబులో వుంది కుడిచేయి.

హేరిస్ తన చేతిలోని రివాల్వర్ గురిపెట్టి అన్నాడు.

“మిస్టర్ కూపర్. నో మంకీ బిజినెస్ ప్లీజ్. చేతులెత్తండి ఇద్దరూ. నాది సైలెన్సర్.”

“కూపర్?” అన్నాడు కాఫీ కలర్ షర్ట్ అతను.

“ముందర చేతులెత్తండి. లేకపోతే మీ స్నేహితుడికయిన గతే మీకూ పడుతుంది.”

సోఫాలో పడుకునివున్న జానీవంక చూపించి అన్నాడు హేరిస్ వాళ్ళిద్దరితో.

బోండాం చేతులెత్తాడు వెంటనే. కాఫీ కలర్ షర్ట్ అతను కూడా రెండు చేతులూ ఎత్తాడు. అతని జేబులో రివాల్వర్ లేదు. కత్తి మాత్రమే వుంది. అదితీసి విసిరేంత వ్యవధిలేదు. ఈ లోపలే సైలెన్సర్‌తో కాల్చేయచ్చు తమని. హేరిస్ దుర్మార్గుడనీ, హంతకుడనీ తనకి ముందే తెలిసింది, ఢిల్లీనుంచి వచ్చిన వుత్తరం ద్వారా.

చేతులెత్తి నిల్చున్న ఇద్దరివంకా చూసి నవ్వి అన్నాడు హేరిస్.

“మిస్టర్ కూపర్. నేను చాలా మందితో తిరిగాను. చాలా నేరాలు చేసాను. నువ్వో లెక్క కాదు నాకు. మూడురోజుల నుంచి నన్ను రహస్యంగా వెంబడించడం గమనిస్తూనే వున్నాను.”

“నా పేరు కూపర్ కాదు,” అన్నా డతను.

“ఏదో వకటి. నేను లేనప్పుడు వచ్చి ఈ గది వెతికింది నువ్వేకదా?” అడిగాడు హేరిస్.

“అవును” నిర్భయంగా చెప్పాడు కాఫీకలర్ షర్ట్ అతను.

"గుడ్. ఆ టేబిల్ మీద నాలుగు మాత్రలున్నాయి. చెరో రెండూ నోట్లో వేసుకుని,ఆ గ్లాసులోని నీళ్లు తాగండి."

ఆజ్ఞాపించాడు హేరిస్.

"ఏమిటవి?"

"గార్డెనాల్. క్విక్."

ఆ రెండు టేబ్లెట్స్‌ని వేసుకుంటే ఇక మరో పదిగంటల దాకా లేవలేమని తెలుసు కాఫీ కలర్ షర్టు అతనికి.

కాని తప్పదు.

బోండాం రెండు టేబ్లెట్స్‌ని నోట్లో వేసుకుని నీళ్లు త్రాగేసాడు గటగటా.

కాఫీ కలర్ షర్టు అతను రెండు టేబ్లెట్స్‌ని నాలిక కింద వుంచుకుని, గార్డెనాల్స్‌ని మింగకుండానే నీళ్లు తాగాడు.

"ఆ సోఫాలో కూర్చోండి" సోఫావంక చూపించాడు హేరిస్.

సోఫాలో కూర్చున్నారు ఇద్దరూ.

"గుడ్ మరో అయిదు నిముషాల్లో నిద్రలోకి జారిపోతారు అంతదాకా నాకీ వాచ్ అండ్ వార్డ్ డ్యూటీ తప్పదు," అన్నాడు హేరిస్ తన చేతిలోని రివాల్వర్‌ని ఇద్దరికీ గురిపెట్టి.

# 10

కూపర్‌కి హేరిస్ గురించి బాగా తెలుసు. హేరిస్ దృక్పధాలు, పద్ధతులు అన్నిటి గురించీ తెలుసు. ఒకసారి హేరిస్ గురించి సేకరించిన సమాచారం గల ఫైల్‌ని చదవటం తటస్థించింది.

అందుకే జానీ తనతో స్వయంగా ఫోన్‌లో మాట్లాడ లేదనే నిర్ణయానికి వచ్చాడు. హేరిస్ గదిలో ఎక్స్‌టెన్షన్ వుంది. అక్కడనుంచి మాట్లాడించి వుంటాడు హేరిస్ జానీ

చేత, నయానో భయానో.

జానీ అసలు ఆ గదిలోకి దేనికి వెళ్ళివుంటాడు?

జానీ హేరిస్ గదిలోకి వెళ్ళడానికి ఏం కారణం కనపడ లేదు కూపర్‌కి. కాస్సేపు ఆలోచించాడు ఏంచేయాలా అని. తన గదిలో, స్టీల్ టేబుల్‌వున్న డ్రాయర్ తెరచి, దాంట్లోంచి కత్తితీసి జేబులో పెట్టుకున్నాడు. పిస్టల్ లేదు కూపర్‌కి. ఎప్పుడూ లైసెన్స్‌కి అప్లై చెయ్యలేదు కూడా. తనకి ఇలా ఎప్పుడైనా అవసరం కలుగుతుందని కలలోకూడా అనుకోలేదు కూపర్.

ఇంటికి తాళం వేసి బయటకి వచ్చాడు. దగ్గరలోనే వున్న షాప్‌కి నడిచాడు. సిగరెట్ పాకెట్ కొనుక్కుని అంటించాడు ఓ సిగరెట్.

పాన్ షాప్‌కి కొంచెం దూరంలో ఆగివున్న టాక్సీలో వున్న డ్రయివర్ గుర్తుపట్టాడు కూపర్‌ని. దగ్గరకి తీసుకు వచ్చి ఆపాడు టేక్సీని.

"కూపర్ సాబ్. కహాఁజారాహఁ?" అడిగాడు నవ్వుతూ.

టేక్సీలో అతన్ని చూడగానే ఏంచేయాలో ఆలోచించాడు కూపర్ వెంటనే. తలుపు తెరచుకుని ఎక్కి అన్నాడు, తనే ఫ్లాగ్ దింపి.

"అషోకా హోటల్."

టేక్సీ బయలుదేరింది.

"శెలవమీద వున్నారా? డ్యూటీమీదా?" అడిగాడు డ్రయివర్.

'శెలవమీద' అని నిజం చెప్పబోయి, తమాయించుకుని అన్నాడు కూపర్ "డ్యూటీమీద."

"ఈ మధ్య బొత్తిగా కనబడటం లేదు?"

"నీ అవసరం రాక."

ఇదివరలో అనేకసార్లు కూపర్ ఆ టేక్సీని వుపయోగించు

కున్నాడు అవసరం అయినపుడు, అనేక పనులకి. కూపర్ వృత్తేమిటో తెలుసు డ్రయివర్ కి కూడా.

అషోకా ముందు ఆగింది టేక్సీ, పార్కింగ్ లాట్ లో టేక్సీ దిగుతూ చూసాడు కూపర్.

లోపలనుంచి బయటకి వస్తున్నాడు హేరిస్, ఒక్కడే. వెనకాల జానీ వస్తాడేమోనని ఆగి చూశాడు కూపర్. రాలేదు. కొంచెం దూరంలో ఆగివున్న టేక్సీ ఎక్కుతున్నాడు.

ఏం చెయ్యాలి? హేరిస్ గదిలోకి వెళ్ళి చూడటమా జానీకోసం? అక్కడ వుంటాడని కూడా నమ్మకంలేదు. జానీ కనబడకపోయినా తనకి ఇబ్బందిలేదు. హేరిస్ ని మాత్రం వదలకూడదు.

కూపర్ కి ఎంత మాత్రం ఇష్టంలేదు తనని హేరిస్ గుర్తించటం. తనని ముఖాముఖి చూసినా గుర్తు పట్టకూడదు ఆ బంగారం సంగతి తెలిసేదాకా.

కూపర్ టేక్సీ మీటర్ కున్న ఫ్లాగ్ పైకెత్తేసాడు. వెంటనే వెనక సీట్ లోకి వెళ్ళాడు దిగి.

"ఆ టేక్సీని అనుసరించు. జాగ్రత్త. ఏ మాత్రం అనుమానం కలగకూడదు సుమా."

చిన్నగా నవ్వి అన్నాడు డ్రయివర్.

"చాలా రోజుల తర్వాత నాకో పని తగిలింది. నేను కనబడటం మంచిదే అయింది మీకు."

గేర్ లో వేసి పోనిచ్చాడు బండిని డ్రయివర్, హేరిస్ వెళుతున్న టేక్సీ వెనక. కూపర్ వెనకాల సీట్ లో పడుకున్నాడు ముడుచుకుని, తను బయటకి కనబడకుండా. హేరిస్ వెనక్కి తిరిగి చూసినా ఖాళీ టేక్సీ వస్తోంది అనుకుంటాడు. తనని ఎవరో వెంబడిస్తున్నారని తట్టదు.

"బంగారమా మళ్ళీ?" అడిగాడు టేక్సీ డ్రయివర్.

"కాదు. మాట్లాడకు. నువ్వు పెదవులు కదపటం వాళ్ళు చూస్తే పిట్ట అనుమాన పడుతుంది."

"అలాగే."

దాదాపు పదిహేను నిముషాల దాకా అలాగే పడుకున్నాడు కూపర్, టేక్సీ ఎటు వెళుతోందో వూహించాలని ప్రయత్నిస్తూ. పావుగంట తర్వాత, ఆగింది టేక్సీ.

"అతను దిగాడు" చెప్పాడు డ్రయివర్ ముఖం తుడుచుకున్నట్లుగా నటిస్తూ.

"ఎక్కడున్నాం?"

"రింగ్‌వుడ్ సర్కిల్."

"ఎటు వెళ్తున్నాడో చూడు."

కొన్ని క్షణాల తర్వాత చెప్పాడు డ్రయివర్.

"చూసాను. వెళ్ళిపోయాడు. లెండి."

"ఏదైనా షావ్‌లోకి వెళ్ళాడా?"

"కాదు. ఓ రెండంతసుల భవనంలోకి."

"కాసేపు ఇలాగే వుంటాను. అనుమానంవస్తే లోపల నుంచి రహస్యంగా మన టేక్సీవంక చూడచ్చు."

అయిదు నిముషాల తర్వాత లేచాడు కూపర్.

"ఆ ఇంట్లోకి" చెప్పాడు డ్రయివర్.

"గ్రే కలర్ బిల్డింగ్!"

"అవును."

"ఐసీ."

కూపర్‌కి తెలుసు ఆ గ్రే కలర్ బిల్డింగ్ సంగతి.

హేరిస్ ఆఫీస్ ఆ బిల్డింగ్‌లో వుంది. 'హేరిస్ ఎక్స్‌పోర్ట్ ఎండ్ ఇంపోర్ట్ ప్రయివేట్ లిమిటెడ్' అన్న బోర్డు బయట వ్రేలాడుతోంది.

'గుడ్. పిట్ట కదులుతోంది' అనుకున్నాడు కూపర్.

APS 3

"లోపలకి వెళ్తారా!" అడిగాడు డ్రయివర్.

ఇక ఏం చేయాలో తోచలేదు కూపర్ కి.

"నేను ఓ అరగంటలో వెళ్లి వస్తాను. నువ్వు ఇక్కడే వుండు. ఆ టేక్సీలోంచి దిగినతని పేరు హేరిస్. ఎక్కడి కయినా వెళితే మటుకు నువ్వు మళ్ళీ అనుసరించాలి. నాకు ఫోన్ చేసి చెప్పు ఇంటికి."

"అలాగే."

"కదలకపోతే మాత్రం అరగంట తర్వాత ఇక్కడ కలుస్తాను. రైట్?"

"రైట్. ఇంటి టెలిఫోన్ నంబరు..."

"ఇంద"

తన విజిటింగ్ కార్డు అందించాడు కూపర్.

"జాగ్రత్త. నీ కనుభవమేగా. అతన్ని చెయ్యిదాటి పోనివ్వకూడదు" అన్నాడు కూపర్ అయిదు పది రూపాయల కాగితాలు అందిస్తూ.

"అలాగే" అన్నాడు డ్రయివర్.

కూపర్ టేక్సీ దిగి నడిచాడు వెనక్కి. ఆటో కనపడితే ఆపి ఎక్కాడు కూపర్. అశోకా హోటల్ లాంజ్ లో చూసాడు కాఫీకలర్ షర్టు అతనికోసం.

కనబడలేదు ఎక్కడా.

రూం నంబర్ తొమ్మిది వైపు నడిచాడు. తలుపు తోసాడు కాని తెరచుకో లేదు. పిక్ లాక్ వుపయోగించి తెరిచాడు తలుపు.

లోపల సోఫాలో పడుక్కునున్న జానీ, బోండాంని చూసాడు కూపర్ తలుపు మూస్తూ.

ఒక్క అంగలో దగ్గరకి వెళ్లి చూసాడు, చెయ్యి పట్టుకుని. జానీ చెయ్యి వెచ్చగానే వుంది. నాడి కొట్టుకుంటోంది. బోండాం కూడా బ్రతికే వున్నాడు.

కూపర్ వూహించినట్లుగా లోపల కాఫీకలర్ షర్టు అతను లేడు. చిన్నగా నిట్టూర్చాడు. ఎందుకు జానీ లోపలకి వచ్చినట్టు? దేనికి?

తట్టి లేపాడు. లేవలేదు.

రెండు భుజాలు పట్టుకుని కుదిపాడు గట్టిగా, "జానీ, జానీ, లే" అని పిలుస్తూ — రెండు నిముషాల తర్వాత మత్తుగా కళ్ళు విప్పాడు జానీ.

"ఏమిటి? ఏమయింది?" అడిగాడు కూపర్ ఆత్రంగా.

"కూపర్ ఆ అమ్మాయి మళ్ళీ వస్తుంది. నిద్రవస్తోంది."

కళ్ళు మూసుకున్నాడు జానీ మత్తుగా.

ఆ అమ్మాయి! ఎవరు? హేరిస్ దగ్గరకి ఏ అమ్మాయి వచ్చింది? జానీని ఇప్పుడు ఎంత లేపినా లాభం లేదు.

జానీని అలాగే వదిలేసి, తెరచివున్న ఆ సూట్ కేస్ వంక చూసి దగ్గరకి నడిచాడు. చాలా చిన్న సూట్ కేస్ అది. లోపల ఖాళీగా వుంది. దాంట్లో ఏం తెచ్చి వుంటాడో అర్థం కాలేదు కూపర్ కి.

బయటికి నడిచాడు కూపర్.

తలుపుమూసి బయటికివచ్చి, మళ్ళీ తాళం వేస్తూండగా ఓ రూమ్ సర్వీస్ బాయ్ బయటికి వచ్చాడు అకస్మాత్తుగా, ప్రక్క గదిలోంచి.

అనుమానంగా చూసాడు కూపర్ వంక, ఏం చేస్తున్నావన్నట్టుగా.

కూపర్ చాకచాక్యంగా తన చేతిలోని పిక్ లాక్ గుత్తిని దాచి అడిగాడు అతన్ని.

"రూం నంబర్ 9 ఇదేనా?"

"అవును."

"హేరిస్ అనే అతను వుండేది ఇందులోనేగా?"

"అవును."

"మరి తలుపు తీయడేం? ఇందాకటినుంచి తలుపుతడుతున్నాను."

అతను తలుపు దగ్గరకి వచ్చి, తలుపు నెట్టి చూసి అన్నాడు భుజా లెగరేసి.

"లోపల వుంటే తీసేవాడే. బయట తాళం వేసుకుని వెళ్ళిపోయాడు."

"అదా. నాకు తెలియలేదా సంగతి."

బయటికి నడిచాడు కూపర్ అతనితో పాటు.

"ఎప్పుడు వస్తాడో తెలుసా?"

"రిసెప్షనిస్టు నడగండి. తెలుస్తే అక్కడే తెలియాలి."

రిసెప్షన్ దగ్గర ఆగకుండా బయటికి నడిచాడు కూపర్. నలభై నిముషాల తర్వాత రింగ్‌వుడ్ సర్కిల్ చేరుకున్నాడు కూపర్. టేక్సీలోంచి దిగకుండానే, తను అంతకు క్రితం వచ్చిన టేక్సీకోసం చూసాడు.

లేదు.

అంటే హేరిస్ ఎటో వెళ్ళివుంటాడు. హేరిస్ వెంట వెళ్ళి వుంటాడు ఆ డ్రయివర్. తన ఇంటికి ఫోన్ చేస్తాడు.

"వెనక్కి త్రిప్పు. ఆనంద్ నగర్ పోనీ" చెప్పాడు కూపర్ సీట్‌లో వెనక్కి వాలి కళ్ళు మూసుకుని, టేక్సీ డ్రయివర్‌తో.

# 11

కాఫీకలర్ షర్టు అతను వూపిరి బిగబట్టి పడుకున్నాడు, రెండు టేబ్లెట్స్ నాలిక కిందే వుంచి, నీళ్లు తాగి.

నిద్రలోకి జారిపోయినట్లుగా కదలకుండా వుండిపోయాడు, మత్తు నటిస్తూ. పది నిముషాల తర్వాత హేరిస్ కదిలిన సూచన వినిపించింది అతనికి. దగ్గరకి వచ్చి ముగ్గురినీ తట్టి, కదిపి పరీక్షించాడు. బిర్రబిగుసుకుని అలాగే పడు

కున్నాడు కాఫీకలర్ షర్ట్ అతను.

హేరిస్ రిసీవర్ అందుకుని ఓ నంబర్ చెప్పాడు ఎక్స్టెన్షన్‌లో. గుర్తుంచుకున్నాడు కాఫీకలర్ షర్ట్ అతను ఆ నంబర్.

"హేరిస్ హియర్" అని కాస్సేపాగి అన్నాడు. "అషోక్ హోటల్. రూం నంబర్ తొమ్మిది. సరిగ్గా అర గంట తర్వాత నా సామాను—ఓ చిన్న సూట్‌కేస్— తీసుకెళ్ళడానికి ఫ్యాన్‌ని పంపండి. స్టేషన్ క్లోక్‌రూంలో పెట్టెనివుంచి రసీదు ఆఫీస్‌లో ఇవ్వండి నాకు. ఇక్కడున్న ముగ్గురిని మాయం చేసే ఏర్పాటు కూడా చేయాలి."

"........."

"అవును. వెళ్తాను."

ఫోన్ పెట్టేసిన చప్పుడు వినిపించింది. తర్వాత గది తాళం వేస్తున్న చప్పుడు. అయిదు నిముషా లాగి కళ్ళు తెరచి చూసాడు కాఫీకలర్ షర్ట్ అతను. గదిలో లేడు హేరిస్.

ఇంక తిరిగిరాడు బహుశ. వచ్చేటట్లయితే సూట్‌కేస్ తీసుకెళ్ళడానికి ఎవరినీ పురమాయించడు. కాఫీకలర్ షర్టతను కొంచెంసేపు ఆలోచించాడు.

కావాలనే హేరిస్ ఇక్కడ గది తీసుకుని వున్నాడు, తన వెంటపడే వాళ్ళని గుర్తించి, వదిలించుకోడానికి. వది లించుకున్నాడు. ఏదో వూరు వెళ్తున్నాడు. స్టేషన్‌లోని క్లోక్ రూం నుంచి తన సూట్‌కేస్ తీసుకుని వెళ్తాడు ఎక్కడికో.

ఎక్కడికి? ఎప్పుడు? ఎందుకు? అందుకేనా?

తన నోట్లోని నాలిక క్రిందనుంచి ఆ రెండు గార్డెనాల్ టేబ్లెట్స్ తీసి బాత్‌రూంలోకి వెళ్ళాడు. వాష్‌బేసిన్‌లో వాటిని పడేసి, చేతులు, మొహం, నోరు శుభ్రంగా కడుక్కున్నాడు అతను.

టవల్‌తో తుడుచుకుని బయటికి వచ్చి బోండాం వంక నిస్పృహగా చూసాడు. మరో పది గంటలదాకా తనకి వుపయోగపడడు. గార్డినాల్ నర్వస్ సిస్టమ్ మీద పని చేస్తుందని, శక్తివంత మయినదని తెలుసు అతనికి.

జానీవంక నిశితంగా చూసాడు. జానీని గుర్తించాడు కాఫీకలర్ షర్ట తను. లాంజ్‌లో చూసాడు రెండు, మూడుసార్లు. కాని హేరిస్ వెంటపడ్డాడని తెలియదు.

కూపర్ కాడతను. కూపర్ ఫోటోలు నాలు గయిదు చూసాడు అతను. కూపర్‌ని తేలికగా గుర్తించగలడు అంత దగ్గరనుంచి చూస్తుంటే.

జానీ జేబులు వెదికాడు అతను. జేబులోంచి కత్తి తీసి తన జేబులో వేసుకున్నాడు, ఓ వందరూపాయల చిల్లరతో బాటు. ఓసారి అద్దం ముందుకు వెళ్ళి ఆగి తల దువ్వుకున్నాడు.

హేరిస్ సూట్‌కేస్ మరోసారి వెతికాడు పిక్‌లాక్‌తో తెరచి ఆఖరిసారిగా. రైల్వేగైడ్ కనిపించింది ఈసారి. ఓ పేజీ మడిచి వుంది ఆ గైడ్‌లో.

చాలామందికి పుస్తకం చదివితే, మధ్యలో వదిలిన పేజీ తేలికగా తెరవడానికి అనువుగా, పుస్తకంలోని పేజీని లోపలకి మడిచే అలవాటు.

హేరిస్‌కి కూడా.

మడిచివున్న ఆ కాగితంలోని పట్టిక చూసాడు.

బెంగుళూరునుంచి మంగుళూరు వెళ్ళే రైళ్ళ వివరాలు వున్నాయి అందులో.

టెలిఫోన్ దగ్గరకి నడిచాడు. ఎత్తి ఇందాక హేరిస్ చెప్పగా తను విని గుర్తు పెట్టుకున్న ఫోన్ నంబర్ చెప్పాడు.

కనెక్ట్ చేయబడింది.

అవతల ఫోన్ ఎత్తారు.

"గుడీవినింగ్ సార్. హారిస్ ఇంపోర్ట్స్ ఎండ్ ఎక్స్ పోర్ట్స్ హియర్" వినపడింది అవతలనుంచి హారిస్ సెక్రటరీ తియ్యటి కంఠం.

"సారీ_రాంగ్ నంబర్."

ఫోన్ పెట్టేసాడు అతను.

బయటికి నడిచాడు వెంటనే.

## 12

హారిస్ గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు కూపర్ తన ఇంట్లో. ఆ డ్రయివర్ నుంచి ఫోన్ కాల్ కోసం ఎదురు చూస్తూ.

హారిస్‌ని బలవంతంగా హింసించి చెప్పించచ్చు రహస్యం. కాని నిజం చెప్తాడని నమ్మకం లేదు. హారిస్‌ని బంధించటం తేలికే కాని ఆ రహస్యం పెదవిదాటి బయట పెట్టించడం కష్టం.

అంతేకాదు. తను చిక్కుల్లోకూడా పడచ్చు అలా చేస్తే. హారిస్ మాటలు నమ్మి తను బంగారంకోసం చెప్పినచోటికి వెళితే, హారిస్ మనుషులు తనని పట్టుకోవచ్చు. తనెవరో, ఎలాంటివాడో తెలుసు అందరికీ. బ్రతకనివ్వరు తనని.

అందుకే వోపికగా ఎదురుచూడాలి దేముడిమీద భారం వేసి. తన ప్రయత్నం ఫలిస్తుందనే నమ్మకం వుంది కూపర్‌కి పూర్తిగా.

జైల్లోంచి విడుదలవగానే చేతులు ముడుచుకుని కూర్చోవటం అలవాటు లేదు హారిస్‌కి. తను చేపట్టినపని సాధించి తీరతాడు ఎలాగయినా. పట్టుదల ఎక్కువ మనిషిలో. గుండెధైర్యం కూడా ఎక్కువ. అందుకే మైసూరు రాష్ట్రం పోలీసులకి హారిస్ అంటే కొద్దిగా భయం.

పోలీస్ ఆఫీసర్లని మర్యాదగా పలకరిస్తూ, కలెక్టర్లకి షేక్ హేండ్స్ ఇస్తూ, అధికారులమధ్య ఘరానాగా తిరగ గలిగే తెలివి, డబ్బు, ధైర్యం వున్నది హేరిస్ వక్కడికే.

బజర్ మోగింది.

లేచి వెళ్లి తలుపు తీసాడు కూపర్ వెంటనే.

ఎదురుగా పంతొమ్మిదేళ్ళ అమ్మాయి.

రెండు రోజులక్రితం జానీ పంపిన అమ్మాయి.

"ఏమిటి? ఎందుకొచ్చావ్?" అడిగాడు కూపర్.

"జానీ మళ్ళీ వెళ్ళమన్నాడు, పిల్చారటగా," ఓరగా చూస్తూ అన్నది కూపర్‌తో.

"అబద్ధం. వెళ్ళు." జానీ ఇందాక మత్తులో 'ఆ అమ్మాయి మళ్ళీ వస్తుంది' అన్న మాటలు గుర్తొచ్చాయి. తలుపు వేయబోయాడు.

లోపలకి వచ్చింది చటుక్కున.

"వెళ్ళను" అన్నది వయ్యారంగా.

పరీక్షగా చూసాడు కూపర్ ఆ అమ్మాయి వంక.

టెలిఫోన్ మోగింది.

ఫోన్ దగ్గరకి వెళ్ళాడు వక్కగంతులో.

"హలో, కూపర్ హియర్," చెప్పాడు.

"నేను సార్. టేక్సీ డ్రయివర్‌ని," వినిపించింది.

"గుడ్. చెప్పు"

"ఆయన నా టాక్సీలోనే ఎక్కారు."

"నేను చూపించి నాయన?"

"అవును. హేరిస్."

"చెప్పు," ప్రోత్సహించాడు.

"నేను వెయిట్ చేస్తూంటే బయటకి వచ్చాడు. నా టాక్సీలో ఎక్కి అడిగాడు వస్తావా అని. స్టేషన్‌కి వెళ్ళాం ఇద్దరం."

"వూరెళ్ళి పోయాడా?" ఖంగారుగా అడిగాడు కూపర్.

"లేదు. మంగుళూర్‌కి రాత్రికి నా చేతే టికెట్ తెప్పించుకున్నాడు."

"ఎన్ని గంటలకి?"

చెప్పాడు.

"ఏ క్లాస్?"

"ఫస్ట్ క్లాస్."

"గుడ్. తర్వాత?"

"మళ్ళీ రింగ్‌వుడ్ సర్కిల్‌లో దిగబెట్టాను. ఆ బిల్డింగ్‌లోకి వెళ్ళిపోయాడు."

"ఇంకా?"

"అంతే. మరో సంగతి. నా చేత ఓ స్లీప్‌లెస్ టేబ్లెట్ తెప్పించుకున్నాడు."

"ఎన్ని?"

"ఒకటి."

"చాలా మంచి న్యూస్ చెప్పావ్. వెరీగుడ్."

"నన్నేం చేయమన్నారు?"

"అక్కడే వుండు మనల్ని మోసం చేయడానికి ఆ టిక్కెట్ కొని మరో చోటికి వుడాయించచ్చు."

"అలాగే."

"ఇంకో గంటేగా. ఆ తర్వాత స్టేషన్ దగ్గర కలు నన్ను."

"ఓకే."

ఫోన్ పెట్టేసి చిన్నగా నిట్టూర్చాడు కూపర్.

స్లీప్‌లెస్ టేబ్లెట్?

హేరిస్ అలవాటు తెలుసు కూపర్‌కి. ఎప్పుడయినా రాత్రిపూట స్మగ్లింగ్ వ్యవహారాల్లో స్వయంగా పాల్గొనేటట్లయితేనే స్లీప్‌లెస్ పిల్స్ వేసుకుంటాడు. లక్షలు విలువ చేసే సరుకు వుంటే కాని తను స్వయంగా జోక్యం కలగ

చేసుకోడు హేరిస్.

మంగళూరుకి రాత్రి.

అకస్మాత్తుగా ఆ అమ్మాయివంక చూసాడు కూపర్.

"నీతో, నాకో పనుంది" అన్నాడు.

ఏమిటన్నట్లుగా చూసింది ఆసక్తిగా కూపర్ వంక.

"రాత్రి అంతా నా కోసం మేలుకుని వుండాలి నువు."

"అలవాటే" అన్నది నవ్వుతూ.

"మంగళూరు చూసావా ఎప్పుడైనా?" అడిగాడు.

"లేదు. మద్రాసునుంచి ఇక్కడికి వచ్చి రెండు నెలలయింది. ఏం? తీసుకెళతారా?" అడిగింది.

"వస్తావా?" అడిగాడు.

"రెడీ."

"గుడ్. అయితే స్టేషన్‌లో నన్ను ఎనిమిదికి కలుప్ సరిగ్గా. చేయాల్సింది అక్కడ చెప్తాను."

# 13

ఖాకీ కలర్ షర్ట్ అతను, రింగ్‌వుడ్ సర్కిల్‌లో, హేరిస్ ఆఫీస్‌వున్న బిల్డింగ్ ప్రాంతంలో, ఓ హోటల్‌లో కూర్చుని హేరిస్ కోసం ఎదురు చూస్తున్నాడు. హేరిస్ టేక్సీలోంచి దిగి ఆఫీస్‌లోకి వెళ్ళడం చూసాడు పావుగంట క్రితం.

టేక్సీ కొంచెం దూరంవెళ్ళి ఆగింది. టేక్సీ డ్రయివర్ వెళ్ళకుండా అక్కడే వుండటవల్ల హేరిస్ కోసం ఆ టేక్సీ ఎదురు చూస్తుందనే తప్పు అభిప్రాయంతో ఎదురు చూస్తున్నాడు అతను, హేరిస్ తప్పక తిరిగి వస్తాడని.

ఆఫీస్‌లో, తన గదిలో కూర్చునున్న హేరిస్‌కి బయట టేక్సీ డ్రయివర్, ఖాకీ కలర్ షర్ట్ అతను తనకోసం రహస్యంగా వెయిట్ చేస్తున్నారన్న సంగతి తెలియదు.

రైల్వేస్టేషన్ నుంచి సరాసరి వచ్చేసాడు, రిజర్వ్ చేయబడ్డ టిక్కెట్‌తో. తను చెయ్యాల్సిన పని గురించి ఆలోచిస్తున్నాడు. హేరిస్‌కి ఇప్పుడు అంతగా అనుమానంలేదు. తనచుట్టూ రహస్యంగా తిరుగుతూ, తనని అనుసరించే ముగ్గురినీ వదిలించుకున్నాను, ఇంకెవరూ లేరనే ధీమాలో వున్నాడు.

తను మూడు సంవత్సరాల క్రితం రహస్యంగా దాచిన ఆ బంగారం ఇంకా అక్కడే వుండి వుంటుందా, లేక ఎవరయినా సంగ్రహించి ఉండి వుంటారా అన్న అనుమానం బాధిస్తోంది హేరిస్‌ని. వీలయినంత త్వరగా ఆ సంగతి తెలుసుకోవాలనే ఆతృత ఎక్కువవుతోంది హేరిస్‌కి.

తనని పోలీసులు పట్టుకున్నప్పటి నుంచి, ఈ మూడూ సంవత్సరాల నుంచి, అదే బాధగా వుంది హేరిస్‌కి. తను ఆ బంగారం దాచిన చోటు అనూహ్యం. అసలక్కడ వుంటుందని ఎవరూ వూహించలేరు.

తను ఆ బంగారం దాచిన ప్రాంతంనుంచి ఎన్ని లక్షల మందో వెళ్ళి వుంటారు మూడు సంవత్సరాల్లో. వాళ్ళలో ఏ వక్కరికీ తెలిసే అవకాశంలేదు.

కాని విధివశాత్తు బయటపడిపోతే మాత్రం తనంత దురదృష్టవంతు డుండడు.

తన ఆస్తిలో ఆ పాతిక ఓ భాగమే అయినా, చాలా పెద్దభాగం అది. దాంతో ఎంతో వ్యాపారం చేయచ్చు.

తన వ్యాపారం తాలూకు కొన్ని ఫైల్సు చూసుకున్నాడు హేరిస్. చాలా వస్తువుల ఎగుమతి, దిగుమతులకి ప్రభుత్వం తనకి లైసెన్స్ రద్దుచేసింది. మళ్ళీ ఆ లైసెన్స్‌లు సంపాదించే ప్రయత్నం చేయాలి. తన వ్యాపారాన్ని మళ్ళీ ఓ కొలిక్కి తెచ్చుకోవాలి.

అన్నిటికన్నా ముందర ఆ పాతిక బంగారపు బార్స్‌ని

అక్కడనుంచి తీసి మరో క్షేమకరమయినచోట దాయాలి.

ఎక్కడ క్షేమంగా వుంటుందో, ఎక్కడ దాయాలో ఎన్నుకున్నాడు హేరిస్. ఆ రాత్రికే పని ముగించాలన్న నిర్ణయానికి వచ్చాడు. సెక్రటరీని పిలిచి కొన్ని ఉత్తరాలు డిక్టేట్ చేయటం మొదలుపెట్టాడు.

బయట హోటల్లో కూర్చున్న కాఫీ కలర్ షర్ట్ అతను మారంగావస్తున్న వేన్ వంక చూసి వులిక్కిపడ్డాడు కొద్దిగా.

పోలీస్ వేన్!

నీలంరంగు వేన్‌లో కూర్చున్న డ్రయివర్ యూనిఫాంలో వున్నాడు. చటుక్కున రిసీవర్ అందుకుని ఓ నంబర్ డయల్ చేసాడు. హోటల్‌లో కూర్చుని కిటికీలోంచి బయటకి చూస్తున్న ఆ కాఫీకలర్ షర్టతను, కౌంటర్ దగ్గరకివెళ్ళి, రిసీవర్ అందుకుని.

హేరిస్ ఆఫీస్ నంబర్ అది.

పోలీస్‌వాన్ దగ్గిర పడుతూండగా అవతలనుంచి వినపడింది హేరిస్ కంఠం.

"హలో హేరిస్ స్పీకింగ్."

మౌనంగా ఉండిపోయాడు అతను రిసీవర్ చెవిదగ్గర వుంచుకునే, ఆ పోలీస్ వేన్ వంక చూస్తూ.

"హలో."

సరిగ్గా హేరిస్ ఆఫీస్‌వున్న బిల్డింగ్ ముందాగింది పోలీస్ వేన్. పోలీసులు దిగుతున్నారు గబగబా.

"హలో. వెంటనే వెనకనుంచి తోవవుంటే హేరిస్ పారిపోవటం మంచిది. పోలీస్‌లు కొన్నిక్షణాల్లో హేరిస్ ఆఫీసులో వుంటారు. పైకివస్తున్నారు," చెప్పాడు కాఫీ కలర్ షర్ట్ అతను.

"నువ్వెవరు?" అడిగాడు హేరిస్. కాని సమాధానం కోసం ఎదురుచూడకుండా, రిసీవర్ క్రేడిల్ మీదవుంచి సెక్ర

టరీతో అన్నాడు, గుమ్మంవైపు నడుస్తూ.

"పోలీసులు అడిగితే రేపు ఉదయం ఢిల్లీకి టిక్కెట్ బుక్ చేయమన్నానని చెప్పు ప్లేన్‌లో. బుక్ చేయించు వెంటనే నా పేరుమీద. నేను ఢిల్లీ వెళ్తున్నాననే నమ్మకంలో ఉంచు పోలీస్‌లని."

సెక్రటరీకి అలవాటే ఇలాంటి వ్యవహారాలు. అర్థమయింది వెంటనే. ఫోన్‌లో ఏదో సమాచారం అందివుంటుంది పోలీసులు పట్టుకోవచ్చని. పారిపోతున్నాడు మళ్ళీ.

హేరిస్‌దగ్గర ఆరేళ్ళనుంచి పనిచేస్తోంది ఆ సెక్రటరి. హేరిస్ స్వభావం, వ్యాపారం, జాగ్రత్త బాగా తెలుసు సెక్రటరీకి. అలా మధ్యమధ్యలో అజ్ఞాతవాసంలోకి వెళ్ళడం, లాయర్‌తో సంప్రదించి తను చట్టంనుంచి క్షేమం అని నిశ్చయమయ్యాక ప్రత్యక్షమవటం వెన్నతో పెట్టిన విద్య హేరిస్‌కి.

ఒకొక్కసారి పోలీస్‌లు అరెస్ట్ చేసిన అరగంటలోనే వచ్చేస్తాడు బెయిల్ మీద. ఎప్పుడోకాని ఎక్కువ శిక్ష పడదు హేరిస్‌కి. అలా శిక్ష పడేలా తన వ్యాపార రహస్యాలని బయట పడేసుకోడు హేరిస్.

హేరిస్ వెళ్ళిన కొన్ని క్షణాలకే లోపలకి వచ్చారు పోలీసులు.

"హేరిస్ ఏడీ?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"దేనికి?" అడిగింది సెక్రటరీ.

హేరిస్ వెనక మెట్లనుంచి కిందకిదిగి వెళ్ళడానికి కొంత వ్యవధి పడుతుంది. ఆ వ్యవధి దాటేదాకా పోలీసులని అక్కడే వుంచాలి.

"దేనికో చెప్పండి" అన్నది వెంటనే.

"అరెస్ట్ చేయాలి."

"వారెంట్ ఉందా?"

"ఉంది. ఏదీ?"

"దేనికి అరెస్ట్ చేయడం?"

"హారిస్ ఏదీ చెప్పు ముందు."

"తప్పకుండా చెప్తాను. ముందర కారణం చెప్పండి."

"పాత కేసుల్లో ఒకటి. మూడు నెలల శిక్ష విధించింది కోర్టు. కోర్ట్‌కి హాజరవలేదు కూడా హారిస్ ఆ కేసు విచారణకి."

చిన్నగా నిట్టూర్చి అన్నది.

"ఎప్పటికి ఈ కేసులన్నీ అయిపోతాయో?"

"త్వరగా చెప్పు. హారిస్ ఏదీ?" కోపంగా అడిగాడు.

రిసీవర్ అందుకుని, ఓ నెంబర్ తిప్పి చెప్పింది సెక్రటరీ అతినిదానంగా.

"హాలో. ట్రేడ్ వింగ్స్? రేపువుదయం ఢిల్లీకి హారిస్ పేరుమీద ఓ సీట్ రిజర్వ్ చేయండి. గంటలో టిక్కెట్ కలెక్ట్ చేసుకునేందుకు మా మనిషి వస్తాడు, డబ్బుతో. హారిస్ యాస్."

రిసీవర్ పెట్టేసి అన్నది.

"మర్చిపోయాను. మీరు ఆయనకోసం అడిగితే గుర్తొచ్చింది. ఇందాక చెప్పారు బుక్ చేయమని. ఎక్కడికో పార్టీ లాంటిదానికి వెళ్లారు హారిస్. ఇవాళ ఇక ఆఫీస్‌కు వస్తారనుకోను. రేపువుదయంమాత్రం ఢిల్లీ వెళ్తున్నారు."

"ఇప్పుడు ఎక్కడ దొరుకుతాడు?"

"చెప్పలేను. సవేరా బార్‌లో ప్రయత్నించండి. లేదా ఏర్‌పోర్ట్ రెస్టారెంట్‌లో దొరకచ్చు. ఎనిమిదిన్నరకి తప్పకుండా హోటల్లో దొరుకుతారు."

"హోటల్ అశోకా?"

"అవును."

"అక్కడ లేరు. రూమ్ ఖాళీగావుంది. ఎక్కడనుంచో

ఫోన్ చేసి చెప్పాడు హేరిస్, తన తరఫున ఎవరో వచ్చి లగేజ్ తీసుకువెళ్తాడని, తాళంచెవి ఇమ్మని."

"అయితే నాకు తెలియదు ఎక్కడ దొరికేది. హేరిస్‌కి ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ సినిమాలు అంటే చాలాయిష్టం. నే చెప్పానని చెప్పకండి. 'టోర్న్ కర్టెన్' ఆడుతోంది ఎక్కడో. ట్రై ఓవర్ దేర్."

ఇన్‌స్పెక్టర్ ఆఫీసంతా కలయచూసి వెళ్ళిపోయాడు బయటికి. మళ్ళీ వేన్ బయలుదేరింది.

ఖాళీగా ఉత్తచేతులతో వెళ్తున్న పోలీస్‌లని చూసి తృప్తిపడ్డాడు ఆ కాఫీకలర్‌షర్ట్ వ్యక్తి. హేరిస్ తన వార్నింగ్ అందుకుని తప్పుకున్నాడు వెంటనే. దొరకలేదు పోలీస్‌లకి.

పోలీస్‌ల చేతుల్లో పడితే రాత్రి మంగళూరు వెళ్ళలేడు ఇక. రిజర్వేషన్ చార్ట్‌లో హేరిస్ పేరుమీద మంగుళూరుకి ఫస్ట్‌క్లాస్ టిక్కెట్ రిజర్వ్ చేయబడటం కనుక్కున్నాడు అతను' ఎంక్వయిరీ చేసి.

హేరిస్ మంగుళూరు వెళ్ళకపోతే తను వేచివుండాలి, మళ్ళీ పోలీస్‌ల చేతిలోంచి బయటపడి మంగుళూరు వెళ్ళేదాకా. తను హేరిస్‌కు రాబోయే ప్రమాదం గురించి ముందరే అతన్ని తప్పించినందుకు తనని తనే అభినందించుకున్నాడు ఆ కాఫీకలర్ షర్ట్ వ్యక్తి.

టేక్సీలోంచి కూపర్‌కి పనిచేస్తున్న డ్రయివర్ గురించాడు పోలీస్‌లు హేరిస్‌కోసంవచ్చి ఉత్తచేతుల్తో వెళ్ళారని. హేరిస్‌ని అరెస్ట్ చేయడానికి వచ్చివుంటే దొరక్కుండా పోడు. తన కళ్ళుకప్పి బయటకి పోలేదు.

మరింక దేనికో వచ్చివుంటారనుకున్నాడు అతను. కాఫీ కలర్ షర్ట్ వ్యక్తి తప్పుకున్నాడు, కాని ఆ టాక్సీ డ్రయివర్ మాత్రం ఇంకా అక్కడ వున్నాడు హేరిస్‌కోసం

ఎదురు చూస్తూ.

## 14

రాత్రి ఎనిమిది గంటలు.

బెంగుళూరు రైల్వేస్టేషన్ హడావిడిగా వుంది, వచ్చే పోయే ప్రయాణీకులతో, దేదీప్యమానంగా వెలిగే లైట్లతో.

కాఫీ కలర్ షర్ట్ వ్యక్తి హిగ్గిన్ బాథమ్స్ ముందు నిలబడి పుస్తకాల వంక చూస్తున్నాడు, జేబులో మంగుళూరుకు ఫస్ట్ క్లాస్ టిక్కెట్‌తో. పుస్తకాల వంక చూస్తూనే హేరిస్ కోసం దొంగ చూపులు చూస్తున్నాడు.

దొంగ చూపులు చూస్తూ, హిగ్గిన్ బాథమ్స్‌లో పుస్తకాలు చూస్తున్న ఆ కాఫీ కలర్ షర్టు వ్యక్తిని గుర్తించాడు కూపర్. కొంచెం దూరంలో నిలబడి హేరిస్ కోసం వెదుకుతున్నాడు కూపర్ కూడా.

ఆ రైల్లో బుక్ చేయబడ్డ ఫస్ట్ క్లాస్ టిక్కెట్స్ ఏమయినా కేన్సిల్ చేయబడ్డాయేమోనని ఆరా తీసాడు. ఏవీ కేన్సిల్ చేయబడలేదు. అంటే హేరిస్ వస్తున్నాడు నిజంగానే.

ఆఫీస్‌లోకి వెళ్ళిన హేరిస్ ఎందుకు, ఎలా మాయమయ్యాడో తెలియలేదు కూపర్‌కి. టేక్సీ డ్రయివర్ రెండు గంటలు అక్కడే వుండి విసిగిపోయాడు ఎదురుచూసి చూసి.

హేరిస్ రాలేదు కాని ఆఫీస్ మూసేసి వెళ్ళిపోయింది సెక్రటరీ, ఫ్యాన్, మేనేజర్‌లతో పాటుగా. ఆ సంగతి తెలియ చేసాడు డ్రయివర్ కూపర్‌కి. కూపర్ తప్పని డ్రయివర్ దేననే నిర్ణయానికి వచ్చాడు. హేరిస్ వెళ్తూండగా చూసుండడు.

కూపర్ ప్రక్కనేవున్న అమ్మాయి అన్నది.

"హేరిస్ కోసం ఎందు కింత తాపత్రయం నీకు?"

"చెప్పాగా. నా మిత్రుడు హేరిస్. పందెంకట్టాను

తెలుసుకుంటే ఏ స్త్రీ అయినా లొంగదీసుకో గలదని. తను నిలదొక్కుకో గలనని వాదించాడు. అందుకే నువ్వు."

"అతను ఎక్కడ దిగేదీ ఎందుకు నీకు చెప్పటం?"

"తర్వాత ఆ సంగతి చెప్పటానికి నీ విషయం అబద్ధమని బుకాయిస్తే."

"మంగుళూరుకు టిక్కెట్ కొన్న వాడు మధ్యలో ఎక్కడో ఎందుకు దిగుతాడు?"

"దిగచ్చేమోనని. అయినా ఈ ప్రశ్నలన్నీ నీ కనవసరం. నే చెప్పినట్లు చెయ్యి చాలు. నీ డబ్బు నీకు ముడుతుంది."

"అలాగే."

"మళ్ళీ చెప్తున్నాను జాగ్రత్త. ఏ మాత్రం నోరు జారినా హేరిస్ నీ ప్రాణం తీస్తాడు. పరమ దుర్మార్గుడు."

"ఇదివరకు హత్యలుకూడా చేసి జైలు కెళ్ళాడని చెప్పావుగా" అన్నది ఆ అమ్మాయి కళ్ళు తిప్పుతూ.

"అడుగో. వస్తున్నాడు"

చెప్పాడు కూపర్ ఆ అమ్మాయికి.

"రెండు చేతుల్లో రెండు సూట్ కేసులు పట్టుకుని వస్తున్నాడు. అతడేనా ఇందాకటినుంచి నువ్వు చెప్పే హేరిస్ అంటే?" అడిగింది.

"అవును."

"అందగాడే" అన్నది.

ఖాకీ కలర్ షర్ట్ వ్యక్తికూడా చూసాడు హేరిస్ ని, చేతుల్లో సూట్ కేసులతో రావటం. అతను భయపడ్డట్టుగా హేరిస్ వేషం మార్చుకోలేదు, గుర్తు పట్టలేనట్లుగా.

హేరిస్ ఫస్ట్ క్లాస్ కంపార్ట్ మెంట్స్ దగ్గర ఆగుతూ, తన పేరు కోసం వెదుకుతున్నాడు, బయట అంటించిన రిజర్వేషన్ చార్ట్స్ చూస్తూ.

"కాఫీ తాగుతావా?" అడిగాడు కూపర్ ఆ అమ్మాయిని.

తల వూపింది.

ఇద్దరూ కేంటీన్ వైపు నడిచారు. కూపర్ రెండు కప్పుల కాఫీ కొన్నాడు. తన జేబులోంచి రెండు చిన్న పొట్లాలు తీసి ఓ పొట్లం అందించాడు ఆ అమ్మాయికి.

తన పొట్లంవిప్పి అందులోని పసుపుపచ్చ బిళ్ళని నోట్లో వేసుకుని ఓ గ్రుక్క కాఫీ తాగి మింగాడు.

"ఏమిటిది?" అడిగింది ఆ అమ్మాయి.

"వేసుకో బాగుంటుంది," చెప్పాడు కూపర్.

"ఎల్. ఎస్. డి నా?"

"స్లీప్ లెస్ టేబ్లెట్."

ఆ అమ్మాయి ఆ మాత్ర వేసుకున్నాక అడిగాడు కూపర్.

"నీకు ఎల్. ఎస్. డి అలవాటుందా?"

తల వూపింది వున్నట్లుగా.

రైలు కూత వేసింది. బయలుదేరడానికి సిద్ధంగా వుంది.

"పద పోదాం," అన్నాడు కూపర్.

ఇద్దరూ ఫస్ట్ క్లాస్ కంపార్ట్ మెంట్ ఎక్కారు.

"నే చెప్పింది గుర్తుందా. జాగ్రత్త."

కూపర్ తన కేబిన్ లోకి వెళ్ళిపోయాడు. రైలు కదులుతుండగా ఎక్కాడు కాఫీ కలర్ షర్టతను, 'మయూరి' మేగజైన్ తో. స్లీప్ లెస్ టేబ్లెట్ వేసుకో లేదతను. నిద్ర రాకుండా ఉండటానికి కన్నడ మంత్లీ కొనుక్కున్నాడు, దారిలో చదువుదామని.

తన కేబిన్ లోకి వెళ్ళిపోయాడు అతను.

రైలు వేగం అందుకుంది, పది నిముషాల తర్వాత.

# 15

హేరిస్ పదిహేను నిముషాల నుంచి గమనిస్తున్నాడు తన ఎదురు బెర్త్ లో కూర్చునున్న అమ్మాయిని.

తన బంగారం గురించిన ఆలోచనలతో సతమతమవుతున్న హేరిస్‌కి ముందర ఆ అమ్మాయి ఆనలేదు కంటికి, ఓ అమ్మాయిగా. ఎదురుగా ఆ ప్రాణంలేని బెర్త్ ఎంతో ఆ అమ్మాయి అంతే మొదట.

కాని క్రమంగా ఆలోచనలు, దృష్టి ఆ అమ్మాయి మీదకి మళ్ళిందికాదు. మళ్ళించుకుంది ఆ అమ్మాయి.

చాలా లేత గా వుంది మొహం. ఇరవై లోపే వుంటాయి. సుంద్రటి మొహంలో చూడగానే కనపడేది చిన్న నోరు. ఎర్రటి పెదవులు ఆ తర్వాతే కళ్ళు ఆకర్షిస్తాయి ఎవరినయినా. తడితో ఎర్రగా మెరిసే పెదవులుని చూస్తే ఎవరయినా ఒక్క క్షణం 'వాటిని ముద్దు పెట్టుకుంటే' అనుకోక తప్పదు.

కదలకుండా కూర్చునుంది. కాని ఆ అమ్మాయి చేష్టలు మామూలుగా వున్నా, ఏదోలా అనిపిస్తున్నాయి హేరిస్‌కి. కుడికాలి బొటనవేలు, ఎండకాలి బొటన వేలు దగ్గరకి చేర్చి రాస్తోంది విచిత్రంగా. కుడిచేతి చూపుడు వేలుని నోట్లో వుంచుకుకుంది తమాషాగా.

ముప్ఫై అయిదేళ్ళు హేరిస్‌కి. ఈ వృత్తిలో రాటు తేలినా, ఇంకా పెళ్ళి కాకపోయినా, ఎలాంటి దుర్మార్గం చేయడానికైనా వెనుకాడే తత్వం కాకపోయినా అమ్మాయిల గురించి తెలియని ప్రవరాఖ్యుడు కాదు.

జైల్లో వున్నంతకాలం అమ్మాయిల గురించి ఆలోచించే వాడు అప్పుడప్పుడు. బయటకి వచ్చాక ఆ బంగారం గురించిన ధ్యాసలో మర్చిపోయాడు మిగతా సంగతులన్నీ.

నలభై ఏళ్ళ తన సెక్రటరీని చూస్తే ఎప్పుడూ అలాంటి భావంరాదు. తనకి వ్యాపారంలో వుండే అనేక కష్ట నిష్ఠూరాలు తెలిసి ప్రవర్తించగల సెక్రటరీ కాబట్టి వుంచేసాడు.

"నీ పేరు?" హేరిస్ అడిగాడు ఆ అమ్మాయిని అకస్మాత్తుగా.

చెప్పింది చిన్నగా నవ్వి.

"ఒక్కదానివే వెళ్తున్నావా?"

తల వూపింది.

"మంగుళూరా?"

మళ్ళీ తలవూపింది.

హేరిస్ పరీక్షగా చూసాడు ఆ అమ్మాయివంక. సంసార పక్షపు ఛాయలేమీ కనపడలేదు. సంసారపక్షం వాళ్ళవుతే అలా చేయలేరు. ఆ తెలివి అబ్బదు వాళ్ళకి.

"ఇటురా" పిల్చాడు.

సిగ్గుపడ్డట్టుగా తలవంచుకుంది ఆ అమ్మాయి.

అదంతా కేవలం నటన అని గ్రహించాడు హేరిస్. కొద్దిగా వుత్సాహం వచ్చింది హేరిస్‌కి. డల్‌గా వుండదు తను ప్రయాణం చేసే కొద్దిదూరం.

చెయ్యిపట్టుకుని లాగాడు ఆ అమ్మాయిని.

"మీ రెంతదాకా?" అడిగింది వొళ్ళో వచ్చిపడి.

చెప్పాడు.

"మంగుళూరుదాకా కాదా?"

"కాదు" అన్నాడు ఆ అమ్మాయి పెదాలని ముద్దుపెట్టుకుని.

"ఎంతుంది మీ దగ్గర?" అడిగింది.

"కావాలా?"

"ఆహ. ఊరికే అడిగాను."

"వెళ్ళేటప్పుడు ఇస్తాలే ఎంతోకొంత."

హేరిస్ లేచి లోపల బోల్ట్ పెట్టి నవ్వి అన్నాడు చిన్నగా.

"నే చెప్పినట్లువింటే నీకు చాలా డబ్బిస్తాను."

"చెప్పినట్లు అంటే?" అడిగింది ఆ అమ్మాయి.

"నే చేసేదానికి అడ్డుచెప్పక. చెప్పేది చెయ్యాలని

మొరాయించకు. చాలు."

"నా కర్మ మయింది."

బ్లాకలర్ నైట్‌లాంప్ మాత్రం వెలుగుతోంది ఆ కేబిన్‌లో.

రైలు వేగంగా పోతూనేవుంది.

ప్రక్క కేబిన్‌లోవున్న కాఫీకలర్ షర్ట్ అతను సిగరెట్ కాలుస్తూ, అప్పుడే నిద్రలోకి జారిన తన తోటి ప్రయాణీకుల నిద్దరినీ చూసి తనకి నిద్రరాకుండా వుండేందుకు ప్రయత్నిస్తున్నాడు, 'మయూర' చదువుతూ.

కూపర్ బయట నిలబడి, హేరిస్ కేబిన్ తలుపుకి చెవి ఆనించి వింటున్నాడు లోపలి సంభాషణ. అస్పష్టంగా వినబడుతోంది. కాసేపటికి సంభాషణ ఆగిపోయి నవ్వులు వినపడసాగాయి.

చిన్నగా నిట్టూర్చాడు బయటకిచూస్తూ.

"హేరిస్. డియర్ హేరిస్. డార్లింగ్."

మత్తుగా అంటోంది ఆ అమ్మాయి.

హేరిస్ కూడా దాదాపుగా అదేస్థితిలో వున్నాడు. అయినా అర్థమయింది, ఆ అమ్మాయికి తన పేరు తను చెప్పకుండానే తెలిసిందని. కొద్దిగా ఉలిక్కిపడ్డాడు. ఆ మత్తు, ఆ అమ్మాయి ఒళ్ళు హేరిస్ ఆలోచనని, వివేకాన్ని చంపేసాయి తాత్కాలికంగా. మూడుసంవత్సరాల తర్వాత మళ్ళీ ఆ అనుభవం.

ఇరవై నిముషాలు పైనే గడిచాయి.

నెమ్మదిగా తేరుకున్నారు ఇద్దరూ మత్తులోంచి.

"యూ ఆర్ వండ్రఫుల్ హేరిస్," అన్నది.

"నా పేరు నీకెలా తెలుసు?" అడిగాడు హేరిస్.

"ఇందాక నువ్వే చెప్పావుగా?"

"నేను చెప్పలేదు. చెప్పు. ఎలా తెలుసు?"

"కాదు, నువే చెప్పావు."

"అబద్ధం. నేను చెప్పలేదు. నన్నెప్పుడయినా చూసావా?"

"ఇందాక ఫ్లాట్‌ఫాం మీద. నువ్వు ఓడిపోయావు పందెంలో."

"ఏం పందెం?"

"నీ స్నేహితుడితో కట్టిన పందెం."

"గుర్తురావటంలేదు. చెప్పు నువ్వే."

"నువు ప్రవరాఖ్యుడవని దబాయించావుటగా. కాదని నిరూపిస్తానని పందెం కాసాడుగా."

"అవును. నిన్ను ఆ స్నేహితుడే పంపాడా?"

"అవును. డబ్బిచ్చి పంపాడు."

"పేరేం చెప్పాడు?"

"కూపర్."

"ఏం పేరు?"

"ఎందుకలా భయపడతావ్? పందెం ఓడిపొయ్యాననా? కూపర్ అతని పేరు."

హేరిస్ మేధస్సు పనిచేస్తోంది త్వరగా.

"చిన్న బేరం పెడతాను నీకు. ఇష్టంవుంటే ఆలోచించు."

"ఏమిటి?"

"కూపర్‌కి చెప్పను ఇప్పుడు జరిగింది. నాకు వందరూపాయలు ఇవ్వాలి చెప్పనందుకు."

"ఇవ్వను."

"అయితే వెంటనే చెప్తాను కూపర్‌కి."

"వెంటనే?"

"అవును. ఈ కంపార్ట్‌మెంట్‌లోనే వున్నాడు."

లేవబోతున్న ఆ అమ్మాయిని ఆపాడు చెయ్యిపట్టుకుని.

"కూపర్‌ని నేను కలుస్తాను" అన్నాడు హేరిస్.

# 16

రాఫీకలర్ షర్టు అతను అరగంటలో పూర్తి చేసేసాడు తను కొని తెచ్చిన పుస్తకాన్ని. ఇక ఏంచేయాలో తోచ లేదు. నిద్రవస్తోంది రైలుకుదుపుకి. ముఖ్యంగా నిద్రపోతున్న ఆ తోటి ప్రయాణికుల నిద్దరినీ చూస్తూంటే నిద్రవస్తోంది విపరీతంగా.

మళ్ళీ పడేసిన పుస్తకం అందుకుని మొదటినుంచి చివర దాకా చూసాడు. మూడోసారి మళ్ళీ చూడటం మొదలు పెట్టాడు. కూపర్ సిగరెట్ తాగుతూ కారిడార్‌లో బయట నిలబడ్డాడు. అతని కేబిన్‌లోవున్న ముగ్గురు మార్వాడీలు పేకాట ఆడుకుంటున్నారు నిద్రపోకుండా.

కూపర్ బయటకి, చీకటిలోకిచూస్తూ నిల్చున్నాడు. చటుక్కున హేరిస్ కేబిన్ తలుపు తెరచుకుంది. తెరచుకుంది హేరిస్ కేబిన్ తలుపని తెలుసు కూపర్‌కి. తల తిప్పకుండా కనుకొలుకులలోంచి చూసాడు బయటకి వచ్చిం దెవరాని.

హేరిస్.

హేరిస్ వైపు తల తిప్పకుండా సిగరెట్ బయటకిపారేసి తన కేబిన్‌లోకి వెళ్ళిపోయాడు వెంటనే.

కూపర్‌ని ఎప్పుడూ చూడలేదు హేరిస్. తనకోసం మూడుసంవత్సరాల క్రితం చీకటిలో, ఓరాత్రి సముద్రం వడ్డున కాపేసిన నలుగురిలో కూపర్ ఒకడని, తన వెనక పడ్డాడని తెలియదు హేరిస్‌కి.

బయటకి వచ్చి సిగరెట్ తాగి మళ్ళీ కేబిన్‌లోకి వెళ్ళిపోయిన ఓ మామూలు ప్రయాణీకుడు అనుకున్నాడు.

జానీ కూపర్‌కోసం ఫోన్ చేయగా వచ్చింది రాఫీకలర్ షర్టు అతను.

హేరిస్ ఆ కాఫీకలర్ షర్ట్ వ్యక్తే కూపర్ అని నమ్ముతున్నాడు. హేరిస్ కూపర్ కోసం చూడటం అంటే ఆ కాఫీకలర్ షర్ట్ అతనికోసం చూడటమే.

హేరిస్ కూపర్ కోసం వెదుకుతున్నాడు. తనకు తెలిసిన కూపర్ కోసం వెదుకుతున్నాడు, అశోకా హోటల్ లో, తొమ్మిదో నంబర్ గదిలో, రెండు గార్డినాల్స్ మింగిన కూపర్ కోసం వెదుకుతున్నాడు.

మూడోసారికూడా 'మయూర' తెరగేసి బయటకివచ్చాడు కాఫీకలర్ షర్ట్ వ్యక్తి, ఆ పుస్తకాన్ని బెర్తుమీద పెట్టి.

ఎదురుగా కారిడార్ లో నించునివున్న హేరిస్ ని, హేరిస్ చేతిలోని సైలెన్సర్ అమర్చిన రివాల్వర్ ని చూసి తత్తర పడ్డాడు అతను క్షణకాలం.

లేనినవ్వు తెచ్చిపెట్టుకున్నాడు ముఖాన.

రైలుచక్రాల చప్పుడు, స్వల్పంగా రైలుకుదుపు తప్ప మరేం శబ్దంలేదు. అలా ముఖాముఖి చూస్తూ నిలబడి పోయారు ఇద్దరూ కొన్ని క్షణాలు.

"ఎలా తప్పించుకున్నావ్?" అడిగాడు హేరిస్.

"గార్డినాల్స్ ని నాలిక క్రింద దాచాను. మింగలేదు వాటిని" చెప్పాడు.

"పదు."

"ఎక్కడికి?"

"అటు."

తలుపువేపు చూపించాడు.

"దేనికీ?"

"పదు. చెప్తాను."

తలుపువైపు నడిచాడు కాఫీకలర్ షర్టు అతను అయిష్టంగానే.

ఒకచేత్తో రివాల్వర్ అతనికి గురిపెట్టి మరోచేత్తో లాక్

చేసివున్న డోర్ తెరిచాడు హేరిస్. గాలి రివ్వున వీస్తోంది తలుపులోంచి చల్లగా కత్తిలా కోస్తూ.

బయటకి దూకమన్నట్లుగా సౌంజ్ఞ చేసాడు హేరిస్.

"ఇదన్యాయం. పోలీసుల వాతపడకుండా కాపాడాను నేను ముందరే ఫోన్ చేసి చెప్పి."

హేరిస్ పెదవులమీద చిరునవ్వు మెరిసింది.

"నువ్వేనా? ఎవరా అని ఆలోచిస్తున్నాను. అంటే నన్ను వెంటాడుతూనే వున్నావన్నమాట."

"అవును."

"దూకు."

"అలాగే దూకుతాను."

మెరుపులా దూకాడు హేరిస్ మీదకి. హేరిస్ రివాల్వర్ వదలలేదు చేతిలోంచి. ఇద్దరూ కిందపడ్డారు. వేగంగా వెళుతున్న ఆ రైలు కంపార్టుమెంట్ కున్న, తెరచివున్న తలుపు ముందు దొర్లుతున్నారు, ఎవరికి వారు రెండో వాళ్ళని బయటకి తోయాలని ప్రయత్నిస్తూ.

రివాల్వర్ వున్న తనచేతిని గట్టిగా పట్టుకున్నాడు కాఫీ కలర్ షర్టు వ్యక్తి ప్రేల్చనివ్వకుండా. హేరిస్ బలం క్షీణిస్తోంది. గంటక్రితమయితే ఎదురువగేవాడు. కాని ఇప్పుడు, అరగంటపైనే ఆ అమ్మాయితో అనేక విధాలుగా గడిపాక ఒంట్లో నిస్సత్తువ ప్రవేశించింది.

బలంగా నెట్టాడు కాఫీకలర్ షర్టు వ్యక్తి హేరిస్‌ని తెరచివున్న తలుపువైపు. తనపని అయిపోయిందనుకుంటూండగా హేరిస్ చూసాడు ఎవరో సహాయం రావటం.

కూపర్ ఆ కాఫీకలర్ షర్టు వ్యక్తిని రెండు చేతులతో పట్టుకుని హేరిస్‌ని పెకిలాగాడు రెండో మెట్టుమీదనుంచి. హేరిస్ చూస్తూండగానే అతన్ని లేవదీసాడు.

హేరిస్ క్షణం ఆలస్యం చెయ్యలేదు. ఆ కాఫీకలర్ షర్టు

వ్యక్తిని బయటకి తోసాడు బలమంతా వుపయోగించి.

పెద్దగా అరుస్తూ వేగంగా కదిలే ఆ రైల్లోంచి బయట పడ్డాడు అతను.

ఊపిరి పీల్చుకుని, ఆయాసం తీర్చుకుంటూ కృతజ్ఞతగా చూసాడు కూపర్ వంక హేరిస్.

"దొంగా?" అడిగాడు కూపర్.

"అవును. కూపర్ అతని పేరు. థాంక్స్"

హేరిస్ తన కేబిన్ లోపలికి వెళ్ళిపోయాడు తలుపు మూసి యథాప్రకారం లాక్ చేసి.

కూపర్ రైలు ఆగుతుందనుకున్నాడు. ఆ వ్యక్తి అరుపు విని ఎవరయినా చెయిన్ లాగుతారని భయపడ్డాడు కాని రైలు ఆగలేదు.

ఒంటిగంటవుతోంది రాత్రి.

# 17

రైలు ఆగింది.

కూపర్ చూసాడు బయటకి. చీకటిగావుంది. చాలా చిన్న స్టేషన్ అది. క్రాసింగ్ కోసం ఆగివుండచ్చు. కారిడార్ లోకి వచ్చాడు కేబిన్ లోంచి.

హేరిస్ కేబిన్ తలుపు తెరచుకుంది.

ఆ అమ్మాయి.

కూపర్ వంక చూసి నవ్వి ఏదో అనబోయింది కాని ముక్కు మీద వేలు వేసుకున్నాడు కూపర్ మాట్లాడద్దు అన్నట్లుగా. దగ్గరకు రమ్మని సైగ చేసాడు ఆ అమ్మాయికి.

"ఏమిటి?" అడిగాడు.

"ఓడిపోయాడు పందెంలో."

"నాకు తెలుసు వోడతాడని.ఎక్కడికి వెళ్తున్నాడట?"

"తర్వాతి స్టేషన్ట. నీ సంగతి చెప్పాను."

"ఏమిటి నా సంగతి?"

"పందెం కాసిన సంగతి. బయటకి వెళ్ళాడు ఇందాక నేను చెప్పగానే."

"పద. నా కేబిన్‌లోకి పద" లాక్కెళ్ళాడు.

"ఇక్కడే కూర్చో. కదలక. నా పేరు కూపర్ అని చెప్పక."

"ఏం?"

"చంపేస్తాడు నిన్ను. నీకు డబ్బు కావాలంటే నేచెప్పి నట్లు విను. మాట్లాడకుండా కూర్చో."

"నాకోసం వెతికితే?"

"వెతకడు. తర్వాత రైలు ఆగగానే దిగిపోతాడు. అప్పటిదాకా నువ్వు ఇక్కడే కూర్చో."

"అలాగే."

వాళ్ళు ఆడుతున్న పేకాట చూస్తూ కూర్చుంది ఆ అమ్మాయి. నిద్రరావటంలేదు పోదామన్నా, మందుబిళ్ళ వేసుకోకడంవల్ల.

రైలు బయలుదేరింది.

హేరిస్ దిగాల్సిన రైలుస్టేషన్ దగ్గరపడుతున్నకొద్దీ గుండెల్లో దడ ఎక్కువవుతోంది కూపర్‌కి.

సరాసరి ఆ బంగారం దగ్గరకే వెళ్తాడా?

ఎక్కడ దాచివుంటాడు?

రైలు ఆగింది పావుగంట తర్వాత. హేరిస్ తన రెండు సూట్‌కేసులు తీసుకుని దిగాడు గబగబా. ఆ అమ్మాయి టాయ్‌లెట్‌కి వెళ్ళివుంటుంది. మళ్ళీ వచ్చి చూస్తే తనుండడు. ఆ అమ్మాయికి తను మాయమయ్యానని తెలియడంవల్ల నష్టమేమీ ఉండదు.

రైలుదిగి గబగబా నడిచాడు దూరంగా చీకటిలోకి. ఓ చోట ఆగి రైలు కదిలేదాకా వుండిపోయాడు అక్కడే. అది స్టేషన్. చాలా చిన్నస్టేషన్ అది. క్రాసింగ్ కోసం

రైళ్ళు అక్కడ తప్పకుండా ఆ టైంలో ఆగుతాయి.

రైలు అయిదునిముషాల తర్వాత కూత వేసి బయలుదేరింది మళ్ళీ. రైలుచివర పెట్టెపున్న ఎర్రదీపంకూడా కనుమరుగవ గానే రెండుచేతుల్లో రెండు పెట్టెలతో నడిచాడు ఆ చీకటిలో.

రైలుపట్టాలు ఎక్కి గబగబా రైలు వెళ్ళినవైపు నడవ సాగాడు నిర్భయంగా.

దాదాపు రెండుమైళ్ళు నడిచాడు అలా ఆ రెండు సూట్ కేసులతో. రెండుమైళ్ళ తర్వాత రైలుపట్టాలు లోపలకి వెళ్ళాయి. పైన ఓవర్ బ్రిడ్జి వుంది, కార్లు వెళ్ళడానికిచిన్నది. ఆ ఓవర్ బ్రిడ్జి కిందనుంచి వెళ్ళాయి పట్టాలు.

దాదాపు ఇరవైగజాలపైనే పొడవున్న ఆ ఓవర్ బ్రిడ్జికి రెండువైపులా వున్న పెద్దపెద్ద పిల్లర్స్ మూసేస్తున్నాయి పట్టాలని రెండువైపులనుంచీ, బయటకి కనపడకుండా.

అసలే చీకటిగావున్న ఆ ప్రదేశంలో, ఆ బ్రిడ్జికింద ఇంకా చీకటి గావుంది. నిర్భయంగా లోపలి కెళ్ళాడు హేరిస్. ఆగి రెండు సూట్ కేసులు తెరిచాడు.

ఒక సూట్ కేస్ లోంచి ఏదోతీసి ఆ బ్రిడ్జికి సపోర్ట్ చేస్తూ, రెండువైపులావున్న పిల్లర్స్ కి మధ్య పెట్టాడు రైలుపట్టాల మీద పరచి, జాగ్రత్తకోసం.

తర్వాత అడుగులు లెక్కపెట్టుకుంటూ వెళ్ళాడు. రెండో సూట్ కేస్ లోంచి గునపం, పార తీసి పట్టాలమధ్య, రెండు చెక్కలమధ్య తవ్వసాగాడు గబగబా.

అరగంట పైనే కష్టపడ్డాక హేరిస్ ఆ రెండుపట్టాల మధ్య తను తవ్విన గోతిలోంచి ఓ పెద్ద స్టీల్ బాక్స్ తీసాడు. దాదాపుగా అది పెట్రోల్ కేన్ లాగావుంది. చాలా బరువుగావుంది.

ఆ బాక్స్ కున్న తాళం తీసాడు హేరిస్.

పైనవున్న బంగారం బార్ తీసాడు. పరీక్షగా చూసి సంతోషంగా లోపల పెట్టేసాడు మళ్ళీ. తాళంవేసాడు. ఆ బాక్స్‌ని తనతోపాటుగా తెచ్చిన సూట్ కేస్‌లో, ఓ దాంట్లో వుంచి, సూట్ కేస్ మూసాడు. టార్చిలైట్ ఆర్పేసాడు.

అలికిడి వినిపించింది వెనకాల.

గుండె ఝల్లుమంటూంటే వెనక్కి తిరిగి చూసాడు హేరిస్.

కూపర్ నిలబడివున్నాడు, బ్రిడ్జివున్న పిల్లర్స్‌కి అవతలగా.

"హేరిస్. యువర్ గేమ్ ఈజ్ అప్" అన్నాడు నవ్వుతూ.

"ఎవరు నువ్వు?" అడిగాడు. హేరిస్ కంఠం భయంతో వణకింది. చెయ్యిపోనిచ్చాడు జేబులోకి.

"కదలక."

చెయ్యి కదలడం ఆగిపోయింది.

"నా పేరు కూపర్."

ఒకొక్క అడుగు ముందుకు వేస్తూ అన్నాడు కూపర్.

"నా పేరు కూపర్. ఈ పాతికలక్షల ఖరీదుచేసే బంగారం కోసం మూడు సంవత్సరాలనుంచి తపస్సు చేసేది నువ్వొక్కడివేకాదు. నేనుకూడా. అసలు కూపర్ చావలేదు."

హేరిస్ దృష్టి కూపర్ పాదాలమీద వుంది. ఆగాడు కూపర్. ఇంకొక్క అడుగు ముందుకు వేస్తే చాలు.

"చేతులు ఎత్తు."

కూపర్ చేతిలో రివాల్వర్ లేకపోయినా వున్నట్లుగా నటిస్తున్నాడు ఆ చీకటిలో. కత్తివుంది జేబులో.

చేతులు ఎత్తలేదు హేరిస్.

"ఎత్తు. లేకపోతే కాలుస్తాను."

తనని అంత సమర్థవంతంగా వెన్నాడిన కూపర్ దగ్గర రివాల్వర్ వుండదనే అనుమానం ఏమాత్రం కలగలేదు

హారిస్ కి.

చేతులు ఎత్తబోయాడు.

కాని.

మరో అడుగు ముందుకు వేసాడు కూపర్.

అంతే.

కెవ్వున కేక వేసాడు, వంగొని.

హారిస్ పకపకా నవ్వాడు జేబులోంచి రివాల్వర్ తీసి. కాల్చాడు రెండుసార్లు వరుసగా కూపర్ మీదకి.

ఒకటి గుండెల్లో, మరొకటి భుజంలో గుచ్చుకున్నాయి గుళ్ళు కూపర్ కి. కూపర్ జేబులోంచి కత్తితీసి విసిరాడు అంత బాధలోనూ హారిస్ మీదకి.

హారిస్ గుండెలో బలంగా దిగింది ఆకత్తి.

కూపర్ ఎంత ప్రయత్నించినా కదలలేకపోయాడు. తన కుడికాలు దేంట్లోనో చిక్కుకుంది, కదలడానికి వీలులేకుండా.

కిందపడ్డ హారిస్ మూలుగుతున్నాడు.

"నాకాలు చిక్కుకుంది. ఏంచేశావు ఇక్కడ?" అడిగాడు కూపర్ పళ్ళు బిగపట్టి, బాధ అణచుకోడానికి ప్రయత్నిస్తూ.

"ట్రాప్ అమర్చాను. అటునుంచి ఎవరయినా అకస్మాత్తుగా మీద పడచ్చని బూబ్ ట్రేప్ అమర్చడం మంచిదయింది. కాలు కొట్టేయాల్సిందేగాని ఇక అది విడవదు నిన్ను."

"డామిట్" అరిచాడు కూపర్.

కాలు లాగాలని ప్రయత్నిస్తే రావటానికి బదులు మండుతోంది. ఆ చీకట్లో ఏం కనపడటంలేదు.

"అలాగే చావు" అన్నాడు హారిస్.

లేచి సూట్ కేస్ పట్టుకుని నాలుగైదు అడుగులు వేసాడు. ఒళ్లు తిరుగుతున్నట్లుగా అయింది. అతి కష్టంమీద ఆ ఓవర్

బ్రిడ్జి క్రిందనించి బయటకి వచ్చాడు.

ఇక నిలవలేకపోయాడు నేలమీద.

పకపక నవ్వు వినిపించింది ప్రాణం పోతున్న హారిస్‌కు.

కూపర్ నవ్వు అది.

తర్వాత కూపర్ గొంతు వినిపించింది.

"నా కత్తికి విషం పూయబడి వుంది."

పావుగంట గడిచింది.

"హారిస్" పిల్చాడు కూపర్.

హారిస్ పలకలేదు. చలనంలేదు హారిస్‌లో.

"హారిస్" పిల్చాడు మళ్ళీ గట్టిగా.

హారిస్ చచ్చిపోయాడనిపించింది కూపర్‌కి. కాలు తీసుకోడానికి ప్రయత్నించాడు కాని రాలేదు. చేత్తో తడిమి చూశాక తెలిసింది కాలుని ఇనపగొలుసు బంధించిందని. చాలా లావుగా వుంది గొలుసు.

ఓవర్ బ్రిడ్జికున్న రెండు స్థంభాలకి కట్టివుంది ఆ గొలుసు. స్ప్రింగ్ వుండి వుంటుంది ఎక్కడో. ఆ స్ప్రింగ్ మీద కాలేసాడు. శ్రమపడితే తప్పించుకోవచ్చు.

నిలబడలేక కూలపడ్డాడు.

తను తప్పించుకుంటే ఆ పాతిక లక్షల బంగారం తనదవుతుంది. హారిస్ చచ్చిపోయాడు.

ఇక తనొక్కడే బ్రతికి వున్నది.

సరిగ్గా రైలుపట్టాలమీద మధ్యగా వున్నాడు. ఏ వైపు నుంచయిన రైలు వస్తే తనమీదనుండి వెళుతుంది. పచ్చి పచ్చయిపోతాడు తను. కదలలేడు- పక్కకి తప్పుకుందా మంటే ట్రాప్‌లో చిక్కుకున్నాడు బూబీ ట్రాప్‌లో.

రైలు వచ్చే లోపల తప్పించుకుని ఆ బంగారంతో పారిపోవాలి.

రివాల్వర్ గుళ్ళు దూసుకుపోయిన భాగంనుంచి రక్తం

కారుతోంది. చాలా కారిపోయింది. రక్తం కారిపోవటంతో నీరసం, నిస్సత్తువ, మత్తు ఆవహిస్తున్నాయి కూపర్‌ని.

ఇంకాస్సేపు ఆగితే, ఇంకాస్త రక్తం కారితే, ఇక అసలు కదలలేడు. అలా రక్తం కారికారి తను చస్తాడు రైలు వచ్చేలోపల. ఎలాగైనా యీలోపలే తప్పించుకోవాలి.

చేతులతో తడుముకున్నాడు కాలికున్న గొలుసుని. కాలు కదిపినకొద్దీ గొలుసు బిగుసుకుని, వరుసుకుంటోంది.

దగ్గరలో పాతిక లక్షల రూపాయల విలువ చేసే బంగారం. తను ఇంతకాలం కష్టపడ్డ బంగారం. జీవితాంతం చక్రవర్తిలా బ్రతకగలిగే అవకాశం ఇచ్చే బంగారం.

కాని మరోవైపు దగ్గరవుతున్న మృత్యువు. చివరికి ఎవరి చేతిలోనో ఆ బంగారం పడుతోందనే అసూయ.

ఏడుపు వచ్చింది కూపర్‌కి.

తన పరిస్థితికి ఏడుపు తన్నుకు వచ్చింది. బిగ్గరగా ఏడుస్తున్నాడు కూపర్ ఆ చీకటిలో.

పిచ్చివాడి ఏడుపు అది.

# 18

రెండు రోజుల తర్వాత పేపర్‌లో, మొదటి పేజీలో ప్రచురితమయిందీ వార్త, 'క్రైమ్ నెవర్ పేస్' అనే హెడింగ్ కింద.

బెంగుళూరు:—16, మార్చ్.

ఇక్కడికి నూటయాభైమైళ్ళ దూరంలో వున్న, బెంగుళూరు మంగళూరు రైలుమార్గంలో ఓ ఓవర్ బ్రిడ్జి కింద రెండు శవాలని కనుగొన్నారు. పాతిక లక్షల ఖరీదుచేసే బంగారంకూడా దొరికింది ఆ శవాల దగ్గర. ఆబంగారం బార్స్‌మీద ఫ్రెంచ్ మార్కింగ్స్ వున్నాయి.

చనిపోయిన వాళ్ళలో ఒకరు హేరిస్ అనే ప్రఖ్యాత స్మగ్లర్. రెండవ వ్యక్తి ఎక్సైజ్ కలెక్టరేట్‌లో పని చేసే

ఓ ప్రధానోద్యోగి. ఇతను శెలవమీద వున్నట్టుగా తెలుస్తోంది. ఇతనిమీద అనేక అభియోగాలున్నాయి, స్మగ్లర్స్‌తో చేయి కలిపినట్లుగా. స్మగ్లింగ్ గురించిన సమాచారం అందుతే ఆ రోజు శెలవపెట్టి తానే ఆ వస్తువులు సంగ్రహించేవాడని రూఢి అయి రెండుసార్లు సస్పెండ్ చేయబడ్డాడుకూడా.

కూపర్‌కి హేరిస్ దాచిన ఆ బంగారం గూర్చి సమాచారం అందితే డిపార్ట్‌మెంట్‌కి తెలియచేయక, తానే స్వప్రయోజనంతో హేరిస్‌ని వెంటాడాడని తోస్తోంది.

తెల్లవారుఝామున వస్తున్న ఓ పేసెంజర్ డ్రయివర్ ఎర్రరంగు జండా దారికడ్డంగా వుండటం చూసి రైలు ఆపాడు. దగ్గరకి వెళ్ళి చూస్తే అది రక్తంతో తడిసిన హతుడి శవం తాలూకు షర్టుగా గుర్తించాడు.

స్థానిక పోలీసులు విచారణ చేస్తున్నారు.

—: అయిపోయింది :—

# బానిస బ్రతుకులు?

## మిస్. మధుబాల

నిర్మల్ కుమార్ గ్లాస్‌లోని విస్కీని సిప్ చేసి "మీరు డాక్టర్ ఆచార్య పేరు విన్నారా?" తన ఎదురుగా వున్న వాళ్ళను చూస్తూ గంభీరంగా అడిగాడు.

"ఎవరు?" సిరోవ్ అడిగాడు "బాలిస్టిక్ ప్రొఫెసర్.."

"అవును, అతని విషయమే నేనడుగుతున్నది," నిర్మల్ కుమార్ సిరోవ్ మాటలను మధ్యలోనే ఆపుతూ అన్నాడు.

"యస్," ఈసారి మేజర్ హేవార్త్ అన్నాడు.

"అయితే మీకు ప్రొఫెసర్ రాఘవేంద్ర ఆచార్య యావత్ప్రపంచంలో, బాలిస్టిక్, మరియు బాలిస్టిక్ మిస్సైల్ యొక్క హైయర్ మాథమెటిక్స్‌లో, అధారిటీ అతనిదే నన్న విషయం తెలిసే వుంటుంది. ఆయనకు డెబ్భయి ఏళ్లపై

బడ్డా ఆయన మేధస్సు మొక్కపోలేదు. ఒకసారి ఆయన ఒక సైన్స్ కాన్ఫరెన్స్‌లో మాట్లాడుతూ ప్రతి వ్యక్తికీ, తన మనస్సుకి నచ్చే పని చేయాల్సిన అధికారం వుందనీ, దేశం ఆ విషయం ఒప్పుకోనంత మాత్రాన అతను తన అభిప్రాయాలను చంపుకోవాల్సిన అవసరంలేదని చెప్పాడు.'' నిర్మల్ కుమార్ ఆగాడు.

''అంటే?''

''అంటే నీవు చేసే ఒక పని, దేశానికి క్షేమకరం కాక పోవచ్చు. అంతమాత్రంచేత అతనా పనిని వదిలేయాల్సిన అవసరంలేదని ఆయన అన్నారు.''

''ఒహో!''

''అసలు ప్రొఫెసర్ తన అభిప్రాయాన్ని తికమకగా చెప్పాడు. కాని ప్రపంచం,అతని మాటలను మరో విధంగా అర్థం చేసుకుంది. ఆయన ఆ అభిప్రాయాన్ని వెల్లడించిన ఒక వారం రోజులలోపలే ఒక చైనా ఏజెంట్ ఆయన్ని కలుసుకుని, ఒకవేళ ఆయన చైనాకు తన ప్రయోగ ఫలితాలు అందించగలిగితే, చైనా చాలా సంతోషిస్తుందనీ ఆశ పెట్టాడు.''

''ప్రొఫెసర్ దానికేమని జవాబిచ్చారు?'' మేజర్ హోవార్డ్ అడిగాడు.

''ఆయన ఆ చైనా ఏజెంటుని, నానామాటలు అని, తన దృష్టిలో, చైనాదేశమంతటి కుటిలరాజనీతి గల దేశం ఇంకొకటి లేదని, తను ఆ అభిప్రాయం వెల్లడించినంత మాత్రాన తను భారతదేశాన్ని వదిలిపెడతానని అనలేదు అన్నాడు.''

''ప్రొఫెసర్ ఇలా అన్నారని మీకెలా తెలుసు?'' ఈ సారి సిరోవ్ అడిగాడు.

''ఆయన తన అభిప్రాయాన్ని వెల్లడించిన తరువాత

ఇలాంటిదేదో జరుగుతుందని భారత ప్రభుత్వానికి అను మానం వుండింది. అందుకని, మేం ఆయన్ని ఒక కంట కని పెడుతూనే వున్నాం."

"ఊఁ!"

"ఆ సంఘటన తరువాత మేం ప్రొఫెసర్ విషయంలో సంతృప్తిపడి, ఆయన్ని కనిపెట్టటం మానేశాం కాని, ఒక వేళ మే మాయన్ని కనిపెట్టివున్నా అంతగా లాభించేది కాదేమో!"

"ఎందుకని?"

"చెప్తాను" అంటూ నిర్మల్ కుమార్ చెప్పసాగాడు—

"ప్రొఫెసర్ చైనా ఏజెంటుని కలిసి మాట్లాడిన తరు వాత ఈ సంఘటన జరిగింది. ప్రొఫెసర్ గారి శ్రీమతి మిసెస్ ప్రసూనాంబగారు, ఆయన పదిహేనేళ్ళ కుమారుడు మధుకర్, స్విట్జర్లాండ్ చూడ్డానికి బయలుదేరారు. ప్రొఫెసర్ కూడా వారితో బయలుదేరాల్సింది. కాని చివరి క్షణాలలో ఆయనకు అతిముఖ్యమయిన పనులుండటంవల్ల మూడు రోజుల తర్వాత తను వాళ్ళని కలుస్తానని తన పరి వారాన్ని పంపించారు. స్విట్జర్లాండ్‌లో ఆ తల్లీ కొడుకులు ఒక హోటల్లో బసచేశారు. మూడు రోజుల తర్వాత ప్రొఫె సర్ ఆచార్య తన పని పూర్తి చేసుకుని స్విట్జర్లాండ్ చేరు కున్నారు కాని, ఆసరికి ఆయన భార్య, కుమారుడు మధుకర్ అక్కణ్ణుంచి మాయమయ్యారు."

"ఎలా?"

"ప్రొఫెసర్ భార్యా పిల్లలిద్దర్నీ చైనీయులు మాయం చేశారు."

"యస్; దేర్ యీజ్ ఎ పాజిబులిటీ" సిరోవ్ అన్నాడు. "స్విట్జర్లాండ్ నుండి ఆస్ట్రియా చేరుకోవడం పెద్ద కష్టమేమీ కాదు. రాత్రి సమయంలో 'కాన్‌స్టాన్స్' కాలువద్వారా,

చిన్న మోటార్ బోట్‌లో కాని, పడవల్లోకాని బయలుదేరి సులువుగా ఆస్ట్రియా చేరుకోవచ్చు."

"వాళ్లు స్విట్జర్‌లాండ్ నుండి ఎలా మాయమయ్యారో మాకు తెలియదు. ఒక విషయం నిశ్చయంగా తెలిసింది."

"ఏమిటది?"

"ప్రొఫెసర్ ఆచార్య తన పరివారం బసచేసిన 'మెట్రో' హోటల్ చేరుకున్న అర్ధగంటకంతా చైనీయులు ఆయన్ని కలిసి, తను వెంటనే ప్రపంచదృష్టినుంచి తప్పుకుని ఐరన్ కర్టెన్ వెనక్కి వెళ్ళకుంటే, ఆయన భార్యాపిల్లలు ఆయనకు దక్కరని బెదిరించారు. వాళ్ళు చెబుతున్నది నిజమేనని, అర్ధంచేసుకోలేనంతటి మూరుడుకాడు ప్రొఫెసర్. తత్ఫలితంగా, ఆయన స్వయంగా వెళ్ళి చైనీయుల చేతుల్లో ఇరుక్కున్నాడు" నిర్మల్ కుమార్ ఆగాడు.

"ఇప్పుడు మీరు ఆయన తిరిగి రావాలని కోరుకుంటున్నారు. అంతేనా?" సిరోవ్ అడిగాడు. అతని పెదవులపై పేలవమయిన మందహాసం వెలిసింది.

"మరి ఆయన భార్యా, కొడుకు?" మేజర్ హేవార్డ్ అన్నాడు.

"ఆయన పరివారాన్ని విడిపించకుండా ప్రొఫెసర్‌ని విడిపించడమనే ప్రశ్నలేదు. తన భార్యనూ, కొడుకునీ, చైనీయుల చేతుల్లో వదిలి, అతను మీ వెంటరావడమే అయితే, మొదలే అతను చైనీయుల చేతుల్లో చిక్కేవాడు కాడు."

"అదీగాక పెకింగ్ ఇక్కడికి కొన్ని వేల మైళ్ళ దూరముంది. మీరు నేరుగా పెకింగ్ చేరుకోక ఇక్కడికి, హంగరీ రాజధాని 'బుడాపెస్ట్'కి రావల్సిన అవసరమేముంది?" సిరోవ్ అడిగాడు.

"ఇప్పుడు సమస్య ప్రొఫెసర్ భార్యనూ, కొడుకునూ

విడిపించటంకాదు. ప్రొఫెసర్‌ను విడిపించడం" నిర్మల్ కుమార్ నిర్ణయాత్మకంగా అన్నాడు. "దాని కోసం నేను పెకింగ్ కూడా వెళ్ళనక్కరలేదు. ప్రొఫెసర్ ఇక్కడ, బుడాపెస్ట్‌లోనే, నా అనుమానం నిజం అయితే, ఇప్పుడు మనమున్న స్థలంనుండి మూడుమైళ్ళ పరిధిలోనే ఎక్కడో ఉన్నాడు."

నిర్మల్ కుమార్ మాటలు విన్న సిరోవ్, మేజర్ హోవార్త్‌లు తమ ఆశ్చర్యాలను అణచుకోలేకపోయారు.

"ఇక్కడా! బుడాపెస్ట్‌లోనా!!" ఇద్దరూ ఒకేసారి అడిగారు.

"అవును."

"మీకు గ్యారెంటీగా ఆ విషయం తెలుసా?"

నా ఛీఫ్ మాస్టర్‌కి ఈ విషయం గ్యారెంటీగా తెలుసు. అందుకే ఆయన నన్నిక్కడికి పంపారు."

సిరోవ్ ఒకసారి తన కుర్చీలో అటు ఇటు కదిలాడు. తరువాత అతను మేజర్ హోవార్త్ వైపు తిరిగి "ఈ విషయం నీకేమయినా తెలుసా?" అడిగాడు.

"నో; నెవర్" హోవార్త్ అన్నాడు. "ఇంతవరకు అటువంటిదేమీ వినలేదు. హంగరీ సీక్రెట్ పోలీస్ సర్వీస్‌లో మేజర్‌గా వున్న నాకే ఈ విషయం తెలియదంటే ఆశ్చర్యంగా వుంది."

మేజర్ హోవార్త్ హంగరీ సీక్రెట్ పోలీస్ సర్వీస్‌లో మేజర్‌గా వుంటున్నాడు. హంగరీలోని సామ్యవాద సిద్ధాంతాలతో విసుగెత్తిన అతను రెజిస్టెన్స్ మూమెంట్‌కి నాయకుడయిన సిరోవ్‌తో చేయి కలిపాడు. ఒక వైపు అక్కడ మేజర్‌గా వుంటూనే అక్కడి విషయాలన్నీ సిరోవ్‌కి అందిచేవాడు.

మేజర్ హోవార్త్ పంపిన సూచనలవల్లనే సిరోవ్

ఎన్నోసార్లు హంగరీ పోలీసుల కబంధహస్తాలలో చిక్కకుండా తప్పించుకున్నాడు. రెజిస్టెన్స్ మూమెంట్‌కి ఎవరో నాయకుడున్నాడని హంగరీ పోలీసులకు తెలుసు కాని, ఆ నాయకుడెవరో అతని పేరేమిటో ఎవరికీ తెలియదు.

మేజర్ హేవార్డ్ భారతదేశంలోని 'సాడ్' సంస్థకు అధిపతి అయిన 'మాస్టర్' రెండవ ప్రపంచ యుద్ధంలో స్నేహితులయ్యారు. మాస్టర్, హేవార్డ్ తనకు సహాయం చేయగలడన్న నమ్మకంతోనే తన ఏజంటు నిర్మల్‌కుమార్‌ని హంగరీకి పంపాడు.

నిర్మల్ కుమార్ హంగరీలో సిరోవ్‌నీ, మేజర్ హేవార్డ్‌నీ, వారి సహచరులయిన సాండర్, జూలీ, ఇమర్‌లని కలుసుకున్నాడు.

జూలీ, ఇమర్, సాండర్‌లు ఆ స్థావరాన్ని కాపలా కాస్తుండగా, నిర్మల్‌కుమార్ అసలు విషయాన్ని సిరోవ్, హేవార్డ్‌లకు చెబుతున్నాడు.

"ఒక వారంలోగా ఈ విషయం ప్రపంచమంతటికీ తెలుస్తుంది" నిర్మల్‌కుమార్ చెప్పుకుపోసాగాడు. "ఈ వారం రోజుల్లో ప్రొఫెసర్, ఇక్కడ- బుడాపెస్ట్‌లో వున్నారనీ ప్రపంచానికి తెలిసిపోతుంది. ఇక్కడ సోమవారంనాడు అంతర్జాతీయ వైజ్ఞానికుల కాన్ఫరెన్స్ మొదలవుతుంది. దానికి ప్రారంభోత్సవం చేసేది ప్రొఫెసర్ ఆచార్య. ఆ కాన్ఫరెన్స్‌లో మొట్టమొదటి స్టేట్‌మెంట్ ఆయనే చదువుతారు. ఒకవేళ ఆయన అలా చేయకుంటే ప్రొఫెసర్, భార్యా, కొడుకుల చావు తప్పదు."

కొన్ని క్షణాలు ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

సిరోవ్ చాలా సేపటివరకు తన వేళ్ళతో బల్ల అంచులను టకటకలాడిస్తూ వుండిపోయాడు.

"మిస్టర్ నిర్మల్‌కుమార్... మీరు కేవలం ప్రొఫెసర్ ఆచార్యను విడిపిస్తే చాలని అన్నారు కదూ!" సికోవ్ కంఠంలో గాంభీర్యంతోబాటు తీక్షణత కూడా కనిపించింది.

"అవును. ప్రొఫెసర్ భార్య మొదలే భారతదేశం చేరుకుంది. ఆమె సుమారు ఆరువారాల క్రితం చాలా జబ్బుపడింది. తన భార్యకు భారతదేశంలో చికిత్స చేయించాలని ప్రొఫెసర్ మొండిపట్టుపట్టాడు. ప్రొఫెసర్ మొండి పట్టుదల మీకు తెలియదు. అలాంటి వ్యక్తిని సామ్యవాదులు 'టార్చర్' చేసి తమ వైపుకి తిప్పుకోలేరు. ఆయన్ని 'టార్చర్' చేస్తే...ఆయన మొండిపట్టుదలకి, ఆయన మస్తిష్కం నిష్క్రియమయ్యే ప్రమాదం వుంది. తన భార్యను చికిత్సకోసం ఇండియాకు పంపకుంటే తాను వారికే విధంగానూ ఉపయోగపడలేనని, ఆయన స్పష్టంగా చెప్పారు."

"ఇటువంటి సున్నితమయిన పరిస్థితిలోకూడా తన పట్టుదలను నిలబెట్టుకొన్న ప్రొఫెసర్‌ని అభినందించాలి" మేజర్ హేవార్డ్ అన్నాడు.

"ప్రొఫెసర్‌ని మీ రెరుగరు" నిర్మల్‌కుమార్ చెప్పసాగాడు. "ఆయన వయస్సుతోపాటు, ఆత్మవిశ్వాసం, దృఢసంకల్పం, మొండి పట్టుదలకూడా పెరిగాయి. ప్రొఫెసర్ భార్య భారతదేశం చేరుకున్నా ఆయనున్న పరిస్థితిలో మార్పేమీరాదు. చైనీయులు అంతటి మూర్ఖులుకారు. వారి చేతుల్లో రెండు తురుపుముక్కలున్నాయి. మిసెస్ ఆచార్య ఆయన కుమారుడు. అందుకని వాళ్లు మిసెస్ ఆచార్యను ఇండియాకు పంపారు.

"అదీకాక ప్రొఫెసర్ చైనాలో వుండిపోతే, చికిత్స పూర్తయిన తర్వాత, ఆయన భార్య ఎలాగూ భర్తవద్దకు రాక తప్పదు. ఆ విషయం వాళ్ళకు తెలుసు. అయితే ఈవిషయం

రహస్యంగా వుంటుందని వాళ్ళు ఆయనకు చెప్పారు. నేటి రోజు ఆమె ఇండియాలో నేవున్నా ఆ విషయం యావద్భారత దేశంలో అరడజనుమందికంటె ఎక్కువమందికి తెలియదు. ఆమెకు ఆపరేషన్ చేసిన సర్జన్‌కికూడా ఆమె ఎవరో తెలియదు.''

''ప్రొఫెసర్ భార్య ఇప్పుడెలావుంది?''

''పూర్తిగా కోలుకోలేదు. కాని, ప్రాణాపాయస్థితి దాటింది. సిద్ధహస్తులయిన భారత సర్జన్లు ఆమెను మృత్యుముఖంనుండి తప్పించారు.''

''సరే! ప్రొఫెసర్ భార్య విషయం చెప్పారు. కాని, మధుకర్, ప్రొఫెసర్ కొడుకు విషయం ఏంచేస్తారు. ఈ విషయంలో ఆయన్ని మీరు మోసంచేస్తారా? మీ స్వార్థం కోసం ఆ పసివాడ్ని బలిస్తారా?''

''ప్రొఫెసర్ కొడుకు నిన్నటిదినం స్టేటిన్‌లో వున్నాడు. ఇద్దరు ఏజెంట్లు, అతణ్ని నీడలా వెన్నంటుతున్నారు. రేపు మధ్యాహ్నానికల్లా అతను స్వీడన్‌లో వుంటాడు. స్వీడన్ నుండి ఇరవయినాలుగు గంటల్లోగా అతన్ని మా ఏజెంట్లు భారతదేశం తీసికెళతారు,'' నిర్మల్‌కుమార్ అన్నాడు.

''మీ ఏజెంట్లపై మీకు చాలా నమ్మకముంది. దాంతో పాటు, ఇతరదేశపు ఏజెంట్లను ఎందుకు పనికిరానివాళ్ళగా జమకడుతున్నారు. ఒకవేళ మీ ఏజెంట్లు, ప్రొఫెసర్ కొడుకుని, తప్పించలేకపోతే...'' మేజర్ హేవార్డ్ అన్నాడు.

''నెవర్; ఇట్ నెవర్ హేపెన్స్ సో;'' నిర్మల్‌కుమార్ ధృఢంగా అన్నాడు. ''ఎట్టి పరిస్థితిలోనూ మధుకర్ ఎల్లుండికల్లా ఇండియాలో వుంటాడు. పూర్వమే నిశ్చయించబడిన కోడ్ ప్రకారం, ఇండియన్ న్యూస్ బ్రాడ్‌కాస్టింగ్‌లో, అతని విడుదల విషయం నాకు తెలుస్తుంది. ఆ విషయం ధృఢంగా తెలిసిన తరువాతనే నేను; ప్రొఫెసర్‌ని కలు

స్తాను."

"...కాని, ఒక వేళ ప్రొఫెసర్ ఇండియాకి తిరిగి రావ డానికి ఇష్టపడకుంటే..."

"ఆయన ఇష్టాఇష్టాలతో పనిలేదు మేజర్. ఆయన ఎట్టి పరిస్థితిలోనయినా ఇండియాకు వచ్చి తీరాల్సిందే."

"వండర్‌ఫుల్!" మేజర్ హేవార్త్ వ్యంగ్యంగా అన్నాడు. "ఒక వ్యక్తి ఇష్టాయిష్టాలతో పనిలేక మీపని మీరు చేసుకుపోతారన్నమాట."

నిర్మల్‌కుమార్ ఏమీ మాట్లాడలేదు. తను వచ్చినప్పటికి ఇప్పటికీ, అక్కడి వాతావరణం చాలా మారిందని అతను గమనించాడు. వాళ్ళకి పరిస్థితిని తూణ్ణంగా చెప్పమని 'మాస్టర్' అతని నాదేశించాడు. అతను అంతా స్పష్టంగా వివరించాడు. ఇక వాళ్ళు సహాయం చేయదలచుకున్నదీ, లేనిదీ నిర్ణయించుకోవాల్సివుంది.

కాని ఒక్కటిమాత్రం అతను అర్ధంచేసుకున్నాడు. వాళ్ళ సహాయం లేకుండా తను ఒక అడుగు కదిలినా, మరుక్షణం, తను హంగరీ సీక్రెట్ పోలీసుల చేతుల్లో వుంటాడు. అప్పుడే ఒకవ్యక్తి దొంగతనంగా బార్డర్ క్రాస్ చేసి తమ రాష్ట్రం లోకి ప్రవేశించినట్లు వాళ్ళకి తెలిసిపోయింది.

పూర్తిగా అయిదు నిముషాల మౌనం తర్వాత, హేవార్త్ సిరోవ్‌లు ప్రశ్నార్థకంగా ఒకరినొకరు చూసుకున్నారు.

నిర్మల్‌కుమార్ శ్వాసకూడా పీల్చకుండా వారి నిర్ణయం తెలుసుకోవడానికి ఆతురత పడుతున్నాడు.

చివరకు సిరోవ్ దృష్టి నిర్మల్‌కుమార్ పై నిలిచింది. అతను ప్రతి శబ్దాన్ని తూచితూచి గంభీరంగా చెప్పసాగాడు.

"మిస్టర్ నిర్మల్‌కుమార్! ప్రతి ఏజెంటుకీ కర్తవ్యపరాయ ణత్వం, నిర్దయ, క్రూరత్వం వుంటుంది. నిజమేకాని, మీ దేశవాసులందరూ, మీలాంటివారని నేననుకోను. వాళ్ళ

కూడా మీలాంటివారే అయితే మీకోసం మేం ఒక వేలు కూడా కదపం, కాని; భారతీయుల్లోని మానవత్వం, శాంతి ప్రియత్వం మాకు తెలుసు.

"అహింసాతత్వమంటూ చివరివరకు దాన్నే నమ్ముకుని, చివరికి తనవాళ్ళ చేతుల్లోనే అసువులు పోగొట్టుకున్న గాంధీజీ! పద్దెనిమిదేళ్ళుగా ఇరుగుపొరుగువారు కవ్విస్తూన్నా చిరునవ్వుతో శాంతిహస్తాన్ని చాపిన నెహ్రూజీ! తనను తను కాపాడుకుంటూ, అవసరమయితే శాంతికోసం ప్రాణాలు అర్పించగలమని నిరూపించడానికి శాంతి చర్చలకు తన దేశాన్ని వదలి, 'తాష్కెంట్'లో శాంతికై ప్రాణాలు పోగొట్టుకున్న శాస్త్రీజీ, లంటే మాకెంతో గౌరవం.

"వాటన్నింటికీ తోడు, మీ చీఫ్ 'మాస్టర్' మా మేజర్ కి మంచి మిత్రుడు. అదీగాక ఒక వృద్ధసైంటిస్ట్ తన చివరి రోజులు, దేశంకాని దేశంలో అపరిచితుల మధ్య గడపడం మాకెంతమాత్రం ఇష్టంలేదు. పరిస్థితి మా చేతిలోంచి దాటి పోకుంటే, భగవంతుడు మా పనులకు తోడుగావుంటే, ఆ ప్రొఫెసర్ ని క్షేమంగా భారతదేశం చేర్చడానికి సహాయ పడతాం."

## 2

నిర్మల్ కుమార్ తృప్తిగా నిట్టూర్చాడు.

నిర్మల్ కుమార్ సిరోప్ స్థావరంలో ఉండడం మంచిది కాదనీ, ఆ స్థావరాన్ని వారం పదిరోజులుగా ఇద్దరు అగంతకులు ఒకకంట కనిపెడుతున్నారని, వాళ్లు సీక్రెట్ పోలీసులు అయ్యే అవకాశముందని, మేజర్ హేవార్త్, నిర్మల్ కుమార్ ని, తన అధికారం వుపయోగించి ఒక హోటల్లో బస చేయించాడు. నిర్మల్ కోసం మరో అధికారి నేతృత్వంలో పోలీసులు ఆ హోటలుని అంతకుముందే సెర్చ్ చేసి వెళ్ళారు.

దాంతో నిర్మల్ కుమార్ కి సగం బెడద తప్పింది.

ప్రొఫెసర్ ఆచార్య ఏ హోటల్లో బసచేసిందీ కనుక్కొని చెబుతానని వెళ్ళాడు మేజర్ హేవార్డ్.

నిర్మల్ కుమార్ స్నానం చేసి మంచంపై వాలగానే గాఢంగా నిద్రపట్టింది.

ఉదయం లేచేసరికి అతని శరీరమంతా తేలికగా ఉన్నట్లనిపించింది. స్నానాదికాలు ముగించుకుని బ్రేక్‌ఫాస్ట్ చేశాడు.

ట్రాన్సిస్టర్ అందుకుని అనుకున్న ఫ్రీక్వెన్సీ ప్రకారం ఇండియన్ న్యూస్ వినడానికి ట్యూన్ చేశాడు. వార్తలు చదువుతున్నాడు అనౌన్సర్.

వార్తలు చదువుతూ...అనౌన్సర్ ఎక్కడో ఒకచోట "ఇవాళ రాత్రి...క్షమించండి, ఇవాళ రాత్రికాదు, రేపు రాత్రికి..." అని అనాలి. అదే మధుకర్ క్షేమంగా ఇండియాకు చేరుకున్నాడని అనడానికి గుర్తు.

కాని అనౌన్సర్ అలాంటిదేమీ అనలేదు. ఆ దినమంతా అతను గదిలోంచి బయటకురాకుండా వున్నాడు. భోజనం కాఫీ, టిఫెన్, సిగరెట్లు అన్నీ అతను తన అపార్ట్‌మెంట్‌లోకి తెప్పించుకున్నాడు.

ఆ సాయంత్రం అయిదుగంటలకు మేజర్ హేవార్డ్ ఫోన్ చేసి, ప్రొఫెసర్ ఆచార్య త్రీక్రౌన్స్ హోటల్లో రెండవ అంతస్థులో రూం నెంబర్ 59 లో వుంటున్నట్లు చెప్పాడు.

నిర్మల్ కుమార్ ఒక్క క్షణం కూడా వేస్ట్ చేయలేదు. బట్టలు తొడుక్కొని, మోకాళ్ళక్రిందికి దిగే ట్రెంచ్ కోట్ వేసుకుని, ఫెల్ట్ హాట్ పెట్టుకున్నాడు. తన బెల్జియన్ రివాల్వర్‌కి సైలెన్సర్ బిగించి, ట్రెంచ్ కోట్ జేబులో వేసుకున్నాడు.

మేనేజర్‌కి ఫోన్ చేసి తనను మరో నాలుగుగంటలవరకు

ఎట్టి పరిస్థితిలోనూ డిస్టర్బ్ చేయవద్దని, టెలిఫోన్ కాల్ గాని మెసెంజర్ కాని రాకూడదని, టీ, కాఫీ, భోజనం పంపించవద్దని కట్టిగా ఆదేశించాడు.

తరువాత అతను తలుపులకి లోపలినుండి తాళంవేసుకుని ఇతరులని భ్రమింప చేయడానికి లైట్ వేసేవుంచి బాత్‌రూం కిటికీగుండా ఫైర్ ఎస్కేప్ మీదికి చేరుకుని నింపాదిగా మెట్లుదిగాడు.

అయిదు గంటలకు చీకటి దట్టంగా అలుముకుంటుంది. చలి ఎముకలు కొరికేస్తుంది. రోడ్డంతా తెల్లని, మెత్తని దూదిలా మంచు పరుచుకుని వుంది. నడుస్తుంటే కాళ్ళు ఆ మంచులో పిక్కలవరకు దిగబడుతున్నాయి.

నిర్మల్ కుమార్ వంద గజాలు నడిచేసరికి అతని హాటు, కోటు, బూట్లు, తెల్లని మంచుతో కప్పబడిపోయాయి.

మంచు కురుస్తున్న ఆ వాతావరణం అతనికి లాభదాయకంగా వుంది. పైనుండి క్రిందివరకు మంచుతో కప్పబడి పోవటంవల్ల అతని నెవరూ గుర్తించరు. మంచుతో నిండిన రోడ్డుపై ఎలాంటి శబ్దం లేకుండా నడిచిపోవచ్చు. అన్నింటికి మించి, ఈ వాతావరణంలో, పోలీసులు ఎదురుపడే అవకాశం చాలా తక్కువ వుంది.

పది నిముషాల్లోనే అతను 'త్రీక్రౌన్స్' హోటల్ ముందున్నాడు. ఈ ఆపరేషన్‌కి బయలుదేరే ముందు, అతను బుడాపెస్టు మాప్‌ని బాగా స్టడీ చేయటంవల్ల దారి కనుక్కోవడం అతని కేమంత కష్టంకాలేదు.

బుడాపెస్టులో పేరు పడ్డ హోటల్ 'త్రీక్రౌన్స్'. హోటల్ లాబీ మెర్క్యురీ లైట్ల కాంతిలో మిలమిలలాడుతూంది.

ముఖద్వారంవద్ద ఇద్దరు వ్యక్తులు కాపలా వున్నారు. వేస్టు హోల్‌స్టర్‌లో రివాల్వర్ లున్నాయి. వాళ్లు పోలీస్ వ్యక్తులని గుర్తించాడు నిర్మల్ కుమార్.

త్రీ క్రౌన్స్‌లో తొంభయి పాళ్ళు పని వాళ్ళందరూ పోలీసు వాళ్ళే ననే విషయం మేజర్ ద్వారా అతనికి ముందే తెలుసు.

నిర్మల్ కుమార్ తలవంచుకుని కోటు జేబుల్లో చేతులు పెట్టుకుని హోటల్ ముందునుండి ముందుకి సాగిపోయ్యాడు.

హోటల్‌ని ముందునుండి, ప్రక్కలనుండి గమనించిన నిర్మల్ కుమార్ వెనక్కి చేరుకున్నాడు. వెనుక విశాలమయిన కాంపౌండ్ వుంది. హోటల్ "U" ఆకారంలో వుంది. రెండు వైపులా రెండు బ్లాక్స్ వున్నాయి. క్రింది అంతస్తు, మొదటి అంతస్తుల్లోని కిటికీల్లోంచి వెలుగు రేఖలు బయటకు ప్రసరిస్తున్నాయి. అయినా ఆ వెలుగు కాంపౌండ్‌లోని చీకటిని పారద్రోల లేకపోయింది.

జాగ్రత్తగా రోడ్ క్రాస్ చేసి కాంపౌండ్ గోడను చేరుకున్నాడు. నెమ్మదిగా తలను ఎత్తి లోపలకి తొంగి చూచాడు.

సరిగ్గా అప్పుడే ప్రకాశవంతమయిన టార్చి వెలుగు అతని ముఖంపై పడింది. మెరపులా అతని చేయి కోటుజేబులోని రివాల్వర్ పైకి చేరుకుంది. తను వాళ్ళ దృష్టిలో పడ్డానేమో అనుకున్నాడతను.

కాని; మరుక్షణమే ఆ వెలుగు అతని ముఖంమీది నుండి తప్పుకుని కాంపౌండ్ గోడచుట్టు తిరుగుతూ మాయమయ్యింది. నిర్మల్ కుమార్ చేయి రివాల్వర్ పై వదులయింది.

ఒక సిపాయి భుజంపై కార్బాయిన్‌తో కాంపౌండ్‌లో పహారా ఇస్తూండటం గమనించాడు. అతను యథాలాపంగా టార్చి వెలగించి పరికించాడేకాని, దాని వెలుగు ననుసరించి, అతని దృష్టి పారలేదని తెలుసుకున్నాడు.

అతను కాంపౌండ్‌లో పహారా ఇస్తూ అటువైపు వెళ్ళాడు. హోటల్ బ్లాక్ వైపున్న ఫైర్ ఎస్కేప్ వద్ద ఆగాడా సిపాయి. చేతిలోని టార్చిని వెలిగించి ఫైర్

ఎస్కేప్ మెట్లపై ప్రసరింప చేశాడాతను.

కొంచెం సేపటి తర్వాత వెలుగు మాయమయ్యింది. సిపాయి ముందుకి సాగిపోయాడు.

నిర్మల్ కుమార్ నెమ్మదిగా రెండడుగులు ముందుకి వేసి ఒక్క గెంతుతో కాంపౌండ్ గోడను దూకాడు. దూకిన వెంటనే లేవకుండా దూకిన చోటనే అలాగే అతుక్కుపోయాడు. ఒక్క క్షణం వేచి చూచి ఎటునుండి ఏ విధమయిన ప్రతిక్రియ లేదని నిర్ణయించుకుని, అతను ముందుకి వంగి అలాగే ఫైర్ ఎస్కేప్ వైపు పరుగెత్తాడు.

అతనలా కొద్ది దూరం పరుగెత్తాడో లేదో, ఎలక్ట్రిక్ షాక్ తగిలినట్లుగా ఠక్కున ఆగిపోయాడు. క్షణకాలంలో అతను నేలపై బోర్లా పడుకుని వున్నాడు.

ఫైర్ ఎస్కేప్‌కి కొంచెం దూరంలో మరో సిపాయి గోడకానుకుని నిలబడి వున్నాడు. అతని భుజాలపై లైట్ మిషిన్ గన్ వుంది. చీకటిలో అతను నిర్మల్ కుమార్‌కి కనిపించలేదు. అతని అదృష్టమే అతణ్ని కాపాడింది.

సిపాయి బహుశా సిగరెట్ కాలుస్తూ నిలబడ్డాడేమో! అతని పెదవుల మధ్య వెలుగుతున్న నిప్పురవ్వను చూడకుంటే నిర్మల్ కుమార్ నేరుగా పరుగెత్తి అతణ్ని గుద్దుకునేవాడు.

నిర్మల్ కుమార్, అతనికి ఎదురుగా నాలుగడుగులు దూరంలో మంచుపై పడుకుని వున్నాడు. ఎదురుగా వున్న ఆ సిపాయి దృష్టి ఏ క్షణంలోనయినా, నిర్మల్ కుమార్‌పై పడవచ్చు.

టార్చితో ముందుకి వెళ్ళిన గార్డు కూడా 'బ్లాక్' చుట్టు తిరిగి అటే వస్తున్నాడు. నిర్మల్ పరిస్థితి బోనులో చిక్కిన ఎలుకలా అయింది.

వెనక్కి తిరిగి వెళ్ళడంకూడా మృత్యువుని ఆహ్వానించడమే అవుతుంది. ఎదురుగా వున్న గార్డ్ దృష్టి తనపై పడ

వచ్చు.

తను కావాలనుకుంటే ఆ ఇద్దరినీ సులువుగా షూట్ చేయ గలడు, కాని, తరువాత వారి శవాలను మాయం చేయడం కష్టం. వాళ్ళు కనిపించకపోతే హోటల్లో కోలాహలం మొదలవుతుంది.

చుట్టు పరికించిన అతనికి ఎదురుగా వున్న 'బ్లాక్' గోడకు ఒక లాంతరు గుడ్డిగా వెలుగుతూ తగిలించి వుండడం కని పించింది. నిర్మల్ కుమార్ జేబులోంచి సైలెన్సర్ రివాల్వర్ తీసాడు. రివాల్వర్‌ని లాంతరు వైపు గురిపెట్టి ట్రిగ్గర్ నొక్కాడు.

'ఫట్...' అన్న చిన్న శబ్దం...ఆ మరుక్షణమే లాంతరుకున్న గాజు బుడ్డి బళ్ళున పగిలిన శబ్దం వినిపించింది.

ఆ ఇరువురు గార్డ్స్ వులికిపడ్డారు. వాళ్ళ భుజాల పైనున్న ఆయుధాలు వాళ్ళ చేతుల్లోకి చేరుకున్నాయి. సిగరెట్ తాగుతున్న సిపాయి లాంతరు వైపు సాగాడు.

టార్చివాలా అప్పటికే అక్కడికి చేరుకుని, టార్చి వెలు గుని, లాంతరు వున్న గోడపైకి, ఆ చుట్టుప్రక్కల వేసి పరి కించసాగాడు.

తన ఎదురుగా వున్న గార్డు బాగా ముందుకి వెళ్ళి పోయాడు. అతని వీపు తనవైపుంది. నిర్మల్ కుమార్ లేచి నిలబడి బుల్లెట్‌లా ఫైర్ ఎస్కేప్ మెట్ల వైపు పరు గెత్తాడు. నిశ్శబ్దంగా అతను మెట్లు ఎక్కి మొదటి అంత స్తుకి సమానంగా నిర్మింపబడివున్న స్టీల్ ప్లాట్‌ఫాంపై బోర్లా పడుకుని కిందికి తొంగి చూడసాగాడు.

"ఏమయింది?" మిషిన్‌గన్ వాలా, టార్చివాలాని అడిగాడు.

"మరేంలేదు. లాంతరుకున్న గాజు బుడ్డి వేడెక్కింది. బయటి చలివాతావరణానికి చిట్లిపోయింది."

"ఓహ్!" అంటూ మిషిన్‌గన్‌తో వున్న గార్డు తన గన్‌ని నిర్లక్ష్యంగా భుజంపైకి ఎక్కించుకున్నాడు.

టార్చివాలా మళ్ళీ టార్చిని నలువైపులా త్రిప్పుతూ చూడసాగాడు. ఒకసారి టార్చి వెలుగు నిర్మల్‌కుమార్ వున్న స్థలానికి రెండడుగులు క్రిందుగా వచ్చింది.

నిర్మల్‌కుమారు బల్లిలా ఆ ప్లాట్‌ఫాంకి అతుక్కుపోయాడు.

టార్చి వెలుగు ఆరిపోయింది. ఆ ఇరువురు గార్డ్సు అక్కడే నిలబడి ఏమేమో మాట్లాడుకోసాగారు.

మంచుతో కప్పబడివున్న ఆ స్టీల్ ప్లాట్‌ఫాంపై... నిర్మల్‌కుమార్ శరీరంలోని రక్తం గడ్డకట్ట సాగింది. ఆ చలికి కాళ్ళు, చేతులు కొంకర్లుపోతున్నాయి. పళ్ళు ఎక్కడ టకటక లాడతాయోనని అతను జేబురుమాలు వుండలా చుట్టి నోట్లో కుక్కుకున్నాడు. వాళ్ళు తమలో తాము మాట్లాడుకోవటం చూసి నిర్మల్‌కుమార్ నెమ్మదిగా లేచి రెండవ అంతస్తుకు వెళ్ళే ఫైర్ ఎస్కేప్ మెట్లపైకి చేరుకుని రెండవ అంతస్తుకి చేరుకున్నాడు.

అక్కడినుండి క్రిందికి తొంగిచూశాడు.

తెల్లని మంచుపొగ తప్పితే మరేమీ కనిపించలేదు. ఆ ఎత్తులో, చీకటివల్ల, మంచు పొగవల్ల అతనికి గార్డుకూడా కనిపించలేదు.

అతనికి కొంచెం దూరంలో గాజు ఫ్రేం బిగించిన కిటికీ వుంది. అతనక్కడికి వెళ్ళి మంచులో కప్పబడిపోయిన గాజుని తన చేతులతో తుడిచి లోపలకి తొంగిచూశాడు.

అది విశాలంగా వున్న బాత్‌రూం. అక్కడ అప్పుడు ఎవరూ వున్నట్టు లేరు! నిర్మల్‌కుమార్ తన జేబులోంచి కత్తిని తీసాడు. రెండు కిటికీ రెక్కలకి మధ్యనున్న సన్నని

సందులోంచి కత్తిని దూర్చి పైకి లేపాడు. దాంతో మధ్యనున్న హుక్ లేచిపోయింది.

నిశ్శబ్దంగా కిటికీ రెక్క తెరిచి లోపలకు చేరుకుని, కిటికీని తిరిగి మూసేశాడు.

చేతులకి గ్లవ్స్ లేకపోవడం వల్ల చలికి, అతని చేతుల్లోని రక్తం గడ్డకట్టుకుపోయింది. అతను సేరుగా సింక్ వద్దకు వెళ్ళి వేడి నీళ్ళ పంపు వదిలాడు. రెండు క్షణాలలోనే సింక్ వేడినీళ్ళతో నిండిపోయింది. తన రెండు చేతులని ఆ వేన్నీళ్ళలో ముంచాడు.

ఒక్క క్షణం అతనికి బాధ అనిపించింది. ఆ తరువాత హాయిగా వుంది. కొంచెం సేపట్లోనే అతని చేతుల్లో తిరిగి రక్తసంచారం ప్రారంభమయింది.

అతను చేతులని తీసి బేసిన్‌లోని నీళ్ళను వదిలేశాడు. ఒక వైపు బార్‌పై వున్న టవల్ అందుకుని తుడుచుకున్నాడు. అతని చేతుల్లో తిరిగి ప్రాణం వచ్చింది.

బాత్‌రూం లైటార్పి అతను తలుపు తెరిచాడు. తలుపు ఒక కారిడార్‌లోకి తెరుచుకుంది కారిడార్ పొడుగునా తివాచీ పరచి వుంది. కారిడార్‌కి రెండు వైపులా గదులున్నాయి. నిర్మల్ కుమార్‌కి ఎదురుగా వున్న గదిపై 58 అని వుంది. ఆ ప్రక్క 54 వుంది.

నిర్మల్ కుమార్ తృప్తిగా నిట్టూర్పు వదిలాడు. తనకి తెలియకుండానే తను ప్రొఫెసర్ ఆచార్య వుంటున్న వింగ్‌లోకి వచ్చాడు. అంతలోనే అతని దృష్టి కారిడార్‌లో ఒక మూలన నిలబడివున్న గార్డ్‌పై బడింది. అతను చటుక్కున తలని లోపలకు లాక్కున్నాడు.

కారిడార్‌లోవున్న గార్డ్ గోడకు ఆనుకుని నిలబడి వున్నాడు. అతని భుజంపై కార్బయిన్ వుంది. అతనిడ్యూటీ బహుశా ఆ కారిడార్‌లోనే వున్నట్లుంది. నిశ్చింతగా నిల

బడివున్నాడు.

నిర్మల్ కుమార్ బాత్ రూంలో వున్న డ్రెసింగ్ టేబిల్ పై కూర్చుని సిగరెట్ వెలిగించి ఏంచేయాలా అని ఆలోచించ సాగాడు.

అతని దృష్టిలో పడకుండా ప్రొఫెసర్ గదివరకు వెళ్ళడం అసంభవం. అక్కడి వరకు వెళ్ళాలంటే ముందు గార్డ్ని, అక్కడినుండి కదిలించాలి. మిరుమిట్లుగొలిపే లైట్లకాంతిలో ఆ పొడుగాటి కారిడార్ లో అతనితో తలపడడం మూర్ఖత్వమే అవుతుంది.

చివరకు అతనో ఉపాయం ఆలోచించాడు.

అతను సిగరెట్ ఆర్పి ఒకమూలకి విసిరాడు.

బాత్ టబ్ కివున్న వేన్నీళ్ళ పంపుని తిప్పాడు. నీళ్లు బాత్ టబ్ లో పడుతున్నాయి.

నిర్మల్ కుమార్ ఒకట్నొకటిగా తన వంటిపై దుస్తులు విప్పాడు. తరువాత అతను తన నడుముచుట్టు టవల్ చుట్టుకున్నాడు. తన తలను మెడవరకు తడిపి సబ్బు రుద్దుకో సాగాడు.

కొద్దిసేపట్లోనే అతని తల, ముఖం, మెడ సబ్బునురగతో కప్పబడింది. తన వర్ణన ప్రతి సీక్రెట్ పోలీసుకీ చెప్పి ఉంటారని అతనికి తెలుసు.

తరువాత అతను చేతులు తుడుచుకుని ఒకచేత్తో రివాల్వర్ పట్టుకుని, అదికనిపించకుండా దానిపై మరో తువ్వాలు వేసుకుని బాత్ రూం బయటకువచ్చి గార్డ్ని పిలిచాడు.

గార్డ్ ఉలికిపడి నిర్మల్ కుమార్ వైపు చూశాడు. అతని చేతులు అలవాటుప్రకారం కార్బయిన్ పైకి వెళ్లాయి.

కాని అతను దూరంగా సబ్బునురగతో ఇంచుమించు నగ్నంగావున్న నిర్మల్ కుమార్ ని చూడగానే అతని చేతులు యథాస్థానంలోకి చేరుకున్నాయి.

అతనేదో అనడానికి నోరు తెరిచేలోగానే నిర్మల్ కుమార్ తన పెదవులపై ఒక వేలుపెట్టి "ష్" అని మౌనంగా ఉండమని సైగచేశాడు.

గార్డు సందిగ్ధంగా నిర్మల్ కుమార్ వైపు చూడసాగాడు.

నిర్మల్ కుమార్ వేగంగా చేయూపుతూ అతన్ని రమ్మని సైగచేశాడు.

అతను ఒకక్షణం తటపటాయించి నిర్మల్ కుమార్ వైపు పరుగెత్తాడు. పరుగెత్తుతూనే భుజానికి వేళ్ళాడుతున్న కార్బైన్ని చేతుల్లోకి తెచ్చుకున్నాడు.

"బయట ఫైర్ ఎస్కేప్ మెట్లదగ్గ ఒకతనున్నాడు" నిర్మల్ కుమార్ గుసగుసలతో అన్నాడు. "అతను కిటికీ తెరిచి లోపలకు రావడానికి ప్రయత్నిస్తున్నాడు."

"ఈజిట్...?" గార్డు ఆశ్చర్యంగా అన్నాడు. అతని కళ్లు విస్ఫారితమయ్యాయి. "నువ్వు చూశావా అతణ్ని?"

"అవును; ఆ తరువాతనే నిన్ను పిలిచాను. నాకు భయంగావుంది," నిర్మల్ కుమార్ భయం నటిస్తూ అన్నాడు.

"భయపడక. నేను చూస్తాను."

నిర్మల్ కుమార్ పక్కకు తప్పుకోగానే గార్డు లోపలకు ప్రవేశించి కిటికీవైపు వెళ్ళాడు.

గార్డు కిటికీవైపుకి వెళ్ళగానే నిర్మల్ కుమార్ ఎడమచేతిలోని రివాల్వర్ని కుడిచేత్తో బారెల్ వైపు పట్టుకుని గార్డు కణతపై బలంగా ఒక్కటిచ్చాడు.

గార్డు పాపం! కిక్కురుమనలేదు. అచేతనంగా అతని శరీరం క్రిందికి జారుతుంటే దానిని మధ్యలోనే ఆపి నెమ్మదిగా క్రింద పడుకోబెట్టాడు నిర్మల్ కుమార్.

తరువాత అతను టవల్ చింపి దానితో గార్డు కాళ్ళు, చేతులు బలంగా బంధించాడు. నోరు తెరిచి నోట్లో పేలికలు కుక్కాడు.

బాత్ రూంలో ఒక మూల దుస్తులు మార్చుకోవడాని ఉన్న వార్డురోబ్ లో గార్డుని చేరవేసి బయటినుండి బోల్ట్ బిగించాడు.

అయిదునిముషాల తరువాత నిర్మల్ కుమార్ బాత్ రూం లోంచి బయటకువచ్చి కారిడార్ లో నడవసాగాడు. అత ట్రెంచ్ కోట్ భుజంపైనుండి ఫెల్ట్ హాట్ చేత్తో పట్టుకుని హోటల్లో బసచేసిన ఒక గెస్టులా నిర్లక్ష్యంగా ముంద సాగిపోయాడు.

యాభయితొమ్మిదవగది ముందాగి, తనవద్దనున్న తాళ చెవులతో తలుపు తీయడానికి ప్రయత్నించాడు. కా తలుపురాలేదు. ఆ తలుపుని వదిలి ప్రక్కనున్న తలు వద్దకు వెళ్లాడు. ఆ తలుపుపై ఏవిధమయిన నెంబరూ లే ఒకసారి అతను గదులను పరీక్షించాడు. నెంబరున్న ప్ర తలుపుకి ప్రక్కనున్న తలుపుపై నెంబరులేదు. దాంతో గదులు, నెంబరున్న గదులకి సంబంధించినవేనన్న నిర్ణ నికి వచ్చాడు.

తనవద్దనున్న తాళంచెవులతో ఆ తలుపులని తీయ ప్ర త్నించాడు. రెండుసార్లు ప్రయత్నించిన తరువాత మూ సారి తలుపులు తెరుచుకున్నాయి. అదికూడా ఒక బా రూం. ఆ బాత్ రూంలోకి గదినుండికూడా ద్వారముంది.

నిర్మల్ కుమార్, గదికీ, బాత్ రూంకి మధ్యనున్న తలు గుండా ప్రొఫెసర్ గదిలోకి ప్రవేశించాడు. జేబులో పెన్సిల్ టార్చి తీసి గదిని పరికించాడు. కిటికీలు అ మూసివున్నాయని, వాటిపై మందమయిన కర్టెన్లు వేళ్లా తూండడం గమనించి, అతను లైట్ స్విచ్ నొక్కాడు.

మరుక్షణం, అతను గదిలోని ప్రతి వస్తువునీ పరికి పాగాడు.

పావుగంట విఫల ప్రయత్నం తరువాత అతని

ంలించింది. గదిలోని వెంటిలేటర్‌కున్న ఇనుపరాడ్‌కి అతి ంచివున్న మైక్రోఫోన్ కనిపించింది.

అటునుండి అతను బాత్‌రూంలోకి వచ్చి బాత్‌రూంలో ాడా జాగ్రత్తగా పరీక్షించాడు. అక్కడ అలాంటి పాయకరమయిన వస్తువులేమీ కనిపించలేదు.

అంతలో బయట కారిడార్‌లో ఇద్దరు మనుష్యులు మాట్లాడుతున్న శబ్దం వినిపించి నిర్మల్‌కుమార్ గదిలోని టార్పి ఒక్క అంగలో తిరిగి బాత్‌రూంలోకి చేరుకు న్నాడు. బాత్‌రూం తలుపుని ఓరగా వేసి, సందులోంచి దిలోకి తొంగి చూడసాగాడు.

కొద్దిసేపటి తరువాత ఆ గదితలుపులు తెరుచుకుని ప్రొఫె ర్ ఆచార్య లోపలకు ప్రవేశించాడు. అతని ఫోటో ాడంవల్ల వెంటనే గుర్తుపట్టాడు.

అతనితోపాటే లావుగా ధృఢంగావున్న మరోవ్యక్తి పలకు వచ్చాడు. అతను కాన్ఫరెన్స్ అటెండవడానికి చ్చిన సైంటిస్టా? లేక సీక్రెట్ పోలీసులకు సంబంధించిన క్తా? తెలుసుకోవడానికి నిర్మల్‌కుమార్ వద్ద ఏ ఆధారమూ ను. ఏది ఏమయినా ఆ వ్యక్తికి వెంటనే అక్కణ్ణుంచి శెలా లేదని అతని చేతిలోని బాటిల్ చూస్తే అర్థమవు ంది.

పావుగంట తర్వాత అతను ఆ గదిలోంచి నిష్క్రమి ంచాడు. అంతసేపు నిర్మల్‌కుమార్ ఓపికగా కాచుకొని న్నాడు.

ప్రొఫెసర్ లోపలినుండి తలుపులు మూసాడు.

నిర్మల్‌కుమార్ బాత్‌రూం తలుపులు తెరిచి తలుపుల ధ్య నిలుచున్నాడు.

ప్రొఫెసర్ అతనిని చూచి ఏదో అనడానికి నోరు తెరి డు. కాని నిర్మల్‌కుమార్ సైగ చేయడంతో ఆయన

నిశ్చేష్టుడై నిలబడిపోయాడు.

బాత్ రూంలోకి రమ్మని చేయూపాడు నిర్మల్.

ఆచార్య ఆశ్చర్యంగా అతణ్ని చూస్తూ ముందుకిసాగాడు.

ఆయన బాత్ రూంలోకి రాగానే నిర్మల్ కుమార్ తలుపులు మూశాడు.

"ఎవరు నువ్వు?" ప్రొఫెసర్ కంఠంలో భయం తొంగి చూసింది. "ఈ సమయంలో నా గదిలో ఏం చేస్తున్నావు?"

"నా పేరు నిర్మల్ కుమార్," నిర్మల్ కుమార్ చెప్పసాగాడు. "నేను ఇండియానుండి వస్తున్నాను. ఇండియన్ ఇంటలిజెన్స్ ఇన్ఫర్మేషన్ కి సంబంధించిన మనిషిని. మీతో కొన్ని ముఖ్యమయిన విషయాలు చెప్పాలని వచ్చాను," తాను 'సాడ్' ఏజెంటునన్న విషయం మరుగుపరుస్తూ అన్నాడు.

"అయితే ఇక్కడ బాత్ రూంలో ఏం చేస్తున్నావు? గదిలోకి పద," ప్రొఫెసర్ గదిలోకి వెళ్ళడానికి వెనక్కి తిరిగాడు.

నిర్మల్ కుమార్ ఆయన్ని భుజం పట్టుకుని ఆపాడు. "సారీ సర్! గదిలో వద్దు. ఆ గదిలో మైక్రోఫోన్ వుంది. దాని వల్ల మన మాటలన్నీ హంగరీ పోలీసులు వినే అవకాశముంది."

"మైక్రోఫోన్!!" ప్రొఫెసర్ వులికిపడ్డాడు. "ఎక్కడ?"

"వెంటిలేటర్ కున్న గ్రిల్ లో వుంది."

"నీకా విషయం ఎలా తెలుసు?" నిర్మల్ కుమార్ కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగాడు.

"మీరు రావడానికి ముందు మీ గదిని నేను సెర్చ్ చేశాను" నిర్మల్ కుమార్ క్షమార్థిలా అన్నాడు.

"నీ విక్కడ ఎప్పటినుండి వున్నావు?"

"మీరు రావడానికి పది నిముషాలు ముందునుండి."

"అంత తక్కువ సమయంలో అది నీ కంటబడిందా?"

"అవును! నేను ఇంటలిజెన్స్‌కి సంబంధించిన మనిషినని మీరు మరచిపోతున్నారు."

"సరే! ఇప్పుడు నీకేం కావాలి?"

"భారత దేశానికి మీ అవసరం ఎంతో వుంది ప్రొఫెసర్. ప్రగతిని సాధిస్తున్న దేశానికి మీలాంటి సైంటిస్టులు ఎంతో అవసరం. మిమ్మల్ని తిరిగి భారతదేశం రమ్మని భారతదేశం తరఫున మిమ్మల నాహ్వానిస్తున్నాను," నిర్మల్ కుమార్ వినమ్రస్వరంతో అన్నాడు.

ప్రొఫెసర్ ఆచార్య వెంటనే తనకూ కూడా భారత దేశానికి తిరిగి రావాలనుంది అని చెప్పాలనుకున్నాడు కాని, అతని మనోనేత్రం ముందు, భార్యా కుమారుడు కనిపించేసరికి గుండె నెవరో నలిపినట్లుగా బాధపడ్డాడు.

"థాంక్స్ మిస్టర్ నిర్మల్ కుమార్!" ఆచార్య మ్లానవదనంతో అన్నాడు. "భారత ప్రభుత్వానికి నా కృతజ్ఞతలు తెలియచేయండి. ఒక వ్యక్తి కిష్టంలేని పనిని ఎవరూ చేయించలేరు. నాలాంటి మరో వైజ్ఞానికుణ్ని వెతుక్కోమని చెప్పండి..."

"దేశానికి మీ అవసరముంది ప్రొఫెసర్."

ప్రొఫెసర్ ఏమీ మాట్లాడలేదు.

రెండు క్షణాల తర్వాత నిర్మల్ కుమార్ అడిగాడు. "స్వదేశం రావడం మీ కిష్టంలేదా ప్రొఫెసర్?"

ఆచార్య అప్పటికికూడా ఏమీ మాట్లాడలేదు.

"వెరీవెల్ సర్!" నిర్మల్ కుమార్ అన్నాడు. "మీ ఇష్టం. మీ నిర్ణయానికి మే మెప్పుడు ఎదురుచెప్పం."

"వాట్?!" ఆచార్య విస్మయంగా అడిగాడు. "నా నిర్ణయాన్ని మీరు స్వీకరిస్తారా? నేను రావంటే మీరింత సులభంగా వదిలేస్తారా? ఆ మాత్రం దానికి ఇండియానుండి

బుడాపెస్టుకి నిన్ను పంపించారా??"

"నేను కేవలం మెసెంజర్‌ని ప్రొఫెసర్. మిమ్ములని భారతదేశం రమ్మని సందేశం అందించమని ప్రభుత్వ మాదేశించింది. అది నేను నెరవేర్చాను."

"నేను భారతదేశం రావటానికి ఒప్పుకుంటే...?"

"మిమ్ములను సురక్షితంగా భారతదేశం తీసుకువెళ్తాను."

"నీవు నన్ను భారతదేశం తీసుకెళ్తావా? మిస్టర్ నిర్మల్ కుమార్ నీవేం మాట్లాడుతున్నావో నీకు తెలుసా? నీవు నన్ను బుడాపెస్టునుండి, సామ్యవాద దేశమయిన హంగరీ రాష్ట్రంనుంచి బార్డర్ క్రాస్ చేయించి తీసుకెళ్తావా??"

"యస్!" నిర్మల్ కుమార్ ధృఢంగా అన్నాడు.

"మిస్టర్ నిర్మల్ కుమార్...!" కొన్ని క్షణాల తరువాత ప్రొఫెసర్ పిలిచాడు.

"యస్ సర్!"

"నీవు ఇంటలిజెన్స్ ఏజెంటువి కదూ!"

"అవును."

"నీ అధికారుల ఆజ్ఞను పాలించడం నీ ధర్మం. అవునా?"

"ఊఁ!" ప్రొఫెసర్ ఎందుకీ ప్రశ్నలు అడుగుతున్నాడో అతనికి అర్థంకాలేదు.

"భారతదేశం...నన్ను తీసుకు రమ్మనికాక, కేవలం నన్ను రమ్మని ఆహ్వానించి రావడానికి నిన్ను పంపిందని, గుండెలపై చేయి వేసుకుని చెప్పగలవా? నా ఇష్టా ఇష్టాలతో పని లేకుండా నన్ను పిలుచుకు రమ్మని నిన్ను పంపలేదంటావా?"

"అలాంటిదేమీ లేదు ప్రొఫెసర్..." నిర్మల్ కుమార్ నెమ్మదిగా చెప్పసాగాడు. ఎట్టి పరిస్థితుల్లోనూ ప్రొఫెసర్‌ని నమ్మించాలి. అలాంటి అప్పుడే పరిణామం మంచిదయే అవకాశముంది.

"నేను మిమ్ములను ఆహ్వానించడానికే వచ్చాను. నేను మిమ్ములను బలవంతంగా తీసుకెళ్ళినంత మాత్రాన లాభం ఏముంది చెప్పండి. మీ చేత బలవంతంగా ఏ పని చేయించలేము. మీరు మీ ఇష్టపూర్వకంగా భారతదేశానికి మీ సేవలు అర్పించదలచుకున్నప్పుడే మాకేమయినా లాభం. అందుకని మీరు భారతదేశం రావడం, రాకపోవడం, అంతా మీ ఇష్టం మీదే ఆధారపడి వుంది."

ప్రొఫెసర్ తిరిగి మౌనం వహించాడు. అతని మనస్సులో కల్లోలం చెలరేగిందని ఆయన ముఖంలోని భావాలు చెబుతున్నాయి.

"మిస్టర్, నిర్మల్ కుమార్...!" ప్రొఫెసర్ కంపిత స్వరంతో అన్నాడు. "నా భార్య...నా భార్య ప్రసూన. ఇంకా జీవించి వుందా?"

"నేను పాలం ఎయిర్ పోర్టునుండి బయలుదేరడానికి రెండు గంటల ముందామెను చూశాను" నిర్మల్ కుమార్ ప్రొఫెసర్‌ని నమ్మించడానికి చెప్పసాగాడు. నిజానికతను ప్రొఫెసర్ భార్యను ఇంతకు ముందెప్పుడు చూళ్ళేదు.

"ఆమె మృత్యువుతో పోరాడుతూంది."

"ఆమె చాలా సీరియస్‌గా వుందా?"

"ఆ విషయం డాక్టర్లే చెప్పాలి?"

"ఓహ్ గాడ్!" ప్రొఫెసర్ తల పట్టుకుంటూ అన్నాడు.

"మిస్టర్ నిర్మల్ కుమార్ నన్ను హింసించకు... చెప్పు .. డాక్టర్లేమంటున్నారు. నా భార్య బ్రతుకుతుందా...?"

కొన్ని క్షణాల మౌనం తరువాత నిర్మల్ కుమార్ చెప్ప సాగాడు. "ప్రొఫెసర్. ప్రసూనాంబగారు చావుకి అతి సమీపంలో వున్నారు. ఏ క్షణంలోనయినా ఆమె ప్రాణాలు ఈ అనంతవిశ్వంలో లీనమయి పోవచ్చు. ఆపరేషన్ సక్సెస్ అయిన తర్వాత కూడా ఆమె ఆ స్టేజికి చేరుకొన

డానికి, కారణం ఆమె జీవించాలన్న ఆశను వదలివేయడమే అని, సర్జన్ అంటున్నాడు."

"భగవాన్! ఓహ్!" అన్నాడు ప్రొఫెసర్. ఆయనదృష్టి పైన్న ఎక్కడో శూన్యంలోకి చూస్తోంది. ఆయన కను కొలకుల్లో ముత్యాల్లా కన్నీటి బిందువులు మెరుస్తున్నాయి.

"ఓహ్ గాడ్...ఇదెలా సంభవం?" ప్రొఫెసర్ గొణుక్కున్నాడు.

"ఇప్పుడు జరుగుతున్నది అదే ప్రొఫెసర్" నిర్మల్ కుమార్ తీక్షణంగా అన్నాడు. "మిమ్మలను మీరు మోసం చుకోలేదు. సామ్యవాదులు నేర్పిన పాఠాలు నేర్చుకుని మీరు మీ దేశాన్ని, దేశభవిష్యత్తుని సామ్యవాదుల చేతుల్లో పెడుతున్నారు. మీ భార్యకు ఏ ఆధారముందని ఆమె బతకాలని కోరుకుంటుంది. సామ్యవాదుల చేతుల్లో చిక్కని, తనని తాను అమ్ముకున్న భర్తముఖంకూడా ఆమె చూడ లేదు."

"నో; ఇది అబద్ధం."

"ఇటీజ్ ట్రూ ప్రొఫెసర్" నిర్మల్ కుమార్ చెప్పగాడు. ఇలా సడన్ గా ప్రొఫెసర్ కి షాక్ ట్రీట్ మెంట్ వ్వడం అతనికి బాధను కలిగిస్తోంది. కాని తప్పదు. అది న విద్యుక్తధర్మం.

"మీరు ఇక్కడ సామ్యవాదుల వేదికపై నిలబడి సామ్యవాదుల గురించి వారి ప్రగతిని గురించి గొప్పలు చెబుతూనే ండండి. అక్కడ మిసెస్ ఆచార్య విలవిల్లాడుతూ ప్రాణం దులుతారు. ప్రొఫెసర్, మీ భార్య చావుకి అతిసమీపంలో ంది. ఆమెను మీరు చంపుతున్నారు. మీరు ఆమెను హత్య చేస్తున్నారు. మీ నిర్ణయాలు, మీ ప్రసంగాలు ఆమెను హత్య చేస్తున్నాయి."

"స్టాప్! ఫర్ గాడ్ సేక్. అలా అనక" ప్రొఫెసర్

దెబ్బతిన్న పక్షిలా విలవిల్లాడుతూ రెండుచేతుల్లోనూ తలను పట్టుకుని అన్నాడు.

"యూ ఆర్ రైట్! నేనెంత బాధ ననుభవిస్తున్నానో నాకు తెలుసు. కాని నేను ఏంచేసినా నా భార్యా కొడుకుల కోసం చేశాను. మైడియర్ సన్ ఇప్పుడే ఎగిరిపోయి నా భార్యను నా ప్రసూనను ఒకసారి చూడాలనివుంది. కాని... కాని అది అసంభవం."

ప్రొఫెసర్ కళ్ళనుండి అవిరళధారగా కన్నీరుకారి ముడతలుపడ్డ చెంపలపై ప్రవహిస్తూంది.

"ఎందుకు?"

"పరిస్థితి అలావుంది. నేను సామ్యవాదులని వదిలి నా భార్యవద్దకు వెళ్ళానంటే నా బాబు, నా కొడుకు, మధుకర్ గతి ఏమవుతుందోనని భయంగావుంది."

"ప్రొఫెసర్! మీరు భారతీయులు. అవసరమయితే శత్రువుకికూడా ప్రాణదానంచేయడం భారతీయుల రక్తంలో అనవాయితీగా వస్తుంది. ఒక ప్రాణంకోసం మరో ప్రాణం బలిపెట్టేంత క్రూరత్వం మనవద్ద లేదు. ఈ విషయం మీకు తెలియాలి. మీ కుమారుడు మధుకర్‌ని గురించి మాకంత తెలుసు. అంతేకాదు. మా ఏజెంట్లు ఇద్దరు అతన్ని వెన్నంటే వున్నారు. ఇరవయినాలుగు గంటల్లో మీ కుమారుడు సురక్షితంగా ఇండియాలో ఉంటాడు. అతను క్షేమంగా చేరుకున్నాడన్న వార్త రేడియోద్వారా ప్రసారమయే కోడ్ ద్వారా ధృవపరచుకున్న తరువాత మీరు రావాలనుకుంటే మిమ్ములను తీసుకువెళ్తాను."

"ఇటీజ్ ఇంపాసిబుల్" ప్రొఫెసర్ ఆచార్య నమ్మనట్లుగా అన్నాడు. "హౌ! హౌ కాన్ ఐ బిలీవ్ దట్.. నా కొడుకు" కంపనవల్ల ప్రొఫెసర్ కంఠంలోంచి మాట కూడా రావడంలేదు.

"ప్రొఫెసర్" నిర్మల్ కుమార్ చెప్పసాగాడు:

"ఇప్పుడు నేను మిమ్మల్ని నమ్మించలేను. నిజమే! కాని ఒక విషయం మీరే ఆలోచించండి. మధుకర్ ని సామ్యవాదుల్లో వదిలి, మీతో అబద్ధం చెప్పి ఇండియాకు తీసుకు వెళ్ళినంత మాత్రాన కలిగే లాభం ఏముంది. మీ కుమారుడు మీకు కనిపించకుంటే మిమ్మల్ని మోసం చేసిన భారత దేశంపై నమ్మక మెలావుంటుంది. అలాంటి స్థితిలో మీరు మీ దేశానికి ఏవిధమయిన రిసెర్చ్ వర్క్ చేయగలరు? ప్రొఫెసర్ నన్ను నమ్మండి. ప్రతిభావంతులయిన మీలాంటి సైంటిస్టుల రీసెర్చ్ వర్క్ ఇప్పుడు దేశానికి చాలా అవసరం. దేశరక్షణకోసం శాంతికోసం, ప్రపంచ మానవాళి అభ్యుదయంకోసం కొన్ని వందల కోట్ల ఖర్చుతో మొదలయిన ఒక రీసెర్చ్ ప్రాజెక్ట్ మధ్యలో ఆగిపోయింది. మీలాంటి మేధావులవల్లే అది పూర్తవుతుంది. కనీసం, దానిని గుర్తించుకునయినా భారత దేశం మీరాలోచిస్తున్న విధంగా ప్రవర్తించదని గుర్తించుకోండి."

నిర్మల్ కుమార్ మాటల ప్రభావం ప్రొఫెసర్ ముఖంపై వెంటనే కనిపించింది. ఆయన ముఖంలోంచి బాధ, భయం, మాయమయినాయి. ఆ స్థానంలో విశ్వాసం, నమ్మకం కనిపించాయి. ఆయన ముఖంలో ఒక వింత వెలుగు గోచరించింది.

నిర్మల్ కుమార్ మాటలవల్ల, చివరి క్షణాలలో వున్న భార్యను చూడాలన్న కోరిక ప్రొఫెసర్ లో ఉధృతమయింది.

ప్రొఫెసర్ అప్పటికప్పుడే నిర్మల్ కుమార్ తో బయలుదేరడానికి సిద్ధపడ్డాడు. కాని, అది ఇప్పుడే అసంభవమని దానికి స్కీమ్ సిద్ధం చేయాలనీ, అదీగాక, ముఖ్యంగా మధుకర్ క్షేమంగా చేరుకునేవరకు తొందరపడ్డం మంచిది కాదని చెప్పాడు. తను త్వరపడితే సామ్యవాదుల ఇనుప

పిడికళ్ళు మధుకర్‌ని బిగిస్తాయని చెప్పాడు.

అతనికి సిరోవ్ ఇంటి అడ్రసు చెప్పి, ఎంతో అత్యవసర మయితేతప్ప అక్కడికి రాకూడదని చెప్పాడు.

చివరగా అతను ఈనాటి ఈ సంఘటనవల్ల ప్రొఫెసర్‌లో ఏవిధమయిన మార్పు రాకూడదని, మామూలుగా ప్రవర్తించ మని హెచ్చరించాడు. సామ్యవాదులకి ఏమాత్రం అను మానం కలిగినా ఇక తప్పించుకోవడం అసంభవమని తెలి పాడు.

మళ్ళీ ఒకసారి ప్రొఫెసర్‌ని హెచ్చరించి బయలు దేరాడు నిర్మల్‌కుమార్.

ఈసారి ఫైర్ ఎస్కేప్ మెట్లనుపయోగించలేదతను. ప్రొఫెసర్ బెడ్‌రూంలోవున్న మూడుదుప్పట్లను గట్టిగా కలిపి ముడివేసి, దానిని కిటికీగుండా కిందికి జారవిడిచి, దానిద్వారా నెమ్మదిగా కిందికి జారాడు.

ప్రొఫెసర్ దుప్పట్లను తిరిగి పైకి లాక్కున్నాడు.

మరో అయిదు నిముషాలలో నిర్మల్‌కుమార్, ఆ మంచు రాత్రిలో, చీకట్లో, చీకటిగా కలిసిపోయాడు.

# 3

బుడాపెస్ట్‌లోని రోడ్లను సర్వే చేస్తూ నిర్మల్‌కుమార్ తిరిగి ఫైర్ ఎస్కేప్ ద్వారా తన గదిలోకి చేరుకునేసరికి రాత్రి పది అవుతూంది. అతని కడుపులో ఎలుకలు పరుగెత్తు తున్నాయి. అతను గదిలోకి చేరుకోగానే మొదట గదిలోని హీటర్ ఆన్ చేశాడు.

తరువాత అతను గదిని పరీక్షించాడు.

తను లేనప్పుడు తన గదిలోకి ఎవరూ రాలేదని నిర్ణ యించుకున్న తరువాత, అతను మానేజర్‌కి ఫోన్ చేసి భోజనం పంపించమని ఆర్డరిచ్చాడు.

పేరుపొందిన హాంగరీ విస్కీ, 'విలాన్యీ' ఒక బాటిల్

పూర్తిచేసి, తన భోజనం పూర్తిచేసేసరికి పదకొండు అయింది. ఆ చలిలో, ‘విలాన్వ్యీ’ కడుపులో చేరగానే అతని శరీరంలోకి వేడి ప్రవహించింది.

తను ప్రొఫెసర్‌ని కలిసిన విషయం, ఆయన్ని భారత దేశం బయలుదేరడానికి ఒప్పించిన విషయం, సిరోవ్, మేజర్ హేవార్డ్‌లకు తెలిపి, హాంగరీనుండి బయటపడ డానికి స్కీమ్ తయారు చేయడానికి సిరోవ్, మేజర్‌లను కలువడానికి అతను సిరోవ్ స్థావరానికి బయలుదేరడానికి తయారయ్యాడు.

తన గదిని జాగ్రత్తగా మూసేసి, తన గదిలోకి ఎవరయినా వచ్చినా, తను రాగానే ఆ విషయం తనకు తెలిసేలా తలుపులు లోపలినుండి మూసేసి, తిరిగి అతను ఫైర్ ఎస్కేప్ మెట్లమీదికి చేరుకున్నాడు.

అతను మెట్లు దిగుతుండగా టెలిఫోన్ మ్రోగింది.

నిర్మల్‌కుమార్ ఒక్క క్షణం ఆగి తిరిగి మెట్లు దిగ సాగాడు. అది తన గదిలోనే అని నమ్మకమేముంది, ప్రక్క గదుల్లో మ్రోగుతుండవచ్చు అనుకున్నాడతను.

సిరోవ్ స్థావరానికి చేరుకోవడానికి చాలా టైంవుంది. అందుకని నిర్మల్‌కుమార్ తిరిగి నడక మొదలుపెట్టాడు.

త్రోవలో పోలీసులు తన నటకాయించకుండా అతను సందులు, గొందులు తిరుగుతూ ముందుకి సాగాడు. చలికి అతని శరీరం కంపిస్తోంది. హోటల్ నుండి బయలుదేరినప్పటి నుండి ఎవరూ అతణ్ని వెంబడించనందుకు అతను తృప్తి పడ్డాడు.

చివరికతను సిరోవ్ ఇంటి సందుమలుపు తిరిగాడు.

అక్కడినుండి సిరోవ్ ఇల్లు కనిపిస్తుంది. ఇల్లంతా చీకటిగావుంది. బయట ముఖంద్వారంవద్ద నున్న చిన్నబల్బ మాత్రం వెలుగుతోంది. ముఖంద్వారం తెరిచివున్నట్లు గమ

నించాడు నిర్మల్ కుమార్.

ఒకసారి సందులో అటు ఇటు పరికించాడు. అంతటా నిర్మానుష్యంగావుంది. పెద్ద పెద్ద అంగలతో అతను ఇంటి వైపుసాగి, ద్వారంలోకి అడుగుపెట్టాడు.

లోపల చీకటిగావుంది.

హాలుకి అటువైపు తలుపు తెరుచుకుని వెనుకకు వెళ్ళ డానికి నిర్మల్ కుమార్ ఆ చీకట్లోనే అటు అడుగులు వేశాడు.

అతను సరిగ్గా హాలు మధ్యలోకి రాగానే కళ్లు మిరుమిట్లు గొలిపే లైట్లు వెలిగాయి. ఆ వెంటనే వెనక తలుపులు మూసుకున్నాయి.

నిర్మల్ కుమార్ ఆ వెలుగు భరించలేక కళ్ళుమూసి క్షణం తర్వాత తెరిచాడు.

కళ్లు తెరిచిన మరుక్షణం నిర్మల్ కుమార్ స్థాణువులా నిలుచుండిపోయాడు.

విశాలమయిన ఆ హాలులో నలువైపులా సీక్రెట్ పోలీసు మనుష్యు లున్నారు. ఏ క్షణంలోనైనా గర్జించడానికి సిద్ధంగావున్నాయి వాళ్ళ చేతుల్లోని మిషిన్‌గన్‌లు.

నిర్మల్ కుమార్ దృష్టి ఎదురుగా ద్వారంవద్ద నిలబడివున్న వ్యక్తిపైపడింది. బక్క పలుచగావున్న, అతని వ్యక్తిత్వం ఇతరులని ప్రభావితం చేస్తుంది. అతనిలోని ధృఢసంకల్పానికి, ఆత్మ విశ్వాసానికి మారుపేరన్నట్లుగా అతని కళ్లు మెరుస్తున్నాయి. అతని చేతిలోని రివాల్వర్ సూటిగా నిర్మల్ కుమార్‌పై గురిపెట్టబడివుంది. అతను కర్నల్ హీడ్స్.

ఒకక్షణంపాటు పరిస్థితిని అవలోకించిన అతను తన రివాల్వర్‌ని హోల్‌స్టర్‌లో పెట్టుకున్నాడు. తరువాత కుటిలంగా నవ్వుతూ అన్నాడు.

"మిస్టర్ నిర్మల్ కుమార్! సీక్రెట్ ఏజెంట్ ఫ్రం ఇండియా! కర్నల్ హీడ్స్ ఆఫ్ హంగేరియన్ సీక్రెట్

పోలీస్ అట్ యువర్ సర్వీస్ సర్."

నిర్మల్ కుమార్ ని తీసుకొని మరో మూడు నిముషాల తర్వాత వాళ్ళందరూ, వాళ్ళను తీసుకెళ్ళడాని కొచ్చిన ట్రక్ లో కూర్చున్నారు.

## 4

ట్రక్ ముందుకి కదిలింది.

మరో అయిదు నిముషాల తర్వాత ట్రక్ మొదటి మలుపు తిరగ్గానే ధడేల్ మని దేనికో గుద్దుకుంది. ఆ వెంటనే బ్రేకులు వేసిన చప్పుడుతో పాటు, ట్రక్ తాగుబోతులా అటు ఇటు తూలి ఒకచోట ఆగింది.

ట్రక్ వెనుక కూర్చున్న కర్నల్, అతని అనుచరులు తూలి నిర్మల్ కుమార్ పై పడ్డారు.

అనుకోని ఈ ఆకస్మిక సంఘటననుండి వాళ్ళు కోలుకోక ముందే 'ధడేల్' మన్న శబ్దంతో వెనుక తలుపు తెరుచుకుంది. వెంటనే రెండు శక్తివంతమయిన టార్చి లైట్ల వెలుగు ప్రసరించింది.

ఆ వెలుగులో రెండు రైఫిల్ బారెల్స్ లోపలకు గురిపెట్టి వుండటం అందరూ గమనించారు.

"ఎవరూ కదలకండి. అందరూ చేతులు పైకెత్తండి" గంభీర కంఠం వినిపించింది.

ఆ ఆజ్ఞని ఉల్లంఘించడానికి ఎవరికి ధైర్యం చాలలేదు. ఆ వెంటనే ఇద్దరు వ్యక్తులు లోపలకు బలవంతంగా తోయబడ్డారు. వాళ్లు ట్రక్ డ్రయివరని, ముందు కూర్చున్న కర్నల్ అనుచరుడనీ గుర్తించాడు నిర్మల్ కుమార్.

గార్డ్స్ వద్ద వున్న ఆయుధాలన్నీ లాక్కున్నారు. కర్నల్ వద్ద వున్న రివాల్వర్ ని తీసుకుని, ఎవరో నిర్మల్ కుమార్

రివాల్వర్ ని అతనివైపు విసిరారు.

నిర్మల్ కుమార్ తన రివాల్వర్ అందుకున్నాడు. తనకి సహాయం చేస్తున్నదెవరో అతనికి తెలిసిపోయింది. డ్రయివింగ్ సీట్ లో ఎవరో కూర్చుని ట్రక్ ని బ్యాక్ చేసి ముందుకి పోనిచ్చారు.

ఇదంతా కొన్ని క్షణాలలో జరిగిపోయింది. చూస్తుండగానే ట్రక్ మళ్ళీ స్పీడందుకుంది.

సుమారు అర్ధగంట అదే వేగంతో ప్రయాణం చేసిన తర్వాత ట్రక్ ఒకచోట ఆగింది. ఈ మధ్య త్రోవలో ట్రక్ రెండు చెక్ పోస్టలవద్ద ఆగింది. అప్పుడు కర్నల్ని తన రివాల్వర్ తో కవర్ చేశాడు నిర్మల్ కుమార్. పోలీస్ ట్రక్ కావడంతో సులభంగానే ముందుకి సాగారు.

ట్రక్ ఆగగానే వెనుక తలుపు తెరచుకోవడంతో పాటు టార్చి వెలుగు ప్రసరించి నిర్మల్ ని బయటకు రమ్మని ఎవరో సైగ చేశారు. నిర్మల్ కుమార్ బయటకు వచ్చాడు.

"ఇప్పుడు మీరంతా మీమీ బూట్లు విప్పి ఎదురుగావున్న బల్లపై పెట్టండి" ఎవరో కర్నల్ నీ, అతని అనుచరులనీ ఆజ్ఞాపించసాగారు. "వ్యతిరేకించి లాభంలేదు. బలవంతంగా కూడా మేమీ పని చేయించగలము. ఊఁ! క్విక్ ..."

కర్నల్ హీడ్స్, అతని అనుచరులు బూట్లు విప్పి ఎదురుగా బెంచిపై ఉంచారు.

"వెల్! ఇప్పుడు మీ ఓవర్ కోట్లు, టోపీలు కూడా తీసి పెట్టండి."

ఆ ఆజ్ఞను కూడా పాటించారు వాళ్ళు.

"థాంక్యూ!" అదే కంఠం తిరిగి వినిపించసాగింది.

"ఇప్పుడీ ట్రక్ 'బుడాపెస్ట్' నుండి పదిహేను మైళ్ళ దూరంలో ఒక నిర్జనమయిన రోడ్ పై వుంది. రోడ్డు ప్రక్కనే చిన్న గుడిసెవుంది. ఈ చుట్టుప్రక్కల అయిదుమైళ్ళ వరకూ

తలదాచుకోవడానికి ఆ గుడిసె తప్ప మరొకటేమీ లేదు. మిమ్మల్ని ఇక్కడ వదిలి మేము వెళ్తాము. మేము వెళ్ళిన తరువాత మీరు మమ్మల్ని బంధించాలని ప్రయత్నించడం కోరి మృత్యువుని ఆహ్వానించడమే అవుతుంది. సబ్ జీరో టెంపరేచర్‌లో వున్న ఈ మంచుపై మీరు కాళ్ళకు బూట్లు, ఓవర్ కోట్లు, హాట్లు లేకుండా పదినిముషాలుకూడా వుండలేరు. అలా కాకుండా గుడిసెలోకి వెళ్ళితే గుడిశ లోపల వెచ్చగా వుంది. విండ్ ప్రూఫ్ అద్దాలున్నాయి. దాంతోపాటు కావలసినంత ఎండుకట్టెలున్నాయి. వాటి సహాయంతో ఉదయం వరకు ఇక్కడ గడిపి, ఉదయం ఇటు ఏదయినా ట్రక్ గాని, మరే వాహనమో వస్తే అందులో 'బుడాపెస్ట్' చేరుకోండి."

కర్నల్ హిడ్స్ తన అనుచరులతో ట్రక్ దిగి ఆ గుడిశలోకి వెళ్ళగానే బయటనుండి తలుపు మూశారు.

ఆ తరువాత నిర్మల్ కుమార్, ముఖాలకు రుమాలు కట్టుకున్న మరో ఇరువురు వ్యక్తులు ట్రక్ వెనుక భాగంలో ఎక్కారు.

ట్రక్ ముందుకు సాగింది.

ట్రక్ వెనుక భాగంలో లైట్ వెలిగింది. అప్పటికి రుమాళ్ళు విప్పేసిన ఆ ఇద్దరిని మేజర్ హేవార్త్, సిరోవ్‌లుగా గుర్తించాడు. ట్రక్ ముందువైపు దృష్టి సారించాడు. ట్రక్‌ని సాండర్ డ్రయివ్ చేస్తున్నాడు. ఇమర్, జూలియాలు అతని ప్రక్కనున్నారు.

"ఏమయింది?" సిరోవ్ సానుభూతిగా అడిగాడు.

నిర్మల్ కుమార్ అంతా వివరించాడు.

"అసలేం జరిగింది? వాళ్లు మీ స్థావరంలోకి ఎలా రాగలిగారు?" నిర్మల్ కుమార్ అడిగాడు.

"చాలా జరిగింది" సిరోవ్ గంభీరంగా అడిగాడు.

"ప్రతి ఒక్కరు పొరపాట్లు చేశారు. మీరు, మేము,

సీక్రెట్ పోలీసులు కూడా పొరపాట్లు చేశారు. మొదటి తప్పు మాది. నా ఇంటిని ఎవరు గమనిస్తున్నారని మాకు తెలుసు. వాళ్లు పోలీసుల డబ్బుకి ఆశపడుతున్న నాగరీకులను కున్నాం కాని సీక్రెట్ పోలీసులనుకోలేదు. సాండర్ వాళ్లని పట్టుకోవడంలో సఫలీకృతుడయ్యాడు. మేజర్ హేవార్త్ వాళ్ళని సీక్రెట్ పోలీసులుగా గుర్తించాడు. అప్పుడే ఆ ఇంటిని ఖాళీ చేయాలని నిర్ణయించుకున్నాము. ఇకపోతే మీరు చాలా పెద్ద పొరపాటు చేశారు.''

''నేనా?'' నిర్మల్ కుమార్ కంగారుగా అన్నాడు.

''అవును.''

''ఎప్పుడు?''

''శ్రీక్రాన్స్ హోటల్లో ప్రొఫెసర్ ఆచార్యతో మాట్లాడుతున్నపుడు.''

''నా కర్థం కాలేదు.''

''ఈ తప్పు కేవలం నిర్మల్ కుమార్ దేకాదు. నాది కూడా!'' మేజర్ హేవార్త్ అన్నాడు. ''నేనతణ్ని ముందే హెచ్చరించి ఉండాల్సింది.''

''మీ రే పొరపాటు విషయం మాట్లాడుతున్నారో అర్థం కావడంలేదు,'' నిర్మల్ కుమార్ ఆతురతగా అన్నాడు.

''చెబుతాను'' సిరోవ్ అన్నాడు. ''మీరు ప్రొఫెసర్ గదిలో మైక్రోఫోన్ వెదికారా?''

''యస్; వెంటిలేటర్ గ్రిల్‌లో వుందది.''

''మరి బాత్ రూంలో?''

''బాత్ రూంలో మైక్రోఫోన్ లేదు.''

''మీరు బాగా వెదికారా?''

''యస్; అలాంటి వాటివల్ల జాగ్రత్త పడటం నా ప్రథమ కర్తవ్యం.''

''అయినా మీరు మోసపోయారు. బాత్ రూంలో మైక్రో

ఫోన్ వుంది.''

"మైగాడ్! ఎక్కడ?'' నిర్మల్ కుమార్ వులికిపడుతూ అన్నాడు.

"మైక్రోఫోన్, బాత్ రూంలోని షవర్ లో వుంది. నిజానికి ఆ హోటల్ లోని ఏ షవర్ కూడా పనిచేయదు. మైక్రోఫోన్స్ దాచడానికే ఆ షవర్స్ అక్కడ ఫిక్స్ చేయబడ్డాయి.''

"ఓహ్ మైగాడ్! షవర్ లో మైక్రోఫోనుందా?'' అని విస్మయంతో స్తబ్ధుడయ్యాడు నిర్మల్ కుమార్.

"యస్'' సిరోవ్ బరువుగా అన్నాడు.

"అంటే... అంటే... నేనూ, ప్రొఫెసర్ ఆచార్య మాట్లాడిన ప్రతి విషయాన్నీ వాళ్ళు వినివుంటారు'' అంటూ అతను హతాశుడై వెనక్కి వాలాడు.

ఇంతటి అపజయం అతనికెన్నడూ లభించలేదు. కర్నల్ హీడ్స్ కు తన విషయం ఎలా తెలిసిందో ఇప్పుడతనికి అర్థమవ సాగింది. ఈ ఆపరేషన్ లో అతనికి అడుగడుగునా అప జయాలే ఎదురవుతున్నాయి.

"అయిపోయింది. ఇక ప్రొఫెసర్ ని విడిపించటం కష్టం'' నిర్మల్ కుమార్ నిరాశతో చెప్పసాగాడు.

"సామ్యవాదులు ఇప్పుడాయన్ను ప్రాణంకంటే మిన్నగా కాపాడుకుంటారు. అదీగాక నేనాయనతో మధుకర్ ని విడిపించే ప్లాను చెప్పాను. వాళ్ళిప్పుడు అదికూడా నెరవేర కుండా చేస్తారేమో! నా ఆపరేషన్ ఫేల్యూర్ అయింది. సామ్యవాదు లీపాటికి ప్రొఫెసర్ ని చైనాకి తరలించే ప్రయత్నం చేస్తున్నారో, లేక చేశారో! కాని, ఇందువల్ల మీ పరిస్థితికి ఎలాంటి నష్టమూ సంభవించదులే. నేను పొర పాటున కూడా మీలో ఏ ఒక్కరి పేరుని ప్రొఫెసర్ కి చెప్పలేదు. కేవలం అడ్రస్ చెప్పాను. దానినిక మీరెలాగూ వదిలేస్తారు కాబట్టి, అందువల్ల మీ దళానికి అంత ప్రమాద

ముండదు. కాని, నాకు రెండు విషయాలు అర్థంకాలేదు."

"ఏమిటవి?"

"మైక్రోఫోన్ ద్వారా హంగరీ పోలీసులు మా మాటలు వినివుంటే వాళ్ళు మమ్మల్నిప్పుడే ఎందుకు బంధించలేదు."

"వెరీ సింపుల్" మేజర్ హేవార్డ్ అన్నాడు. "హోటల్ బాత్‌రూంలో వున్న మైక్రోఫోన్లు టేప్ రికార్డులకి కనెక్ట్ చేయబడ్డాయి. వాళ్ళు రికార్డు అయినదాన్నే తరువాత విన్నట్లున్నారు. మీ సంభాషణ విన్న వాళ్ళపై ఆకాశం విరిగిపడి వుంటుంది."

"మరో విషయం. ఆ స్థావరంపై పోలీసుల దాడి జరుపుతారని మీకు ముందే తెలిసినప్పుడు నన్నెందుకు హెచ్చరించలేదు?"

"మేం ఫోన్ చేశాం. కాని, అటునుండి మీరు రిసీవర్ ఎత్తలేదు."

"నేను ఫైర్ ఎస్కేప్ మెట్లు దిగుతూండగా ఫోన్ రింగ్ యింది. కాని అది నా గదిలోదో, కాదో అన్న సందిగ్ధంలో దానిని ఎత్తలేదు."

"ఇప్పుడు ప్రొఫెసర్ని విడిపించడం ఎలా?" సిరోవ్ అన్నాడు.

"పోలీసులు చాలా కట్టుదిట్టంతో వున్నారు. ఆస్ట్రియా బార్డర్‌పై పోలీసుల సెక్యూరిటీ రెట్టింపు చేయబడింది" హేవార్డ్ అన్నాడు.

నిర్మల్‌కుమార్ ఏమీ మాట్లాడలేదు. మాట్లాడ్డానికి అతని వద్ద ఏమీ లేదు.

అప్పుడే లారీ ఆగింది. "చేరవలసిన చోటికి వచ్చాం" డ్రయివర్ సీట్‌లోంచి సాండర్ అన్నాడు.

"సరే! ఆ విషయాలు తర్వాత ఆలోచించవచ్చు. ముదట విశ్రాంతి అవసరం" అన్నాడు సిరోవ్. అందరూ దిగి పొలాల

మధ్యవున్న ఒక శిధిలాలయంలోకి వెళ్ళారు. సాండర్ ట్రక్ స్టార్ట్ చేశాడు.

# 5

భయంకరమయిన వేగంతో మంచు తుఫాన్ వీస్తోంది.

అంతకు మించిన వేగంతో రైలు పట్టాలను దడదడ లాడిస్తూ పరుగెత్తుతూంది రైలు. ఆ రైలుకి తగిలించివున్న చివరి బోగీలో కందలాది ఖైదీలతోపాటు ప్రొఫెసర్ ఆచార్య కూడా వున్నాడు.

ఆ విషయాన్ని మేజర్ హేవార్త్ కనుక్కొని చెప్పాడు. ప్రొఫెసర్‌ని 'పెక్స్' వరకు ట్రేన్ ద్వారాను, పెక్స్‌నుండి 'పెకింగ్' వరకు విమానం ద్వారాను పంపడానికి ఏర్పాట్లు జరిగాయని తెలిపాడు.

ఆ ఉదయం అనాస్సర్ దొర్లించిన తప్పువల్ల మధుకర్ విడిపించబడ్డాడని తెలుసుకున్నాడు నిర్మల్‌కుమార్.

ట్రేన్‌నుండి బోగీని వేరుచేయడానికి నిశ్చయించుకుని సిరోవ్, నిర్మల్‌కుమార్ ఒక లోకల్ స్టేషన్‌లో రైలెక్కారు. మిగిలిన వాళ్ళు వ్యాన్‌ద్వారా మధ్యదారిలో లెవల్ క్రాసింగ్ వద్ద వాళ్ళను కలుసుకుంటామని చెప్పారు.

నిర్మల్‌కుమార్ తను వున్న పెట్టెలోని కారిడార్‌లో నిలబడి వున్నాడు. తన నిద్దరు సందేహాస్పదంగా చూస్తున్నారని చెప్పాడు సిరోవ్‌తో.

సిరోవ్ వారిని చూసీ చూడనట్లుగా చూచి వాళ్ళు సీక్రెట్ పోలీసులని తెలిపాడు. తను ఏం చేయాలనుకున్నా ముందు వాళ్ళని వదిలించుకోవాలనుకున్నాడు నిర్మల్‌కుమార్.

ఈసారి వాళ్ళు తనవైపు రావడం చూసి, కంగారుపడ్డట్లు నటించి బోగీ తలుపు తెరిచాడు. తలుపులు బయటకు తెరుచుకున్నాయి. ఆ వెంటనే తలుపు చేరవేసి అతను పక్కనే

వున్న టాయిలెట్ లోకి ప్రవేశించి, తన జేబులో వున్న రివాల్వర్ తో టాయిలెట్ కిటికీ అద్దాన్ని బల్లున పగుల కొట్టాడు.

ఆ ఇద్దరు వ్యక్తులు పరుగెత్తుకుంటూ వచ్చి తలుపు నాను కుని కిటికీ తెరిచి, ఏంజరిగిందా అని బయట చీకట్లోకి చూడ సాగారు.

ఆసరికి నిశ్శబ్దంగా తలుపు తెరుచుకుని బయటకు వచ్చిన నిర్మల్ కుమార్ అక్కడనుండీ ఒక్క ఎగురుతో ఎగిరి బలంగా వాళ్ళిద్దరినీ తన్నాడు. తలుపు హుక్ వేసి వుండక పోవడంతో, తలుపు 'ధ డేల్'మని బయటకి తెరుచుకుంది. ఇద్దరిలో ఒకడు బయట చీకట్లో విలీనమయ్యాడు.

చివరి క్షణంలో రెండవ వ్యక్తి చేతికి తలుపు కిటికీ అందింది. దాని సహాయంతో వేళ్ళాడుతూ కంపార్ట్ మెంట్ లోకి ప్రవేశించడానికి ప్రయత్నం చేస్తున్నాడు.

వాళ్ళని తన్నడంతో క్రిందపడిన నిర్మల్ కుమార్ అప్పటికి లేచి నిలబడి జేబులోంచి రివాల్వర్ తీసి, బాగల్ వైపు పట్టు కుని బలంగా రెండవ వ్యక్తి తలపై మోదాడు.

ఆ దెబ్బకు తట్టుకోలేక అతను భయంకరంగా అరుస్తూ చేయి వదిలేశాడు. కాని అతని చప్పుడు రైలుపట్టాల చప్పు డులో కలిసిపోయింది.

నిర్మల్ కుమార్ తలుపుమూసి నిర్లక్ష్యంగా కంపార్ట్ మెంట్ కున్న రెండవ వైపు సాగాడు.

అతను తలుపు తెరవగానే మంచుగాలి విసురుగా లోపలికి వచ్చింది. అతికష్టంగా తనను తాను అపుకుని తలుపు బయట వున్న రేలింగ్ పట్టుకుని బయట ఫుట్ స్టెప్ పై కాలుపెట్టి బయట వేళ్ళాడుతూ తిరిగి తలుపు మూసాడు.

అతనిప్పుడు రేలింగ్ పట్టుకుని బయట వేళ్లాడుతున్నాడు. తుఫాను వేగం తీవ్రంగావుంది. ఎటుచూసినా మంచు తప్ప

మరింకేమీ కనిపించటంలేదు. ఆ వేగానికి తను దూదిపింజలా ఎగిరిపోతానేమో అనుకున్నాడు. అతని ముఖంపైనా, నగ్నంగావున్న చేతులపైనా మంచుపడి, సూదులతో పొడిచి నంత బాధగా వుంటుంది.

చీకటి కారణంగానూ, మంచు కారణంగానూ, అతనికి రెండడుగుల దూరంలో ఏముందో కనిపించటంలేదు. అతను గుడ్డివాడిలా రెండవచేతితో కంపార్ట్‌మెంట్ బయటివైపు తడిమిచూశాడు. అతనికి పట్టుదొరకలేదు.

ఫుట్‌స్టెప్‌పై ధృఢంగా నిలబడి, తన కుడిచేతిని కొండ చిలువలా రేలింగ్‌కి పెనవేసి ఎడమచేతిని జేబులోనికి పోనిచ్చి టార్చితీసి వెలిగించాడు.

ఆ వెలుగుని అతను కంపార్ట్‌మెంట్‌పై ప్రసరింపచేశాడు.

ఎక్కువసేపు ఒక చేతితో వుండడం కష్టమనిపించ సాగింది. అతను టార్చి జేబులో పెట్టుకుని రెండవచేతితో కూడా రేలింగ్‌ని పట్టుకున్నాడు.

ఆ కొద్దిసేపటిలోనే అతను స్థితిని అవలోకించాడు. తనున్న చోటినుండి కంపార్ట్‌మెంట్ వెనుకభాగం ఐదడు గుల దూరముంది. వెనుకవైపు ఒక ఇనుపనిచ్చెనవుంది. దాని ద్వారా కప్పుపైకి చేరుకోవచ్చు. ఈ అయిదడుగులదూరంలో మధ్యన, ఇనుపచువ్వలు బిగించివున్న ఒక బాత్‌రూం కిటికీ వుంది. కాని క్రింద కాలూనడానికి ఏమీలేదు.

నిర్మల్‌కుమార్ ఒక్కక్షణంకూడా ఆలోచించలేదు. ఆలోచించి కాలాన్ని వ్యర్థంచేయటం అతనికిష్టంలేదు.

ఈపనిలో తను సఫలీకృతుడు కాలేకపోతే, రైలుపట్టాల మధ్యపడటం, ఆ తక్షణం, రైలుచక్రాలక్రింద నలిగిపోవడం ఖాయమని అతనికి తెలుసు. ఆ చీకటిలో కేవలం అను మానం ఆధారం ఆ కిటికీవైపు జంప్‌చేయడంకంటే మరో మార్గం కనిపించడంలేదతనికి.

ఫుట్ స్టెప్ చివరివరకు చేరుకుని అతను ఒక్కసారిగా ముందుకి దూకాడు.

ఒక్క క్షణం, కేవలం ఒక్క క్షణం, ఏవిధమయిన పట్టు లేకుండా అతని శరీరం గాల్లో తేలింది. ఆ వెంటనే దబ్బున అతని శరీరం కంపార్ట్ మెంటుకి గుద్దుకుంది. అతని రెండు చేతులు కిటికీవున్న ఇనుపచువ్వలను బలంగా చుట్టుకున్నాయి. కాలి క్రింద ఏవిధమయిని ఆధారమూ లేకుండా అతను ఆ కిటికీని పట్టుకుని వేళ్లాడుతున్నాడు.

ఏ క్షణంలోనయినా చువ్వలపైనుండి తనపట్టు జారిపోతుందేమో అన్నట్లుగా వుందతనికి. ఎక్కువసేపు ఆ స్థితిలో ఉండటం అసంభవమనిపించసాగింది. నిర్మల్ కుమార్ తన శరీరాన్ని అధీనంలోకి తెచ్చుకుని, ఒక కాలుని పక్కకిచాచి, ఆ బోగీని మరో బోగీతో కలుపుతున్న కప్లింగ్ పై మోపాడు. అలాగే మరో కాలునికూడా దానిపైకి మోపి, నెమ్మదిగా దానిమీదకు చేరుకున్నాడు. అక్కడినుండి పైకి ఎగబ్రాకాడు.

అతను కాళ్లు, చేతులతో కప్పుని బలంగా తన్నిపట్టి ముంగాళ్ళపై కూర్చున్నాడు. బాలన్స్ తప్పిపోకుండా కూర్చుని జేబులోంచి టార్చ్ తీసి వెలిగించి వెలుగుని ముందుకి ఫోకస్ చేశాడు.

తనువున్న కంపార్టుమెంట్ కి, ఇంజన్ కి మధ్య ఇంకా రెండు కంపార్టుమెంట్లున్నాయి. ఒకదానికీ, ఇంకొకదానికీ మధ్యనున్న ఖాళీ స్థలాన్ని గుర్తుంచుకుని, టార్చిని ఆర్పి జేబులో పడేసుకున్నాడు.

ఆ వెంటనే అతను ఒక్క ఉదుటన లేచి పిచ్చివాడిలా ఆ తుఫాను వేగాన్ని చీలుస్తూ ముందుకి కప్పుపై పరుగెత్తాడు.

అతను మొదటి కంపార్ట్ మెంట్ దాటాడు. రెండవ

కంపార్టుమెంట్ కూడా దాటాడు. ఆ మరుక్షణం అతను ధమ్మని ఇంజన్ వెనక భాగంలో వున్న బొగ్గులపై పడ్డాడు.

నిర్మల్ కుమార్ శరీరం, వేదనతోనూ, బాధతోనూ జలదరించింది. అయినా ఆ బాధను లెక్కచేయక అతను తల పైకెత్తాడు.

ముగ్గురు వ్యక్తులు ఆశ్చర్యంగా అతనికేసి విస్ఫారిత నేత్రాలతో చూస్తున్నారు.

ముగ్గురిలో ఒకతను డ్రయివర్. రెండవ అతను ఫైర్ మెన్. మూడవ అతను... మూడవఅతను ఆయుధధారి అయిన హాంగేరియన్ గార్డు. ఆ ముగ్గురు స్థాణువుల్లా నిర్మల్ కుమార్ కేసి చూడసాగారు.

నిర్మల్ కుమార్ వెంటనే జేబులోంచి రివాల్వర్ తీసి వారి వైపు గురిపెట్టాడు. కాని అతని చేతుల్లోంచి అది జారి బొగ్గులపై ఎక్కడో పడిపోయింది. చలికి బిగుసుకున్న అతని చేతుల్లో రివాల్వర్ ని గురిపెట్టేంత బలంకూడా లేకుండా పోయింది.

ఆలోగా గార్డ్ తేరుకున్నాడు. అతను వెంటనే తన భుజానికి వేళ్ళాడుతున్న కార్బాయిన్ ని చేతుల్లోకి తీసుకుని నిర్మల్ కుమార్ వైపు గురిపెట్టి ట్రిగ్గర్ నొక్కబోయాడు.

ఈలోగా ఫైర్ మెన్ చేతుల్లోవున్న షవల్ బలంగా గార్డ్ తలపై పడింది. మరుక్షణం స్పృహతప్పిన అతని శరీరం క్రిందికి జారింది.

నిర్మల్ కుమార్ నెమ్మదిగా ఆ బొగ్గులపై నుండి లేచాడు. అతని దుస్తులు చాలా చోట్ల చిరిగిపోయాయి. శరీరమంతటా, ముఖంపైనా, బొగ్గుమసి తగిలి ఒక భూతంలా ఉన్నాడతడు.

ఫైర్ మెన్ అతణ్ని చూసి నవ్వటం మొదలుపెట్టాడు. అతను యువకుడు మహావుంటే ఇరవయి ఏళ్ళుంటాయేమో!

"పూర్ ఫెలో!" ఫైర్ మెన్ క్రిందపడి వున్న సిపాయిని

చూపుతూ అన్నాడు.

"కాని;" నిర్మల్‌కుమార్ ఆశ్చర్యంగా అడిగాడు. "నీవు నన్నెందుకు రక్షించావు?"

"చూడు మిస్టర్!" ఆ యువకుడు సీరియస్‌గా అన్నాడు. "నువ్వెవరయినా కావచ్చు. కాని, ఈ కమ్యూనిస్టు గార్డ్‌కంటే మంచివాడవనే నమ్ముతున్నాను. నా శత్రువేనా సరే! ఈ కమ్యూనిస్టు గార్డ్సనుండి రక్షించాల్సివస్తే రక్షిస్తాను."

నిర్మల్‌కుమార్ ఒకసారి తృప్తిగా నిట్టూర్చాడు.

"నువ్వు రెజిస్టెంస్ మూవ్‌మెంట్ మెంబరువా?" ఫైర్‌మన్ అడిగాడు.

"అవును;" నిర్మల్‌కుమార్ అన్నాడు. "నాకు దాని నాయకునితో సంబంధముంది."

"అంటే జనరల్ సిరోవ్‌తోనా?" ఫైర్‌మన్ ఆశ్చర్యంగా అన్నాడు.

"అవును."

"మేం నీకేమయినా సహాయం చేయగలమా?"

"మీరు తలచుకుంటే చాలా సహాయం చేయగలరు" అంటూ స్థితిని వివరించాడు.

డ్రయివరూ, ఫైర్‌మన్, ఒకరినొకరు ప్రశ్నార్థకంగా చూసుకున్నారు. డ్రయివర్ ఏదో సందేహిస్తున్నాడు.

"నీకు సహాయం చేయడానికి నా కేలాంటి అభ్యంతరము లేదు. కాని, మేము మా ప్రాణాలుకూడా రక్షించుకోవాలి కదా!" చివరకు డ్రయివర్ అన్నాడు.

"అంటే?"

"మే మీ ట్రేన్‌ని ఆపామంటే, తరువాత పోలీసులు మమ్మల్ని ఎందుకాగిందని ప్రశ్నిస్తారుకదా?"

"దానికి నేనో వుపాయం చెబుతాను."

"ఏమిటి?"

"ఎవరో మిమ్మలని రివాల్వర్‌తో బెదిరించి ట్రైన్ ఆపించాడనీ, ఆ తరువాత మీ కాళ్ళు చేతులు కట్టేసి దిగి పోయాడని మీరు చెప్పవచ్చు."

"కరెక్ట్, ఈ వుపాయం బాగుంది."

ఫైర్‌మన్ ఇంజన్‌లో ఒకమూల పడివున్న తాడు తీయ బోయాడు.

"వద్దు; నావద్ద మరో త్రాడువుంది," అంటూ నిర్మల్ కుమార్, ఎందుకయినా మంచిదని, తనవెంట తెచ్చుకున్న త్రాడుని నడుమునుండి విప్పి వారికిచ్చాడు.

"మీరు ఒకరినొకరు బంధించుకోండి. చలికి నావేళ్ళు కొంకర్లుపోయాయి. సరిగ్గా కట్టలేనేమో!" అన్నాడు.

"రైట్;" అంటూ ఫైర్‌మన్ త్రాడందుకుని మొదలు డ్రయివర్ కాళ్లు, చేతులు కట్టేశాడు. తరువాత తనకాళ్ళను తానే కట్టేసుకున్నాడు. చేతులని నిర్మల్‌కుమార్ కట్టాడు. నిర్మల్‌కుమార్ అప్పటివరకూ తన శరీరాన్ని మంటలలో కాచుకున్నాడు.

ఆ తరువాత నిర్మల్‌కుమార్ డ్రయివర్ చెప్పిన లివర్‌ని ఆపరేట్ చేశాడు. దాంతో ట్రైన్ వేగం తగ్గసాగింది. నిర్మల్‌కుమార్ వారిద్దరికి కృతజ్ఞతలు తెలిపి ఇంజన్ ఫుట్ స్టెప్స్‌పై నిలబడ్డాడు.

ట్రైన్ వేగం బాగా తగ్గింది. తాను సురక్షితంగా దూక గలనని నమ్మకం కలుగ్గానే అతను క్రిందికిదూకి వెనక్కి పరుగెత్తాడు. అతను వెనుక కంపార్ట్‌మెంట్ వద్దకు చేరు కునేసరికి ట్రైన్ నత్తలా పాకుతుంది. ట్రైన్ గార్డ్ ప్రక్క నున్న కంపార్ట్‌మెంట్‌లో అతనికి సిరోవ్ కనిపించాడు. అతని చేతిలో రివాల్వర్ వుంది.

ట్రైన్ ఆగగానే నిర్మల్‌కుమార్ చివరి కంపార్ట్‌మెంట్ వద్దకు చేరుకున్నాడు. అతని చేతుల్లోకి టార్చి, ఒక సుత్తి

వచ్చాయి. టార్చి వెలిగించి, అతను కంపార్ట్‌మెంట్లని కలిపే కంప్లింగ్‌ని ఊడదీశాడు. ఆ తరువాత అతను ఎయిర్ బ్రేక్ కప్లింగ్‌పైను సుత్తితో మోదసాగాడు. రెండునిముషాల వ్యవధిలో వెనుక కంపార్ట్‌మెంట్ మిగిలిన ట్రైన్‌నుండి వేరు పడింది.

సిరోవ్ కూడా క్రిందికి దిగాడు. అతని ఒక చేతిలో ఎటు వంటి పరిస్థితినయినా ఎదుర్కొవడానికి సిద్ధంగావున్న రివాల్వరూ, మరో చేతిలో తాళంచెవుల గుత్తివుంది.

నిర్మల్ కుమార్ సిరోవ్‌కి వెనక్కి వెళ్ళమని చెబుతూ తిరిగి ముందుకి పరుగెత్తాడు. అతను ఇంజన్‌లోకి ప్రవేశించి బ్రేక్ లివర్ ఆపరేట్ చేసి, ట్రైన్ స్టార్ట్ చేసి, అది కొంచెం కదలగానే కిందికి దిగాడు. ఆ ముందుభాగమంతా పల్లంలో వుండటంవల్ల ట్రైన్ వేగం పుంజుకుంది. చూస్తుండగానే అది కనుమరుగయింది.

రైల్వేలైనుపై కేవలం చివరి కంపార్ట్‌మెంట్ మాత్రం నిలిచివుంది. నిర్మల్ కుమార్ అటుసాగాడు. అతను అక్కడికి చేరుకునేసరికి సిరోవ్ కంపార్ట్‌మెంట్ తాళం తీసి ప్రొఫెసర్‌ని బయటకు దింపాడు.

దొరికిన ఈ అవకాశాన్ని సద్వినియోగ పరచుకోవడానికి అని, అందులోవున్న మిగిలిన ఖైదీలుకూడా బయటకు గెంతి ఇష్టంవచ్చిన వైపుకి పరుగెత్తసాగారు.

తను విడిపించబడటం చూసి మొదట ప్రొఫెసర్ ముఖంపై ఏవిధమైన భావాలు కలుగలేదు. కాని, నెమ్మదిగా పరిస్థితి అతనికి అవగాహన అయి, నిర్మల్ కుమార్‌ని చూడగానే అతను పసివానిలా ఏడ్చాడు.

ఆ ముగ్గురూ లెవల్ క్రాసింగ్ వైపుకి నడవసాగారు.

వాళ్ళింకా పదడుగులయినా వేయకముందే హర్షోల్లాసంతో కూడిన అరుపులు వినిపించాయి.

"హేయ్! జనరల్ నిర్మల్!" అని అరుస్తూ మేజర్ హేవర్త్ చేతులూపుతూ వీళ్ళవైపు పరుగెత్తుకొస్తున్నాడు. అతని వెనుకే, అతనిలాగే అరుస్తూ సాండర్, ఇమర్, జూలియాలు కూడా వస్తున్నారు.

## 6

ఆ స్థలంనుండి ట్రేన్ వున్న చోటికి చేరుకోవడానికి వారికి రెండుగంటలు పట్టింది. దారిలో ప్రొఫెసర్‌కి, అతని కుమారుడు కూడా విడిపించబడిన విషయాన్ని తెలిపాడు.

ప్రొఫెసర్ ఆనందానికి హద్దులులేకుండాపోయాయి. తన గంభీరాన్ని వదిలి అతను ఆనందంతోనూ, కృతజ్ఞతతోను ప్రతి ఒకరిని కౌగలించుకున్నాడు.

రాత్రంతా ప్రయాణంచేసి రెండవరోజు ఉదయం ఆరుగంటల ప్రాంతంలో సిరోవ్ స్థావరానికి చేరుకున్నారు.

ఈ స్థావరం 'ఆస్ట్రియన్' బార్డర్‌కి పదిమైళ్ళలో వుంది. దట్టంగా మంచుతో కప్పబడిన రోడ్లపై విరామంలేకుండా పద్నాలుగు గంటలు ప్రయాణంచేసిన తర్వాతగాని వారక్కడికి చేరుకోలేకపోయారు. అక్కడక్కడ మంచువర్షంవల్ల దారి మరింత దుర్గమమయింది. ఎప్పుడు, ఏ క్షణంలో దుర్ఘటన జరుగుతుందోననే భయం ఆవరించింది.

ఆ పద్నాలుగు గంటలు, ప్రతిఒక్కరిలోనూ, ఉత్కంఠత, పట్టుబడతామేమోననే భయం, చలి, ఆకలి నిద్రలేమి వల్ల బాధపడ్డారు.

ఆ రాత్రంతా స్టీరింగ్ వీల్ ముందు ఒకేఒక వ్యక్తికూర్చున్నాడు. అతను మేజర్ హేవార్త్! ఆ పద్నాలుగు గంటల్లో ప్రయాణంచేసిన మూడువందలమైళ్ళ దూరాన్ని ఒక్క మేజర్ హేవార్త్ డ్రయివ్ చేశాడు.

రాత్రి ఎన్నోమార్లు మేజర్‌ని తప్పుకోమని, తనుడ్రయివ్ చేయాలనుకున్నాడు నిర్మల్‌కుమార్, కాని వెంటనే ఆ

ఆలోచన మానేసేవాడు. మంచుతోనిండి, హేర్‌పిన్ టర్నింగ్స్‌తోవున్న స్థానంలో తాను మేజర్‌లా డ్రయివ్ చేయలేనని అతనికే తెలుసు.

సావరానికి చేరుకోగానే అందరూ సుష్టుగా భోంచేసి ఫైర్‌ప్లేస్ చుట్టూ కూర్చుని "బారాక్" సిప్ చేస్తున్నారు.

"ప్రొఫెసర్ మీరు మీ దేశం చేరగానే మాకోసహాయం చేస్తారా?" సిరోవ్ అడిగాడు.

"ఏమిటి?"

"సెంట్రల్ యూరోప్‌లోని ప్రతివ్యక్తి ఎంతటి దుఃఖ పూరితమయినజీవితాన్నిగడుపుతున్నాడో మీవాళ్ళకి తెలియ చేయండి. మావి బానిస బ్రతుకులని మొత్తం ప్రపంచానికి తెలియచేయండి. రెండువందల ఏళ్ళపాటు బానిసత్వాన్ని అనుభవించిన మీకు, మీ దేశవాసులకు బానిసత్వమంటే ఏమిటో తెలిసివుంటుంది. ప్రతివ్యక్తి తమ బ్రతుకులు ఎలా వున్నా తమ పిల్లలు, ఆ పిల్లల పిల్లలు ఈ బానిసత్వంనుండి విముక్తి పొంది స్వేచ్ఛావాయువులు పీల్చాలని ఆశిస్తున్నా డని చెప్పండి. సామ్యవాదమంటూ రష్యనులు మాపైజరుపు తున్న అత్యాచారాన్ని కూడా మీరు చూశారు. మీరు చూసిందేమిటో ప్రపంచానికి తెలియచేయండి."

సిరోవ్ ఆగాడు. ఉద్వేగంతో అతనిముఖం వెలిగి పోతుండటం గమనించాడు నిర్మల్‌కుమార్.

"యూ ఆర్ కరెక్ట్;" ప్రొఫెసర్ అన్నాడు.

అక్కడున్న వాళ్ళందరి ముఖాల్లోను విషాదచ్ఛాయలు క్రమ్ముకున్నాయి. అందరూ బరువుగా నిట్టూర్చారు.

## 7

పైన కిటికీవద్ద కూర్చుని కాపలాకాస్తున్న ఇమర్ పరుగున వచ్చాడు.

"ఏమయింది?" మేజర్ హేవార్త్ కంగారుగా అడిగాడు.
"మన ఈ స్థావరం విషయం ఎలాగో పోలీసులకి తెలిసింది. మూడు మిలిటరీ ట్రక్కులు ఇటువైపు వస్తున్నాయి," ఇమర్ వగరుస్తూ అన్నాడు.
అందరూ వులికిపడి లేచి నిలబడ్డారు.
"నీవు చూశావా వాళ్ళని?" సిరోవ్ అడిగాడు.
"యస్" ఇమర్ గబగబా అన్నాడు. "నేను పైన కిటికీవద్ద కూర్చుని బైనాక్యులర్స్‌తో చుట్టూ పరికిస్తున్నాను. అనుకోకుండానే వాళ్ళు నాకంటబడ్డారు."
"వాళ్ళింకా ఎంతదూరంలో వున్నారు?"
"ఇంకా అరమైలు దూరంలో వుండవచ్చు."
"పరుగెత్తండి" మేజర్ హేవార్త్ వెంటనే అన్నాడు. "అందరూ వెళ్ళి ట్రక్‌లో కూర్చోండి. సాండర్ నువ్వు డ్రయివింగ్ సీటులో కూర్చో. ఇంజన్ స్టార్ట్ చేసివుంచు."
అందరూ బయటకు పరుగెత్తారు.
మేజర్ హేవార్త్ లోపలకు వెళ్ళాడు.
అందరిలాగే నిర్మల్‌కుమార్ కూడా బయటకు పరుగెత్తాడు. కాని అంతలోనే ఏదో ఆలోచించి ఆగిపోయాడు. అతను ఇమర్ చేతిలోంచి బైనాక్యులర్స్ అందుకుని పైకిపరుగెత్తాడు.
పూర్తిగా పైకి టెర్రెస్ పైకి చేరుకుని బైనాక్యులర్స్‌తో చుట్టూ పరికించాడు..
దూరంగా మంచులో అతనికి ఒక పచ్చరంగు ట్రక్ అగుపించింది. ఆ వెనుక ఒక తెల్లరంగు ట్రక్ వుంది. అందులో సైనికులు నిండివున్నారు. ప్రతి ఒక్కరి చేతిలోనూ, కార్బాయిన్‌గాని ఆటోమెటిక్ రైఫిల్స్‌గాని వున్నాయి. ఆ వెనుక వస్తున్న వాహనాన్ని చూసి నిర్మల్‌కుమార్ నోరు తెరిచాడు.

అది మిలిటరీ టాంక్.

నిర్మల్‌కుమార్ క్రిందకు పరుగెత్తాడు. క్రింద అతనికి హేవార్డ్ అగుపించాడు. అతని ఒకచేతిలో మిషిన్‌గన్, మరో చేతిలో ఒక బ్యాగ్ వుంది.

"వాళ్ళు టాంక్‌తో వస్తున్నారు" నిర్మల్‌కుమార్ అన్నాడు.

"వాట్?!" మేజర్ వులికిపడ్డాడు.

"యస్."

"ఆ గదిలో మిషిన్‌గన్, బుల్లెట్ బెల్ట్స్ వున్నాయి తీసుకురండి." ఒకవైపు చూపుతూ అన్నాడు మేజర్.

నిర్మల్ ఒక్క అంగలో అవి తీసుకువచ్చాడు.

ఇద్దరూ పరుగెడుతూ బయటకువచ్చి ట్రక్‌లో కూర్చున్నారు. "సాండర్; ట్రక్ స్టార్టుచేయి" మేజర్ అన్నాడు.

"ఇది స్టార్ట్ అవడంలేదు," సాండర్ నిస్పృహతో అన్నాడు.

మేజర్ డ్రయివింగ్ సీటువైపు వెళ్ళాడు. "బయటకు రా!" సాండర్‌ని చూసి అన్నాడు.

సాండర్ బయటకురాగానే అతను డ్రయివింగ్ సీటులో కూర్చున్నాడు. ఎంత ప్రయత్నించినా ట్రక్ స్టార్ట్ అవడం లేదు.

అందరూ ఆతురతతో అతణ్ని చూస్తున్నారు.

"ఊఁహుఁ!" చివరకతనుకూడా నిరాశతో అన్నాడు.

"ప్రాణంకోసం పరుగెత్తండి," అంటూ బయటకు దూకాడు. అతణ్ని మిగిలినవారందరూ అనుసరించారు.

"బ్రిడ్జివైపుకు పరుగెత్తండి," తాను ముందు అటు పరుగెత్తుతూనే అన్నాడు మేజర్.

పోలీసుదళం ఇంకా వారి కంటబడటంలేదు.

అందరూ వంతెనను దాటారు.

అప్పుడే పోలీసుల ట్రక్కులు ఆ స్థావరం ప్రక్కనున్న రోడ్డుపై కనుపించాయి.

"మీరందరూ నేరుగా ఈ రోడ్డువెంట బార్డర్ వైపు వెళ్ళండి," మేజర్ అన్నాడు.

"మరి మీ విషయం," నిర్మల్ కుమార్ అడిగాడు.

"ఆర్గ్యుమెంట్స్ వద్దు" మేజర్ గంభీరంగా అన్నాడు.

"నేను చెప్పినట్లు వినండి. సిరోవ్ కి దారి తెలుసు. ఊఁ! తర్కానికి ఇది సమయం కాదు."

"కాని, మీరిక్కడ ఏం చేస్తారు?"

"శత్రువులు; మీ వెనుక రాకుండా వాళ్ళని ఎదిరిస్తాను."

"ఈపని మీరొక్కరే చేయలేరు. నేనూ ఇక్కడ ఉంటాను," నిర్మల్ కుమార్ ధృఢంగా అన్నాడు.

"మూర్ఖంగా ప్రవర్తించక; నేను ఒక్కణ్ణే వాళ్ళని ఆపగలను. ఈ బేగ్ లో కావలసినంత మందుగుండు సామగ్రి ఉంది. బాంబులతో ఈ వంతెనను కూల్చేస్తాను."

"నెవర్; ఈపని మీరొక్కరే చేయలేరు."

"అంటే ఇద్దరు చేయగలరంటూరా?"

"యస్;"

"ఆల్ రైట్;" మేజర్ హోవార్త్ అన్నాడు. "ఆ మిషిన్ గన్ ఇమర్ కి ఇవ్వండి. అతను నాతో వుంటాడు."

ఇమర్ ముఖంలో సంతోషచ్ఛాయ లుద్భవించాయి.

"కాని..."

"షటప్! డూ ఆజ్ ఐ సే" అరిచాడు మేజర్.

నిర్మల్ కుమార్ తన చేతిలోని మిషిన్ గన్ ని ఇమర్ కి అందించాడు. ఇమర్ దాన్నందుకుని ధృఢంగా మేజర్ ప్రక్కగా నిలబడ్డాడు.

"ఊ వెళ్ళండి."

మనస్సు ఒప్పుకోకున్నా అందరూ ముందుకిసాగిపోయారు.

నిర్మల్ కుమార్ ఇంకా సందేహిస్తూ అక్కడే నిలబడ్డాడు.

"మిస్టర్! వెళ్ళండి" మేజర్ అన్నాడు.

"నన్ను అయిదు నిముషాలు ఇక్కడ ఉండనివ్వండి. తరువాత పరుగెత్తి వాళ్ళని చేరుకుంటాను" నిర్మల్ కుమార్ అభ్యర్థిస్తున్నట్లుగా అన్నాడు.

"అయిదు నిముషాల్లో మీరేం చేయగలరు?"

"మీరు వంతెనను కూల్చడానికి బాంబులు బిగించేలోపల నేను వారిని ఎదిరించగలను."

మేజర్ ఇంకేమీ మాట్లాడలేదు. అతను తన మెషిన్ గన్ని నిర్మల్ కుమార్ కి అందించి ఇమర్ కి సైగ చేశాడు. ఇమర్ తన గన్ని నిర్మల్ కుమార్ కాళ్ళవద్ద పెట్టి మేజర్ వెంట సాగాడు.

నిర్మల్ కుమార్ బైనాక్యులర్స్ కళ్ళముందుంచుకుని తాము వదిలివచ్చిన బిల్డింగ్ వైపు చూశాడు.

కర్నల్ హీడ్స్ ట్రక్ లోంచి బయటకు దూకాడు. అతనొకసారి ఇంటిముందున్న ట్రక్ కేసి చూసి టాంక్ వద్దకు వెళ్ళి ఏదో ఆదేశించాడు.

తెల్ల ట్రక్ లోంచి సైనికులు బయటకు దూకుతున్నారు. టాంక్ ఇంకా ముందుకివచ్చి బిల్డింగ్ ఎదురుగా ఆగింది. టాంకుకున్న ఫిరంగిని భవనంవైపు తిప్పారు సైనికులు. ఆ తరువాత ఒకటి తర్వాత ఒకటిగా ఫిరంగి గుళ్ళు భవనంపై వర్షించసాగాయి. చూస్తుండగానే భవనం నేలమట్టమయింది.

కొందరు సైనికులతో కలిసి కర్నల్ హీడ్స్ నేలమట్టమయిన భవనంవైపు నడిచాడు.

ఇక్కడ మేజర్ హేవార్త్, ఇమర్ లు వంతెన క్రింద మందుగుండు పరుస్తున్నారు.

నిర్మల్ కుమార్ తిరిగి భవనంవైపుకి చూడసాగాడు. రెండు నిముషాల తర్వాత కర్నల్ హీడ్స్ భవనం ప్రక్కనుండి

తప్పుకున్నాడు. అప్పుడే ఒక సైనికుడు వంతెన వైపుండే రోడ్డుపై మంచులోవున్న అడుగులవైపు కర్నల్ దృష్టిని మళ్ళించాడు.

వీళ్ళు తప్పుకున్నారని కర్నల్ హీడ్స్ అర్థంచేసుకున్నాడు. అతను గబగబా తన మనుష్యులకు ఆదేశాలివ్వసాగాడు.

బైనాక్యులర్స్‌లో చూస్తున్న నిర్మల్‌కుమార్‌కి అతని నోరు, చేతులు కదలడం కనిపిస్తున్నాయి.

అందరూ వెంటనే ట్రక్కులవైపు చేరుకున్నారు. తిరిగి ఆ ట్రక్‌లు వంతెనవైపు సాగాయి. ఆ వంతెన ముప్ఫయి అడుగుల వెడల్పుతో ఒక కాలువపై నిర్మింపబడి వుంది.

ఇమర్, మేజర్‌లు వంతెనవద్ద నుండి తప్పుకున్నారు. మేజర్ ఒక తీగను నేలపై పరుస్తూ వచ్చాడు. అతను తీగెను నిర్మల్‌కుమార్ ప్రక్కగా పోనిచ్చి, వెనుకనున్న చెట్ల గుంపులోకి వెళ్ళి అక్కడవున్న హాండిల్‌కి కనెక్షన్ ఇచ్చాడు. ఆ వెంటనే ఇమర్ హాండిల్‌వద్ద కూర్చున్నాడు.

మేజర్ హోవార్డ్ ముందుకివచ్చి నిర్మల్ చేతుల్లోంచి రెండు మిషీన్‌గన్లను బలవంతంగా లాక్కున్నాడు.

"ఫర్ గాడ్ సేక్, మీరిక వెంటనేవెళ్ళి వాళ్ళని కలుసుకోండి" మేజర్ అన్నాడు.

"మీరు నన్నిక్కడ ఎందుకు ఉండనీయరు?"

"ఇక్కడ రెండే ఆయుధాలున్నాయి. మూడవమనిషి చేసేదేముంది?"

"ఇమర్‌ని వెళ్ళనీయండి. అతను పసివాడు. జీవితాన్ని అనుభవించాల్సినవాడు."

"నో, అలా వీల్లేదు" మేజర్ దృఢంగా అన్నాడు.

"ఎందుకు?"

"మీరు నాకు అతిథులు. అంతేకాదు ఇమర్ నా కుమా

రుడు" మేజర్ మెల్లగా అన్నాడు.

"వాట్?"

అప్పటికే టాంక్ వంతెన మీదకి చేరుకుంది. ఇమర్ హాండిల్ తిప్పాడు. భయంకరమయిన విస్ఫోటంతో వంతెన గాల్లోకి తేలిపోయింది. టాంక్ బరువుగా క్రింద వాగులోకి పడిపోయింది.

"నిర్మల్ కుమార్; ప్లీజ్! పరుగెత్తండి" మేజర్ అన్నాడు.

నిర్మల్ కుమార్ స్తబ్దుడయి నిలుచుండిపోయాడు.

ఇద్దరు సైనికులు వాగులోకి దిగి టాంక్ పైకి ఎక్కారు. ఈసారి ఇమర్ చేతులోని మిషిన్ గన్ నిప్పులు కక్కింది. ఆ ఇరువురూ అరుస్తూ వాగులో పడ్డారు.

అప్పుడే ఒక హాండ్ గ్రెనేడ్ విసురుగా వచ్చి ఇమర్ కి కొద్ది దూరంలో పడి పేలింది. దాంతోపాటే మంచు గడ్డలు పైకిలేచి నలువైపులా చిమ్మాయి.

"మిస్టర్ నిర్మల్ కుమార్!" మేజర్ హేవార్త్ అన్నాడు. "మీరిక్కడ వుంటే మాకేమీ తోచదు. మేం దృఢంగా శత్రువులను ఎదిరించలేము. అంతేకాదు, మీరు లేకుండా వృద్ధుడయిన ప్రొఫెసర్ బార్డర్ క్రాస్ చేయలేడు. ఆ వృద్ధునిపైనైనా దయతలచి వెళ్ళండి."

ఉండివుండి ఇమర్ చేతిలోని మిషిన్ గన్ "రెట్, రెట్, రెట్" అని శబ్దంచేస్తూ నిప్పులు కురిపిస్తోంది.

అటునుండికూడా వరుసగా హాండ్ గ్రెనేడ్స్ విసరబడుతున్నాయి. కర్నల్ కింకా వాళ్ళున్న సరయిన పొజిషన్ తెలియనట్లుంది.

మేజర్ హేవార్త్ అర్థిస్తున్నట్లుగా నిర్మల్ కుమార్ వైపు చూశాడు.

తనకిదేమీ పట్టనట్లు ఇమర్ శత్రువులని నాశనం చేయడంలో నిమగ్నుడయి వున్నాడు.

నిర్మల్ కుమార్ తనచేయి మేజర్ వైపు చాపాడు.

మేజర్ అతనితో చేయికలుపుతూ "గుడ్ లక్ మై బాయ్!" అన్నాడు.

చివరిసారిగా ఇమర్ వైపు దృష్టి సారించి, ఉదాసీనమయిన మనస్సుతో భారంగా బార్డర్ వైపు పరుగెత్తాడు నిర్మల్ కుమార్.

—: అయిపోయింది :—

# జడ్ - 6

## సుజనశ్రీ

నిరంజనరావు తన ఆఫీసురూమ్‌లో కూర్చుని స్టెనోకి ఏవేవో బిజినెస్ లెటర్స్‌కి రిప్లైలు డిక్టేట్ చేస్తున్నాడు. మధ్య మధ్యలో పైప్ నోట్లో పెట్టుకుని గట్టిగా ఒక దమ్ములాగి మళ్ళీ పక్కన పెట్టేసి డిక్టేట్ చేస్తున్నాడు.

నిరంజనరావు వయసు అరవై సంవత్సరా లుంటయ్. అతడు "నిరంజన్ కెమికల్స్" అనే కంపెనీకి ప్రొప్రయిటరు.

స్వాతంత్ర్యం రాకముందే అతడు ఈ కంపెనీని పెట్టి ఉన్నాడు. స్వతహాగా అతడికి ఆస్తి ఏమీ లేదు మొదట్లో. ఆస్తికోసం కొంచెం అనాకారి అయిన భాగ్యవంతుల అమ్మాయిని పెళ్ళిచేసుకున్నాడు. తనకిచ్చిన కట్నం డబ్బుతో ఈ కెమికల్ కంపెనీని మొదలెట్టాడు, మరో కెమిస్ట్‌ని పార్ట్

నర్ గా కలుపుకుని.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత దేశం పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధి పొందటం, ప్రతి రసాయనిక ఫ్యాక్టరీకి, ఇతర అనేక రకాల మందుల ఉత్పత్తిలోనూ నిరంజనరావు తయారుచేయిస్తూన్న కెమికల్స్ అవసరం అవటంవల్ల అతి త్వరలోనే ఆ కంపెనీ పెరిగిపెరిగి పెద్దదయిపోయింది.

నిరంజనరావు చూస్తుండగానే లక్షాధికారి అయిపోయాడు.

స్టెనో డిక్టేషన్ పూర్తిచేసుకుని వెళ్ళిపోయింది.

టేబుల్ మీద మరో గంటలో గవర్నమెంటుకి చేరవలసిన టెండరుమీద సంతకం పెడుతూండగా ఫోను మ్రోగింది. రిసీవర్ ఎత్తి చెవిదగ్గర పెట్టుకుని "హలో! నిరంజనరావు స్పీకింగ్" అన్నాడు.

"ఒరే! నిరంజనా? నువ్వేనా మాట్లాడేది! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు కలుసుకున్నాం? నేను రామ్మూర్తిని మాట్లాడుతున్నాను."

"హలో! ఎప్పుడురా రావటం! ఎక్కడుంటున్నావు? ఏంచేస్తున్నావ్! అయినా ఇదేమిటోయ్ ఫోన్‌లో పరామర్శ వెంటనే మా ఆఫీసుకురా! ఇద్దరం ఇంటికి వెళ్దాం."

"ఓ! అలాగే. నిన్ను చూసిగూడ చాలా రోజులయింది. నువ్వు ఉంటావో ఉండవో ఫోన్ చేసి కనుక్కుందాం అని చేశాన్లే. మీ ఆవిడ ఆరోగ్యం ఎలా ఉంటోంది?"

"అరే ఫూల్! ఇంకా ఫోన్‌లోనే ఉన్నావ్. ఫోన్ పెట్టేసెయ్. త్వరగా వచ్చెయ్! నీకోసమే వెయిట్ చేస్తుంటాను" అంటూ రిసీవర్ క్రేడిల్ మీద పెట్టేశాడు నిరంజనరావు.

## 2

రామ్మూర్తి, నిరంజనరావు బాల్యస్నేహితులు.

రామ్మూర్తి ప్రభుత్వగిరీ వెలగబెట్టి ఇటీవలే రిటైరయి పోయాడు. అతడికి నాటకాల పిచ్చి జాస్తి. కాలేజీలో చదివే రోజుల్లోనే స్టేజీయాక్టర్‌గా పేరు పొందాడు. దుర్యోధనుడి పాత్ర దగ్గరనుంచి ఎన్. జి. ఓ. వేషం వరకూ వేసి నటించ గలడు.

నిరంజనరావు, రామ్మూర్తిని ఆప్యాయంగా పరామర్శిం చాడు. కుటుంబ వ్యవహారాల గురించి తెలుసుకున్న తర్వాత డ్రింక్ ఆఫర్ చేశాడు.

"హాట్ డ్రింకా? లేక కూల్ డ్రింకేనా?" అని అడిగాడు నిరంజనరావు నవ్వుతూ.

"మాబోటి పేదలకు కాఫీ తాగే స్తోమతు ఉండదు. ఇంకా హాట్ డ్రింక్స్ బ్రాందీ, విస్కీ ఎలా తాగగలం?"

"చాల్లేరా నీ బీద అరుపులు. గవర్నమెంటు సర్వీసులో బల్లక్రిందనుంచి ఏమాత్రం లాగావో నాకు తెలీదనుకోకు!"

"నీవు ఒక నెలలో సంపాదించినంత లాభంలో అది ఎన్నో వంతంటావు? ఎలాగైనా అదృష్టమంటే నీదే. అన్నట్టు నీ పుత్రరత్నం ఏడీ? వాడ్నిగూడ బిజినెస్‌లోకి దించలేక పోయావా?"

నిరంజనరావు సైగచేసేసరికి రెండు కప్పుల్లో బోర్న్‌విటా వచ్చింది.

"ప్రస్తుతం నా విచారమంతా వాడ్ని గురించేనయ్యా?" అతని ముఖంలో మెదిలిన విచార రేఖలకు రామ్మూర్తిగూడ జాలిపడ్డాడు.

"అసలు మీ కుర్రాడికి ఇంటరెస్ట్ లేదా నీ బిజినెస్‌లో?"

"అదేమో తెలీదు. చూట్టానికి మనిషి బాగానే ఉంటాడు. వ్యాపారం చూసుకోరా అంటే నాకు చిరాకు అంటాడు. వాడు స్వతహాగా కొంచెం నెమ్మదస్తుడు."

"పండిత పుత్రుడన్నమాట. నీ వ్యాపార దక్షత వాడి

కబ్బలేదంటావ్?"

"పుట్టడంతోనే ఎవరూ తెలివిగా ఉండకపోవచ్చు. పోనీ నిదానంగా వ్యాపారంలోని కిటుకులు నేర్చుకుందువుగాని రారా అంటే ససేమిరా వినడు. వాడ్ని వెనకేసుకు వస్తుంది వాళ్ళమ్మ. ఆమె కళ్ళకు వీడు ఇంకా పిల్లవాడిలాగే కనబడ తాడు."

"అది సహజమేలే. ఇంతకీ మీవాడు ఏం చదివాడు?"

"బి. కాం. ప్యాసయాడు. ఆపైన చదవనని మొండి కేశాడు."

"అతగాడి హాబీలు ఏమిటి?"

"ఏముంది? నెంబర్ వన్. సినిమాలు చూడడం. ప్రతి సినిమాకు రిలీజ్ అయినరోజే వెళ్ళటం."

"అది పెద్ద నేరం కాదు. ఈ రోజుల్లో మూలనున్న ముస లమ్మలు గూడా సినిమా పేరు చెబితే పరుగెత్తుతున్నారు, ఎండనకా, వాననకా."

"రెండోది డిటెక్టివ్ పుస్తకాలు చదవటం. మార్కెట్ లోకి వచ్చిన పుస్తకం ముందు వీడిచేతిలో పడాల్సిందే. కొన్నికొన్ని పుస్తకాలు ప్రింటర్స్ దగ్గర్నుంచే తెప్పించు కుంటాడు గూడా మార్కెట్ లోకి రిలీజ్ కాకముందే."

"ఓస్! ఇంతేనా? అవి చదవని వాళ్ళెవరు యీ రోజుల్లో. వాటిలో ఉండే 'థ్రిల్' నీకేం తెలుస్తుందిలే! ఆఁ ఇంకా చెప్పు'" అన్నాడు రామ్మూర్తి భావగర్భితంగా నవ్వుతూ.

"ఏముంది? అమ్మాయిలతో షికార్లు! వసంతవిహార్ హోటల్లో ఒకరూమ్ నెలసరి బాడుగకు తీసుకున్నాడు. వాడి మకాం ఎక్కువసేపు అక్కడే."

రామ్మూర్తి కొన్ని క్షణాలు ఆలోచనలలో పడిపోయాడు.

"నా ఉద్దేశ్యంలో మీవాడు దారికి రావాలంటే ఒకేఒక ఉపాయంవుంది. అయితే అందుకు కొంత ఖర్చవుతుందిమరి?"

"నా దగ్గరకూడా బల్లక్రింద చేయిచాపే ఉద్దేశ్యం పోగొట్టుకున్నావు కాదు. యూ సిల్లీ రోగ్!" అని నవ్వాడు నిరంజనరావు.

"ఛాఛా! అదేం కాదు. నీ మేలు కోరేవాడ్ని గనుక చెబుతున్నాను. అంతే!"

"సీరియస్‌గా తీసుకోకు నే నన్నది. జోక్‌గా అన్నానులే. అయితే మా వాడ్ని దారికి తీసుకువస్తానంటావ్?"

"తప్పకుండా. ఓ రెండువేలు మాత్రం ఖర్చవుతుంది! ఒకవారం పదిరోజుల్లో మీవాడు ఆఫీసు వెతుక్కుంటూ వచ్చి నీ కుర్చీలో కూర్చోకపోతే నా పేరు రామ్మూర్తి కాదు."

"అంతమాట ఎందుకులేరా! చిన్నప్పుడుగూడా నాకు మంచి విలువైన సలహాలు ఇచ్చేవాడివిగదా! ఇదుగో రెండు వేలు తీసుకో! మావాడి భారం నీమీద పెడుతున్నాను. ఇక ఇంటికిపోదాంపద! మాంచి విందు మనకోసం ఎదురుచూస్తుంటుంది" అంటూ లేచాడు నిరంజనరావు.

# 3

"జెండాపై కపిరాజు" అంటూ గొంతెత్తి పద్యం అందుకున్నాడు కాళిదాసు.

"అదీ వరస. నా సామిరంగా!" అంటూ హార్మోని తొక్కుతున్నాడు చలమయ్య తల ఊగిస్తూ.

"జెండాపై కాదురా. మన కడుపులో కపిరాజు ఎగురుతున్నాడు. తెల్లవారి తొమ్మిదయింది. ఇంతవరకు నోట్లో కాసిని కాఫీనీళ్లు జారలేదు. మీలో ఎవడి దగ్గరా కాఫీ డబ్బులుగూడా లేవట్రా?"

అరిచాడు ఒకమూల మూడుకాళ్ళ కుర్చీలో ఒరిగిపోయిన చంద్రరావు.

"ఒరే సన్నాసి, జేబులో కాఫీడబ్బులే వుంటే ఇక్కడ

ఇంత సేపు ఇలా రాగాలు తీస్తూ వుంటాముట్రా?" రాగ యుక్తంగా సమాధానం చెప్పాడు కాళిదాసు.

"మరయితే ఆ రాగాలు కాసేపు ఆపి ఏడవకూడదూ?"

"రాగం విని అయినా ఎవరన్నా మెచ్చుకుని గొంతు తడుపుతారని పాడుతున్నాం. అయినా మన నాటక సంఘంలో హీరోయిన్ సావిత్రిని ఎదురుగా వుంచుకుని మమ్మల్ని దేబిరిస్తావేంరా?" అన్నాడు చంద్రారావు.

"సరేలే! ఇంతమంది మగమహారాజుల దగ్గరలేంది నా దగ్గరమాత్రం ఎలా వుంటయ్. నా టెరిలిన్ చీరలు డ్రై వాషింగ్ కివేశాను... తెచ్చుకోవటానికి డబ్బులేక ఉదయం నుంచి ఇక్కడ పడిగాపులు గాస్తున్నాను" సావిత్రి సమాధానం.

"కటకటా! నేటి కలికాలపు సావిత్రి కన్ని కష్టములు వాటిల్లెన్! అలనాడు యముడ్ని జయించిన సావిత్రిగూడ ఈనాటి కష్టాల్ని చూసి ఝడుసుకు పారిపోవలసినదే!" చమత్కరించాడు కాళిదాసు.

"ఒరేయ్! రాముడూ! ఆ నాయర్ టీ స్టాల్లోనన్నా టీ అనబడే ఆ కాషాయాన్ని పట్టుకురారా!" అన్నాడు చంద్రారావు.

"అబ్బే! అదీ ట్రైచేసి చూశాం. పాత బాకీ అంతా కట్టేసేగాని అరువు ఇవ్వనన్నాడుసార్!" కర్టెన్ బోయ్ సమాధాన మిచ్చాడు.

"పోనీ సిగరెట్లకొట్టువాడన్నా అరువు ఇస్తున్నాడా?"

"వాడిదగ్గర మన పరువు ఇంకా పోలేదుసార్!"

"అలా అయితే అక్కడికివెళ్ళి రెండుగోల్డ్ ఫ్లేక్ సిగరెట్ ప్యాకెట్లు తీసుకో. మలుపులో బడ్డీకొట్లో ఒక పావలాతగ్గించి అమ్మి ఆ డబ్బుతో కాఫీలు పట్రా! ఇంకా ఏమీ సమాధానం చెప్పమాకు. పో ముందు!" అన్నాడు చంద్రారావు.

"ఒరేయ్! మార్విలస్ రా నీ బుర్ర! ఇప్పుడే నీ తల తెగ నరికి మ్యూజియంకి అమ్మేయాల్సిందే!"

"అపరా నీ బోడి కాంప్లిమెంట్! ఇక్కడ ఎందరం వున్నాం? ఆఁ అయిదు కాఫీలు ఒక బోర్నవిటా పట్రా!"

"నాకు కిల్లీ కూడా పట్టుకురా రాముడూ!"

కడ్రెన్ బోయ్ రాముడు పరుగెత్తు కెళ్ళిపోయాడు. అందరూ పరీక్షా ఫలితాలకోసం ఎదురుచూచే విద్యార్థుల్లా ఆత్రుతగా ఎదురుచూశారు.

పావుగంట గడిచాకా రాముడు కాఫీలు పుచ్చుకుని ప్రత్యక్షమయ్యాడు. వాడిచుట్టూ మూగి తలా ఒక కాఫీ గ్లాసు అందుకుని వేడివేడి కాఫీని గటగట త్రాగేశారు.

"అమ్మయ్య! ఇప్పటికి ప్రాణం తేరుకుంది" అన్నాడు కాళిదాసు.

"రాముడూ! కిల్లీ పట్రాలేదురా?" అంది సావిత్రి.

"ఇదుగోనమ్మా!" అంటూ కిల్లీ తీసి సావిత్రికి అందించాడు రాముడు.

వాకిట్లో రిక్షా ఆగిన అలికిడివిని అందరూ అటు చూశారు. రిక్షాలోంచి ఒక లావుపాటి వ్యక్తి దిగాడు. నీరుకావి పంచె, తెల్లటి చొక్కామీద పాతకాలంనాటి కోటు, నడుముకు బెల్టు, చత్వారం కళ్ళజోడు, చంకలో గొడుగుతో దిగుతున్న ఈ వ్యక్తి ఎవరా అని కాళిదాసు ఎగాదిగా చూశాడు.

"చంద్రయ్యా లేడా ఇక్కడ?" గుబురు మీసాల్ని మెలి బెట్టుకుంటూ అడిగాడు అతను.

చంద్రరావు అప్పటికిగానీ గుర్తుపట్టలేదు ఆ వ్యక్తిని. తమ నాటక సమాజంలో ఒకసారి దుర్యోధన పాత్ర వేసిన యన్. జి. వో. ఇతగాడు అనుకున్నాడు.

"మీరా సార్! ఎవరా అని చూస్తున్నాను ఇందాక

ట్నుంచి! రండిసార్! కూర్చోండి!'' అంటూ చంద్రారావు కుర్చీ చూపించాడు.

అతను కుర్చీలో కూర్చున్నాడు.

"ఊరక రారు మహానుభావులు. ఏదో పనిమీద వచ్చి నట్టున్నారు!'' చంద్రారావు వినయంగా అడిగాడు.

"అవును చంద్రారావ్! మీ నాటకసమాజంచేత ఒక నాటకం వేయించాలని వచ్చాను.''

"మహాద్భాగ్యం! చాలా సంతోషం! ఏ ఊళ్లో వేయా లండీ! సాంఘికమా? పౌరాణికమా?''

"అలా ఆతృత పడకండి. నేను చెప్పేది సావధానంగా వినండి! నేను చెప్పిన నాటకం ఆడడానికి మీకు పారి తోషికం వెయ్యిరూపాయలు. అందులో ఎడ్వాన్సుగా అయిదువందలు ఇప్పుడే ఇచ్చేస్తాను'' అని ఆగి అందరివంకా చూశాడు.

అందరూ గుటకలు మింగుతున్నారు. నాటకానికి యాభై వందా కన్నా ఎక్కువరాని ఈ రోజుల్లో ఆ మొత్తం వినే సరికి వాళ్లు మహదానందం పడిపోతూ, ఆ గుబురు మీసా లాయన చెప్పేది చెవులు రిక్కించి వినసాగారు.

4

"నీ పేరేమిటన్నావ్?'' అన్నాడు వాసుదేవరావు ఆమె జుట్టు సవరిస్తూ.

ఆమె కిలకిల నవ్వింది.

"పేరేమయితేనేం? మనిషిని నచ్చానా?''

"నీకేం! రంభలా వున్నావ్! అంత అందమయిన దాని పేరుగూడా అందంగా వుంటుందనే అడిగాను.''

"అబ్బో! ఇందాకట్నుంచి మౌనంగా ఊరుకుంటే ఏమో అనుకున్నాను. మంచి మాటకారువే!'' అంది ఆమె.

"ఇంతకీ నీ పేరు చెప్పనేలేదు!''

"నా పేరు సుందరి. చాలా?"

నవ్వుతూన్న ఆమె నోటిని మూయాలని అతడు తన పెదాలను దగ్గరకు చేర్చాడు.

ఎదుటి స్టూలుమీద టెలిఫోన్ మ్రోగింది. విసుక్కుంటూ లేచాడు వాసుదేవరావు. లుంగీ మొలకు చుట్టుకుని టెలిఫోన్ దగ్గరకు నడిచాడు. నగ్నంగా పడుకునివున్న సుందరి దుప్పటి లాగి కప్పుకుంది గొంతువరకూ.

"హలో! ఎవరూ మాట్లాడుతూంట! నేను నిరంజనరావుని మాట్లాడుతూంట! వాసు ఉన్నాడా?" పలికింది అవతలి కంఠం.

ఈ ముసలాడి కెప్పుడూ పనిపాటూ లేదు అని గొణుక్కుంటూ "నేనే డాడీ! ఏమిటి సంగతి?" అన్నాడు.

"నీకోసం అరగంటనుంచి పదిచోట్లకు ఫోన్ చేశాను. నీకేమో తమాషాగా వుంటుంది!" విసుక్కున్నాడు అవతలి నుండి నిరంజనరావు.

"అదిసరే! ఇంతకీ దేనికి పిలిచినట్టు?"

"సెంట్రల్ ఇంటలిజెన్స్ నుంచి ఎవరో సి. ఐ. డి. వచ్చాడు నీకోసం. ఇన్‌కమ్ టాక్స్ రెయిడ్ కాదులే! నీతోనే పర్సనల్‌గా మాట్లాడాలన్నాడు. నీ హోటల అడ్రసు ఇచ్చాను. మరో అరగంటలో నీ రూమ్‌కి రావచ్చు. ఆ విషయంం చెప్పటానికే పిలిచాను. ఉంటాను మరి!" అంటూ ఫోన్ పెట్టేశాడు.

వాసుదేవరావుకు ముచ్చెమటలు పోసినయ్. రిసీవరు క్రేడిల్ మీద పెట్టేసి బెడ్ మీద చివరగా కూర్చుని విల్స్ సిగరెట్ వెలిగించాడు.

"ఊ క్విక్! త్వరగా! ఇక్కడ్నుంచి వెంటనే వెళ్ళిపో! పోలీసులు వస్తున్నారట! మా డాడీ ఫోన్ చేసి చెప్పాడు?" అన్నాడు ఆతృతగా.

పోలీసనే మాట వినేసరికి ఆమె హడావిడిగా లేచింది. గబగబ గుడ్డలు చుట్టుకుని బయటకు పరిగెత్తింది.

వాసుదేవరావు సిగరెట్ యాష్ ట్రేలో పడేసి లేచి బెడ్ ని సరిచేశాడు. నలిగిపోయి రాలిన పూలను ఎత్తి అవతల పారేశాడు. లుంగీ విప్పి తన డ్రెస్ వేసుకున్నాడు. కప్ బోర్డులోంచి బ్రాందీ బాటిల్, ఖాళీగ్లాసులు, టీపాయ్ మీద పెట్టాడు. తనను కలుసుకోబోతున్న ఆగంతకుడికోసం ఎదురు చూడసాగాడు.

సి. ఐ. డి! తనను కలుసుకోవడానికి వస్తున్నాడు. ఏం పని అయ్యుంటుందబ్బా! తను చదివిన డిటెక్టివ్ నవలల్లోని పాత్రలాగ హుందాగా ఉండి ఉంటాడు అనుకున్నాడు వాసుదేవరావు.

కాలింగ్ బెల్ మ్రోగింది. వాసుదేవరావు లేచి రూమ్ తలుపు తెరిచాడు. ఎదురుగా అందమైన వ్యక్తి ట్రిమ్ గా బ్రీఫ్ కేసు పుచ్చుకుని ఉన్నాడు.

"నేను వస్తున్నట్టు మీ నాన్నగారు మీకు ఫోన్ చేసి ఉంటారనుకుంటాను. నేను సి. ఐ. డి. బ్రాంచి ఆఫీసర్ని" అని తన్నుతాను పరిచయం చేసుకున్నాడు.

"అవునవును. చెప్పారు! ప్లీజ్ గెట్ ఇన్!" అంటూ అతడ్ని లోపలకు ఆహ్వానించాడు.

సోఫాల్లో ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు. వాసుదేవరావు కొంచెంగా గాభరాపడుతున్నాడు ఇతగాడి రాకకు కారణం ఊహించలేక. ఆ వ్యక్తి అది ఊహించనట్టుగా ఉన్నాడు. వెంటనే అందుకున్నాడు.

"చూడండి! నా రాకగురించి మీరేం సీరియస్ గా ఫీల్ అవొద్దు. మీనుంచి కొంత సమాచారం కావాల్సి వచ్చాను. అంతే. టేక్ ఇట్ ఈజీ!"

"థ్యాంక్యూ వెరీమచ్!"

"అన్నట్టు నా పేరు చెప్పలేదు కదూ. నా పేరు అర్జున రావు. అసలు పేరేలెండి. అప్పుడప్పుడు మారుపేర్లతో గూడ వ్యవహరిస్తుంటాం కదా?సరే అసలు సంగతికి వద్దాం" అంటూ ఆగాడు. అతడి కళ్ళు బ్రాందీ సీసామీద పడ్డయ్యి. అతడి కోరికను వాసుదేవరావు పసిగట్టాడు.

బాటిల్ ఓపెన్ చేసి రెండు గ్లాసుల్లోకి బ్రాందీని వంచాడు. ఒక గ్లాసు అతడికి అందించి, మరోటి తను తీసుకున్నాడు.

"ఛీర్స్!" అంటూ తనగ్లాసు వాసుదేవరావ్ గ్లాసుకి తాకించి రెండు గుక్కల్లో త్రాగేశాడు సోడాకూడా కలుపుకోకుండా. ఆ తర్వాత అతడు మళ్ళీ మొదలెట్టాడు.

"మనదేశం ఈమధ్య రష్యాతో అనేక సహాయక ఒప్పందాలను కుదుర్చుకోవటం అమెరికా దేశానికి వ్యతిరేకతను తెచ్చిపెట్టింది. అసలు నిజానికి మనదేశం కష్టకాలంలో ఉన్నప్పుడు అటు బంగ్లాదేశ్ తో యుద్ధంలోకాని, ఇటు పాకిస్తాన్ తో యుద్ధం అప్పుడుకాని మనకు అండగా నిలబడింది రష్యాదేశమే. అటువంటి దేశంతో మనం కొంచెం సఖ్యతగా ఉన్నందువల్ల తప్పేంలేదు. ఇది అమెరికావారికి ఇష్టంలేదు. అందువల్ల మనదేశంలో వారి గూఢచారి కలాపాలను ఎక్కువ చేసింది."

వాసుదేవరావు శ్రద్ధగా వినసాగాడు.

"ఒకవారం రోజుల క్రితం అనుమానాస్పదమైన వ్యక్తిని బీచ్ లో పట్టుకున్నాం. అర్ధరాత్రిప్పుడు అతడు బీచ్ లో తారట్లాడుతున్నాడు. అతడి చేతిలో పాకెట్ సైజుది బహుశా ట్రాన్స్ మిటర్ అయివుండచ్చు-మేం అతడ్ని పట్టుకునే లోపలే అతడు దాన్ని ముక్కలు ముక్కలుచేసి సముద్రంలో పారేశాడు. అతడ్ని అరెస్టుచేసి తీసుకెళ్ళాం.

అతని జేబుల్లో ఎక్కడా ఏ ఆధారమూ దొరకలేదు. అతన్ని గట్టిగా ప్రశ్నించాం. అంటే చిత్రహింసపెట్టి కాదనుకోండి. జెనీవా ఒప్పందాలకు అనుగుణంగానే అతడ్ని ఇంటరాగేట్ చేశాం. మాకు పూర్తి సమాచారం దొరక్కముందే అతడు చనిపోయాడు."

"కొంపతీసి మీ దెబ్బలకు చచ్చిపోలేదు కదా?"

"కాదు. అతడే ఆత్మహత్య చేసుకున్నాడు!"

"అదెలా సాధ్యం. అతన్ని మీరు పట్టుకున్నప్పుడు అతడి వద్ద ఆత్మహత్య కుపకరించేవి ఏవీ లేకుండా చెయ్యలేదా?"

"ఎందుకు చెయ్యాలా? కాని నేరస్థులు ఎప్పుడు అధికారుల కన్న కొంచెం తెలివి ఉపయోగిస్తూంటారు. అతడి పళ్ళ వరుసలో ఒక దంతం కట్టుడి పన్ను. దాన్ని నాలుకతోనే ప్రక్కకు నెట్టేసరికి అందులోంచి పౌడరు-ఆర్సెనిక్ పౌడరు నోట్లోకి రావటం, అతడి ప్రాణాలు పోవటం జరిగింది."

"ఇంతకీ అతగాడు ఏ గ్యాంగ్‌కి చెందినవాడు. దొంగ బంగారమా, గూఢాచారా, లేక దొంగనోట్ల తాలుకా?"

"అదే తేలలేదు. అతడి నోటినుంచి వెలువడిన మాటల్ని టేప్ రికార్డు చేశాం. టేప్‌ని మళ్ళీమళ్ళీ రిపీట్ చెయ్యగా తేలిన సారాంశం ఏమిటంటే అతగాడి పేరు రాము అని, ఏదో గ్యాంగులో చేరటానికి వచ్చాడనీ హోటల్ డీలక్స్‌లో శనివారం సాయంత్రం ఎవరో వ్యక్తివచ్చి అతడిని కలుసుకుని బాస్ దగ్గరకి, అంటే ఆ ముఠా హెడ్ దగ్గరకి తీసుకువెడతా డని తెలిసింది."

"అచ్చం డిటెక్టివ్ నవలలోలాగే ఉంది.అయితే ఇందులో నేను చేయగలిగేదేముంది?"

"వస్తున్నాను. ఆ రాము చనిపోయాడు. అయితే ఆ విషయాన్ని సీక్రెట్‌గా ఉంచాం. అతడిని పోలిని వ్యక్తికోసం మేము గత నాలుగురోజుల్నుంచీ గాలిస్తున్నాం. మీ పోలిక

అన్నీ అతడితో సరిపోయినయ్. మీరు రాముగా మారిపోయి ఆ గ్యాంగ్ లో చేరిపోయి వాళ్ళ రహస్యాల్ని ఆచూకీతీసి మాకు తెలియపర్చాలి.”

వాసుదేవరావు నోరు తడారిపోయింది. గ్లాసులోకి బ్రాండీ వంచుకుని అందులో ఐస్ గడ్డలు వేసుకుని త్రాగాడు. అర్జున రావుకూడా గ్లాసు ఖాళీచేశాడు.

“అఫ్ కోర్స్. ఇది కొంచెం ప్రమాదంతో కూడుకున్న విషయమే. అయినా మా బ్రాంచి వాళ్ళు మిమ్మల్ని వెయ్యి కళ్ళతో కనిపెడుతూనే ఉంటారు. ప్రమాదం అని తోస్తే వెంటనే సీన్ లోకి వచ్చి వాళ్ళే కలుగజేసుకుంటారు. దేశం కోసం, న్యాయాన్ని పరిరక్షించేందుకు మీరీ సాహసం చెయ్యాక తప్పదు. దీనికి తగిన బహుమతి ప్రభుత్వం మీకు ఇస్తుందనుకోండి చివరలో. కనుక ఈ విషయంలో మీరు సహాయం చేయాలి!”

“దానికేం! తప్పకుండా చేస్తాను. విత్ ప్లెజర్!”

“మీ కోడ్ నేమ్ జడ్_6. మీకు అందిన సమాచారాన్ని ఎప్పటికప్పుడు ఫోన్ చేసి చెప్పండి ఫోన్ నెం. 2639కి. ఆ నెంబరు, మీ కోడ్ నేమ్ జాగ్రత్తగా గుర్తుపెట్టుకోండి. ఎటువంటి పరిస్థితుల్లోనూ అవి శత్రువులకి తెలియరాదు.”

“డిటెక్టివ్ నవలలు శతసహస్రాలుగా చదివిన నాకు ఆ మాత్రం తెలియదంటారా? ఓకే! ఐయామ్ రెడీ!”

“హోటల్ డీలక్స్ అంటే తెలుసుగా. కొంచెం చవక బార్ టీ అమ్మే ఇరానీ హోటలు. మీరు యిలా ట్రిమ్ముగా వెళితే పట్టుబడిపోతారు.”

“క్షణాలమీద డ్రెస్ మార్చేయనూ! నేను ఎప్పుడు వెళ్ళాలి?”

“ఈ రాత్రికే వెళ్ళండి. ఒకవేళ మిమ్మల్ని కలవవలసిన వ్యక్తి రాకపోతే మళ్ళీ రేపు వెళ్ళండి. అలా ఒకవారం

క్రమం తప్పకుండా ట్రై చెయ్యండి. ఈ లోపల తప్పకుండా మిమ్మల్ని ఎవరో కలుస్తారని నా నమ్మకం. మీరు చేయవలసిన దంతా గుర్తుందా? మళ్ళీ ఒకసారి చెప్పనా?"

"అవసరంలేదు. మీరు నా కప్పజెప్పిన ఈ బాధ్యతను ఎంత నేర్పుగా నిర్వహిస్తానో మీరే చూస్తారుగా?"

"ఓ.కె. విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్!" అంటూ అర్జునరావు లేచి నిలబడి చేయి ముందుకు జాపాడు.

వాసుదేవరావు అతడితో కరచాలనం చేశాడు. కోటు భుజాన వేసుకుని అర్జునరావు తలుపు తెరుచుకుని బయటకు వెళ్ళిపోయాడు.

వాసుదేవరావు సంతోషానికి అవధులులేవు. షెర్లాక్ హోమ్స్, జేమ్స్ బాండ్, డిటెక్టివ్ వాలి, యుగంధర్, పరశురామ్ అందరూ అతని కళ్ళముందు మెదిలారు. సినిమాలో హీరో ఛాన్సు దొరికిన యాక్టరులా సంబరపడిపోయాడు అతడు. తన అభిమాన నటుడు సీన్ కానరీకి భక్తితో నమస్కరించాడు.

"మిస్టర్! నువ్వు 007 అయితే నేను జడ్ - నీక్స్ని తెలుసా?" అని జబ్బలు చరుచుకున్నాడు.

## 5

రోజూ రెండు పూటలా షేవ్ చేసే గడ్డాన్ని కొద్దిగా పెరిగినట్టుగా కనబడడానికి ఆ పూట షేవ్ మానేశాడు వాసుదేవరావు. తన గుడ్డలన్నిటిలోకి మాసినది, అక్కడక్కడా చిరుగులున్న జతతీసి తొడుక్కున్నాడు. చేతి కున్న ఉంగరాలు, వాచీతీసి డ్రాయర్లో వేశాడు.

ఇకపోతే పాత జోళ్ళు తొడుక్కోవాలి కాళ్ళకు. కాని అతనికున్న జతల్లో పాతవి లేనేలేవు. రాక్ లో పదమూడు జతలు- బూట్లూ, చెప్పులూ, స్లిప్పర్స్ అన్నీ ఉన్నాయ్. కాని సగం పాతబడినవికూడా లేవు. అసలు పట్టుమని పది

రోజులైనా తొడిగితేకదా అవి పాతబడటానికి.

ఏంచెయ్యాలా అని సీలింగ్ వంక చూస్తూ ఆలోచించాడు. వెంటనే అతడికి అయిడియా వచ్చింది. వెంటనే కాలింగ్ బెల్ నొక్కాడు.

తలుపు నెట్టుకుని బోయ్ వచ్చాడు.

అతడి పాదాలవంక చూసాడు జడ్-6. అవి పాతబడిన కాన్వాసు బూట్లు.

"చూడు! నీ బూట్లు ఇక్కడ వదిలేసి ఆ రాక్‌లో నీకు నచ్చిన జత పట్టుకెళ్లు!" అన్నాడు.

వాడికి మతిపోయినంత పనైంది.

"అయ్యగారు పరాచికాలాడుతున్నారల్లేవుంది!" అని నవ్వాడు వాడు.

"కాదురా! నిజంగానే. తర్వాత నీ వాచీ అమ్మతావా అలాంటి దానితో పనిబడింది!"

"అదేమిటండీ! అది చాలా పాతకాలం నాటిది. పైగా ఇప్పుడు సరిగా ఆడటంలేదు గూడా సార్!"

"ఫరవాలేదు. ఇదిగో ఈ వంద తీసుకో. ఆ వాచీ ఇవ్వు. ఆ బూట్లుగూడా విడిచివెళ్ళు!" అన్నాడు సీరియస్‌గా.

సిరి తన్ను వెతుక్కుంటూ వస్తే కాదనలేక రూమ్‌బోయ్ తన బూట్లు అక్కడ వదిలేసి, కొత్తజత ఒకటి వేసుకుని తన వాచీ ఇచ్చేసి, వందరూపాయలు జేబులో కుక్కుకుని, 'అయ్యగారికి మతేమన్నా పోలేదుగదా!" అని ఆశ్చర్య పడుతూ బయటకు వెళ్ళిపోయాడు.

వాసుదేవరావు డ్రాయరు తెరిచి కొన్ని కరెన్సీనోట్లు తీశాడు. పది ఒకరూపాయనోట్లు పైజేబులో పెట్టుకున్నాడు. ఇరవయి రూపాయలనోట్లు కానిని లోపలి జేబులో కుక్కుకున్నాడు. వానకి తడిసి రంగు వెలిసిపోయి చెత్తబుట్టలో పడేసిన ఈవెనింగ్ హాట్ తీసుకుని రూమ్ లాక్ చేసి బయ

టకు వచ్చాడు.

కాఫీ సెక్షన్‌లో అందరూ తనకేసి వింతగా చూడటం అతని కింకా ఉషారు నిచ్చింది. హైక్లాసు హోటల్లో ఈ పాపర్ ఎవడ్రా అన్నట్టుగా వున్నయ్ వాళ్ళ చూపులు. అంటే, తన మేకప్ చాల ఇంప్రెసివ్‌గా వుందన్నమాట అనుకున్నాడు.

రోడ్డుమీద కొంతదూరం నడిచి మలుపు తిరగగానే రిక్షాని కేకేసి, "డీలక్స్‌కి పోనివ్వు" అంటూ అందులోకి ఎక్కి కూర్చున్నాడు.

## 6

డీలక్స్ హోటల్ ఎదురుగా సినిమాహాలు వుండటంవల్ల రాత్రిపూట రద్దీగా వుంటుంది.

ఒకటే పెద్దహాలు. దాని వెనుక కిచెన్. హోటల్లో కబుర్లు చెప్పుకుంటూ నవ్వులు, సర్వర్ల కేకలతో గోలగా వుంది.

వాసుదేవరావు హాల్లో చుట్టూ కలియజూసి ఒక వారగా ఖాళీగా ఉన్న కుర్చీలో కూలబడి ఆమ్లెట్‌కి ఆర్డరిచ్చాడు.

వసంతవిహార్ లాంటి క్లాస్ హోటల్లో టిఫిన్ అలవాటు పడ్డ తనకు ఇక్కడ ఆమ్లెట్ నోట్లో పెట్టుకోబుద్ధి వెయ్యలేదు. అయినా అయిష్టంగానే తింటూ, తనకోసం ఎవరన్నా వస్తారేమో అని ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూడసాగాడు.

అతడికి ఎదురుగా కూర్చున్నవాళ్ళు టీ త్రాగేసి వెళ్ళిపోయారు. ఆ రెండు కుర్చీలు ఖాళీ అయినయ్.

ఆమ్లెట్ పూర్తిచేసి టీకి ఆర్డరివ్వగానే అతడి కెదురుగా ఎవరో వ్యక్తివచ్చి కూర్చున్నాడు. అతడే తనకోసం వచ్చిన వ్యక్తేమో అని ఆశగా చూశాడు.

కాని, అతడు టీకి ఆర్డరిచ్చి తలవంచుకుని కూర్చున్నాడు

విచారంగా. కరువు కాటకాల్ని గురించో, కలరా ఉధృతాన్ని గురించో లేక ఆటంబాంబు పడబోతున్నట్లుగానో లేక జాక్ ది రిప్పర్‌ని గురించో భయపడుతున్నట్టుగా విచారంగా వున్నాడల్లే వుంది అతగాడు అనుకున్నాడు వాసుదేవరావు. అతడు టీ త్రాగేసి గప్‌చిప్‌గా వెళ్ళిపోయాడు.

వాసుదేవరావు నిట్టూర్చాడు అసహనంగా. ఆ తర్వాత మరో యిద్దరు వ్యక్తులు, మరో ఆడపిల్లవచ్చి కూర్చుని టిఫిన్ చేసి టీ త్రాగి వెళ్ళిపోయారు.

"హల్లో బ్రదర్! కులాసానా?" అని ఎవరో భుజంమీద చెయ్యివేసి పలకరించాడు.

వాసుదేవరావు తేరుకుని పలకరించినవ్యక్తివైపు చూశాడు. అతనెవరో కొత్తవ్యక్తి. తనెన్నడూ చూసి ఎరగడు. అయినా తను బయటపడకూడదనుకున్నాడు.

"కులాసాయే! సినిమాకా?" అని తిరిగి సమాధానం చెప్పాడు నవ్వుతూ.

అతడు వెళ్ళిపోయాడు. మరోసారి నిట్టూర్చాడు జడ్-6.

ఈ తడవ వయసు మళ్ళిన వ్యక్తి వచ్చి కూర్చున్నాడు అతడి కెదురుగా. మనిషి దవడలు పీక్కుపోయి నీరసంగా వున్నాడు. అతడు వాసుదేవరావు కళ్ళల్లోకి చూశాడు సూటిగా. ఇతడే అయివుండవచ్చుననుకుని వాసుదేవరావు "టీ త్రాగుతారా?" అని అడిగాడు.

అతడు కోపంగా చూశాడు. "నేనేం ముష్టివాడ్ననుకున్నావా టీలు అడుక్కోవటానికి!" అంటూ అతడు చివాలునలేచి వెళ్ళిపోయాడు.

'వచ్చిన వెధవనల్లా గూఢచారి అనుకోవటం నాదే బుద్ధితక్కువ. ఈ తడవ ఎవర్నీ అంత తేలికగా విశ్వసించవలుచుకోలేదు' అనుకున్నాడు వాసుదేవరావు.

వెయిటర్‌ని పిలిచి మరో ప్లేటు బిస్కట్లు తెప్పించు

కున్నాడు. ముక్కిపోయిన వాసనకొట్టే వండిన పదార్థాల కన్నా అవే నయమనిపించినయ్.

"నిన్నెక్కడో చూసినట్టు గుర్తు. ఏవూరు మనది?" అతని కెదురుగా కూర్చుని అడిగాడు మరో ఆగంతకుడు.

"ఈ ఊరే!" అన్నాడు వాసుదేవరావు నిర్లక్ష్యంగా. "మండేవూరు?"

"మాది కృష్ణరాజపురం. మా స్నేహితుడి తమ్ముడు నీలాగే వుంటాడు అచ్చంగా. అతనేమో అనుకున్నాను" అంటూ అతడులేచి వెళ్ళిపోయాడు మరో మూలకు.

సర్వర్ నవ్వుతో వాసుదేవరావు దగ్గరకు వచ్చాడు.

"ఏంటి నవ్వుతున్నావ్!"

"వాడ్ని మీరు భలేగా తప్పించుకున్నారు. లేకపోతే మూడునెలల్నుంచి రోజూ ఎవడో ఒకడిమీద పడివుంటూంటాడు. ఏనాడూ తన చేతిలోని డబ్బులు ఇవ్వంగా నేను చూడలేదు," అన్నాడు సర్వర్.

"పోనీలే పాపం! వాడికేం కావాలో ఇచ్చి, నాకు బిల్లియ్యి!" సానుభూతిగా అన్నాడు వాసుదేవరావు.

"వద్దుసార్! మీకంత డబ్బులు ఎక్కువగావుంటే వాకిట్లో ముష్టిదానికి వెయ్యండి. అంతేకాని, వాడు పట్టుకున్నాడంటే ఒకపట్టాన వదలడు."

"అలాగా!" అని ఊరుకున్నాడు వాసుదేవరావు.

ఇప్పుడు వీడువచ్చి జలగలా పట్టుకుంటే తను వచ్చిన పథకం అంతా పాడైపోవచ్చు అనుకున్నాడు.

అందరి కళ్ళూ ప్రవేశద్వారంవైపు తిరిగినయ్. ఎవరో వన్నెల విసనకర్ర లోపలికి అడుగుపెడుతోంది.

పెద్దగా ఈలవేశారు ఆమెని చూస్తునే ఒకమూలనుంచి. ఆమె నవ్వింది. హాల్లో మధ్యగా నిలబడి అందరివంకా చూసింది.

"ఏయ్ పిల్లా! ఇలారా! నా ప్రక్కన సీటు ఖాళీవుంది!" అని పిలిచాడు ఒకవ్యక్తి.

"ఎవరో బజారు మనిషి. బుకింగ్ కోసం వచ్చిందల్లె వుంది' అనుకుని రోడ్డుమీద నడిచే జనంవంక చూడ సాగాడు జడ్_6.

"పోరా, చచ్చునాగన్నా!" అంటూ ఎవర్నో తిట్టి ఆమె సరాసరి తన కెదురుగావచ్చి కూర్చుంది. 'చచ్చాంరా!' అనుకున్నాడు జడ్_6, ఉరఫ్ వాసుదేవరావు.

"అలా గుడ్లప్పగించి చూడకపోతే, ఏమన్నా తింటావా అని అడగలేవూ!" అతనివంకే చూస్తూ అడిగింది.

"బోయ్! ఆమెకేం కావాలో ఇవ్వు!" అన్నాడు చేసేదిలేక.

"ఏమియ్యనూ?" సాగదీస్తూ అడిగాడు సర్వర్.

"ఏదోటి పట్రా తినటానికి!" అంది ఆమె.

సర్వర్ వెళ్ళిపోయాడు.

"మా మామ వస్తానన్నాడు. ఇంకా రాలేదు. దొంగ సచ్చినోడు. దేనితో కులుకుతున్నాడో ఏమో. టైమెంత యింది దసరాబుల్లోడా?"

"నా గడియారం ఆగిపోయింది!"

"పోనీ నువ్వే తిప్పలేకపోయావు!"

ఈమె ఎవరో తన ప్రక్కనచేరి తన ప్రోగ్రాం అంతా పాడుచేసేట్టుందే అనుకున్నాడు.

ఆమెవంక ధైర్యంగా చూశాడు.

పరువంలోనున్న ఆడది. బహుశా, సినిమాచూసి ఒళ్ళు వేడెక్కిన జనాన్ని ఆకట్టుకోవటానికే అయ్యుంటుంది అనుకున్నాడు జడ్_6.

ఎవడో జులాయి వెధవ వచ్చి తన ప్రక్కన కూర్చునే కన్న కాసేపు కాలక్షేపం జరిగే ఈ స్త్రీ వుంటేనే మేలులే

అనుకున్నాడు అంతలోనే.

బోయ్ ఆమ్లెట్ తెచ్చి ఆమె ముందు పెట్టి వెళ్ళిపోయాడు.

బహుశా ఇవాళ తను కలుసుకోవాల్సిన వ్యక్తి రాదేమో! అర్జునరావు చెప్పినదాన్నిబట్టి చూస్తే ఈ రోజునుంచి వారంవరకు లేదా ఆ వ్యక్తి తారసపడేవరకూ తన ప్రోగ్రాం ఇదే ప్రతిరోజూ. అందుకే గూఢచారి అనే వాడికి సహనం, ఓర్పు ఎంతో అవసరం. సినిమాలో చూపించినంత తేలిక కాదు రియల్ స్పై బాధ్యత. కాని తనలో ఓర్పు నశించి పోతున్నది? ఎలా? ఎలా? అనుకున్నాడు జడ్-6.

ఆలోచనల్లో మునిగి తేలుతున్న జడ్-6 తన ఎదురుగా వున్న స్త్రీ తనకేసి చూస్తూ కన్ను కొట్టడం చూసి బెదిరి పోయాడు.

ఆమె తలవంచుకుని ప్లేట్లో పదార్థాన్ని కెలుకుతూ, "రామూ! నీకన్న గొర్రె నయం! నీదింత మందబుద్ధేం?" అంది.

వాసుదేవరావు, ఉరఫ్ జడ్-6, ఉరఫ్ రాముకి కుర్చీ లోంచి క్రింద పడిపోయేటంత పనయింది.

## 7

కుర్చీలో తమాయించుకుని మళ్ళీ సర్దుకుని కూర్చున్నాడు రాము. "నీకోసం అయిదింటినుంచి వెయిట్ చేస్తున్నాను" అన్నాడు నెమ్మదిగా తమాయించుకొని.

"నీవు తెల్లచొక్కా వేసుకొస్తావని చెప్పారే!" అన్నది అను మానంగా అతన్ని చూస్తున్న ఆమె.

"నిజమే. కాని లాండ్రీవాడు ఆ చొక్కా చింపుకొచ్చాడు. అందుకని ఈ రంగుచొక్కా వేసుకురావాల్సివచ్చింది."

"ఇలాంటి తప్పులు చేశావంటే బాస్ సహించడు. తెలుసా?"

"ఐయామ్‌సారీ! ఈ ఒక్క సారికి ఊరుకుందూ?"

అన్నాడు బ్రతిమాలుతున్న ధోరణిలో.

తను ఎంతో నేర్పుగా, తను వచ్చిన పనికీ వాతావర ణానికీ సరిపడ్డ డ్రెస్ సెలక్టు చేసుకోగలిగినందుకు అప్పటి దాకా అతడు తన్ను తాను అభినందించుకుంటున్నాడు. కాని ఈమె వచ్చి దాన్ని తారుమారు చేసేసింది.

తను మొదట్లోనే తప్పుచేసినట్టుగా తేలిపోయింది. స్పై అన్న వాడు ఇలాంటి తప్పులుచేస్తే తేలిగ్గా పట్టుపడిపోతాడు కనుక తను ఇంకా అలర్ట్‌గా వుండాలి అనుకున్నాడు.

"నీ సారీల సంగతి తర్వాత. ఇప్పటికే చాల టయి మయింది, ఇప్పుడు గంట ఎంత?" అనడిగింది.

తన వాచీ చూసుకున్నాడు.అది ఆడటం మానేసి చాలా రోజులయినట్టుంది. ప్రక్క టేబుల్ ముందు కూర్చున్న అతని వాచీలోకి చూసి "ఎనిమిదయింది. కరెక్టేగా!" అన్నాడు.

"ఇదో! ఇది అందుకో!" అంటూ రెండురూపాయల నోటుని టేబుల్ క్రిందుగా అందించింది. అది తీసుకుని జేబులో కుక్కుకున్నాడు రాము. పైనుంచి ఒక చిన్న ముఖ మల్ పర్సు అతని చేతికందించింది.

నవ్వుతూ "ఏం చెయ్యాలో తెలుసుగా!" అంది ఆమె.

"ఇప్పుడే వస్తాను" అంటూ అతడు లేచి లావెట్రీలోకి వెళ్ళాడు. తన వెనకనే తలుపు గొళ్ళెం పెట్టేశాడు.

ఆమె అతి గోప్యంగా ఇచ్చిన రెండు రూపాయల నోటునీ, పర్సునీ మార్చి మార్చి ప్రత్యేకంగా పరీక్షించి చూశాడు. కాని అతడికేమీ అంతుబట్టలేదు.

'ఏంచెయ్యాలో తెలుసుగా!' ఆమె మాటలే అతని చెవుల్లో మ్రోగుతున్నయ్. 'ఏంచెయ్యాలి! ఏంచెయ్యాలి!' అనుకున్నాడు.

కాసేపు ఆలోచించి ఏదో గుర్తుకు వచ్చిన వాడిలా పర్సు

జేబ్ లాగి, రెండువూపాయల నోటును మడిచి అందులో పెట్టాడు. డోర్ తెరుచుకుని హాల్లోకి నడిచాడు.

టేబుల్ దగ్గరకు వస్తూ పరీక్షగా ఆమెని చూశాడు.

ఈమె అన్నమాట ఆ ముఠాలోని వ్యక్తి. కాని ఆమెను బజార్లో చూస్తే ఒళ్ళమ్ముకునే బజారు స్త్రీ అనుకుంటారు ఎవరైనా. ఆమె ఇంత గ్రంథసాంగురాలని ఎవరూ ఊహించలేరు. అసలు నిజమైన గూఢచారులు సామాన్య ప్రజల్లో ఇలాగే కలిసిపోతారు కాబోలు. ఆమె అనుభవంతో పోలిస్తే ఆమె వయసు తక్కువే కావచ్చు. చిన్నప్పట్నుంచి ఇలాంటి రాకెట్ లో మెసిలివుంటుంది.

"నీ దగ్గర రివాల్వరు వుందా?" కుర్చీలో కూర్చుంటూండగానే అడిగింది ఆమె, రహస్యంగా.

"లేదు. రివాల్వరెందుకు?" అమాయకంగా అడిగాడు.

"నువ్వు చెయ్యబోయేపని ఎంత ప్రమాదకరమయిందో తెలిసికూడ ఏ ఆయుధం లేకుండా ఎలా వచ్చావు?" ఆమె మాటలు కర్కశంగా వున్నాయ్.

తన తెలివితక్కువ సమాధానానికి నొచ్చుకున్నాడు రాము. అంతలోనే మళ్ళీ సర్దుకున్నాడు.

"ఓ అదా నీభయం! నా నడుముకు సైకిలు ఛైయిన్ వుంది. రివాల్వర్లూ, పిస్తోళ్ళూ అమ్మమ్మలూ నాయనమ్మలూ వుపయోగించేవి. నాదంతా కోల్డ్ బ్లడెడ్ మర్డర్స్. తెలుసా?" గర్వంగా ఆమె కళ్ళల్లోకి చూశాడు.

"అలా చెప్పు!" అంది ఆమె నవ్వుతూ.

"అసలు నా చేతిలో రివాల్వరు వుంటే పిట్టల్ని కాల్చినట్టు కాల్చేయ బుద్దేసుంది నాకు. నా చేతిలో ఆఖరుసారిగా చచ్చింది మా ఫామిలీ డాక్టరే తెలుసా?"

"మొత్తానికి అసాధ్యుడివే నన్నమాట... సరే! ఇక అసలు సంగతి కొద్దాం. బాస్ ఆర్డర్స్ ఏమంటే-ఈ రోజు

రాత్రిగాని లేదా రేపుగాని మనిద్దరం అతడ్ని కలుసుకోవాలని. ఆ విధమేదో నీకు తెలుసుగదా?"

"అవునవును! నాకు తెలుసు!" అన్నాడు దర్పంగా.

"అయినా తగిన జాగ్రత్తకోసం మళ్ళీ చెబుతున్నాను. జాగ్రత్తగా విను. సరిగ్గా తొమ్మిది గంటలకు మనకోసం ప్రకాశం పార్కుకి ఒక వ్యక్తి వస్తాడు...వింటున్నావా?"

"వింటున్నాను! చెప్పు!"

"అక్కడికి చేరాలంటే మనకు కనీసం అరగంట పడుతుంది. ఎకాయికి మనం పోవటానికి వీల్లేదు! మనల్ని ఎవరూ ఫాలో కాకుండా జాగ్రత్త పడాలి. అందుకని ఇక్కడ నుంచి నేను ముందుగా వెళ్ళి మూలమలుపులో ఆగుతాను. నువ్వు నా వెనకే రా!"

"అలాగే!"

"ఇద్దరం కలిసి ఒక ఫర్లాంగు నడిచిన తర్వాత స్టేషన్ రోడ్డు వస్తుంది. నేను ఎడమవైపు రోడ్డున వెళ్ళిపోతాను. నీవు కుడి ప్రక్క రోడ్డునే వెళ్ళి స్టేషన్‌లోకి వెళ్ళు. ఏం?"

"ఫాలో అవుతున్నాను. క్యారీ ఆన్!"

"నీవు స్టేషన్లోకి వెళ్ళు ఎంట్రన్స్ గేటునుంచి. ప్లాటుఫారం మీదకు వెళ్ళేవు సుమా! ఎంక్వయిరీ దాకా వెళ్ళి మళ్ళీ ఎగ్జిట్ గేటు బయటకురా! అక్కడ గళ్ళలుంగీ కట్టుకుని నెత్తిన ఈవెనింగ్ హ్యాట్ పెట్టుకుని రిక్షావాడు వుంటాడు. అందులో ఎక్కి 'పోనీయ్' అను. కొంత దూరం వచ్చిన తర్వాత అతడు 'ఎక్కడికి సార్' అని అడుగుతాడు. అప్పుడు మటుకే చెప్పాలి ప్రకాశం పార్కుకు పోనివ్వమని. స్టేషన్లో ఆ పార్కు పేరు మాత్రం ఎత్తగూడదు? తెలిసిందా?"

"రైటో!" అన్నాడు జడ్ 6 హుషారుగా.

# 8

జడ్ — 6 ప్రకాశం పార్కులోకి అడుగుపెట్టాడు.

పార్కులో గేటు దాటంగానే ఎడమవేపునుంచి మూడో బెంచీమీద వెయిట్ చెయ్యమని చెప్పింది. బెంచీలు లెక్కేసుకుంటూ మూడో బెంచీ దగ్గరకు వెళ్ళాడు.

ఆ బెంచీ మీద ఇద్దరు కూర్చుని వున్నారు.

జడ్ — 6 గతుక్కుమన్నాడు. ఇప్పుడెలా? ఎలాగో ట్రిక్ చేసి వీళ్ళని వదిలించుకోవాలి. ఎలా?

"సినిమాకు పోలేదా? ఇక్కడ కూర్చున్నారేం?" అని వాళ్ళ దగ్గరకు వెళ్ళి అడిగాడు.

"ఎవడ్రా వీడు! డబ్బుల్లేక మనం ఈ పూట సుక్కేసుకోలేదని ఏడుస్తుంటే సినిమా అంటాడు!"

"అదా సంగతి! ఇదిగో డబ్బు! ఈ అయిదు రూపాయలు తీసుకుని వెళ్ళి తాగేసి సినిమాలో దూరండి!" అంటూ అయిదు రూపాయిలు ఒకడి చేతిలో పడేశాడు.

వాళ్ళిద్దరూ తెల్లబోయారు.

"నకిలీ నోటేమోరా!" అన్నాడు రెండోవాడు తన కళ్ళనే నమ్మలేనట్టు.

"లేదా మారని నోటన్నా అయ్యుండాలి. కాకపోతే అంత ఇదిగా అయిదు రూపాయలు ఉత్తి పుణ్యానికే ఇస్తాడా?"

జడ్ — 6 నవ్వుతూ వాళ్ళవంకే చూస్తున్నాడు. వాళ్ళిద్దరు ఆ నోటుని తమ తమ చేతుల్లో తీసుకుని చూశారు. అది మంచి నోటే.

ఇంకా ఆలస్యం చేస్తే ఎదురుగా ఉన్న వ్యక్తి తన అభిప్రాయం మార్చుకుని నోటు లాగేసుకుంటాడేమో అన్న భయంతో ఇద్దరూ లేచి "టాంక్యూ బ్రదర్!" అంటూ

వేగంగా బయటికి నడిచి వెళ్లిపోయారు.

"నోటు మంచిదేరా! వీడి బుర్రే చెడిపోయి వుంటుంది. లేకపోతే ఐదురూపాయలు దానం చేస్తాడా?" అనుకుని నవ్వుకున్నారు ఇద్దరూ.

జేబులోంచి హ్యాండ్ కర్చీఫ్ తీసి సిమెంటు బెంచీని దులిపి కూర్చున్నాడు. అంతలోనే తన వెనుక నుంచి ఆమె వచ్చింది.

"ఎంత సేపయింది వచ్చి?" అనడిగాడు.

"ఒక పావు గంటయింది. నీవు రాలేదని ఆ వెనుకే చాటుగా కూర్చున్నాను."

వెన్నెల రాత్రి కొంచెం చలిగా వుంది. బెంచీమీద అతనికి ఆనుకుని కూర్చుంది. ఆమె స్పర్శ అతనిలో వేడిని పుట్టిస్తోంది. అయినా తను లొంగిపోగూడదు. సీక్రెట్ ఏజంటన్నవాడు ఇంతకన్న పరువంలో ఉన్న స్త్రీలు రా రమ్మని ఆహ్వానించినా తను నిబ్బరంగా ఉండగలగాలి. తనూ అంతే గదా!

"ఇంతకీ నీ పేరు చెప్పావు కాదు?"

"నా పేరు! కమల!"

"అసలు పేరేనా?" మళ్లీ అడిగాడు.

"అవన్నీ అడగకూడదు నువ్వు. చెప్పినది విని ఆ ప్రకారంగా నడుచుకోవటమే! లేకపోతే ఈ ఫీల్డులో రాణించలేవు!" అన్నది ఆమె.

"మనం ఏదో ఒకటి మాట్లాడుకోవాలి గదా? లేకపోతే టైమ్ గడిచేదెలా? అందుకు అడిగాను! మరేం అనుకోకు!" అన్నాడు ఆమె చేతిని లాలనగా నిమురుతూ.

ఆమె కళ్లు వింతగా మెరిసినయ్. "ఇంకా ఎంత టైమ్ ఉంది తొమ్మిదికి?" అనడిగింది.

వాచి చూసుకున్నాడు. ఎనిమిది గంటల నలభయి నిము

పాలయింది ఇంకా మనం ఇరవయి నిముషాలు ఆగాలి!" అన్నాడు.

"చాలా టైమ్ వుంది.అలా ఆ పొదల చాటుకు వెళ్దామా కాసేపు!" అంది ఆమె.

ఆశగా ఆమె వేపు చూశాడు. కాని అతని మనసు ఏదో కీడుని శంకించింది. "అదేం వద్దు! మన పని కానీ!"అన్నాడు నిదానంగా.

ఆమె కిలకిల నవ్వింది. "నిజంగానే అనుకున్నావా? నీకు నిగ్రహం ఉందో, లేదో అని టెస్ట్ చేశాను. అంతే!" అన్నది.

ఎంత గండం గడిచింది! తను ఏమాత్రం తొందరపడ్డా తను ఈ 'రింగ్' లోంచి బయటికి త్రోసివేయబడేవాడే! అందుకే ఈ ఫీల్డులో తిరిగే వాళ్ళకు ఓర్పు, నిగ్రహం,జ్ఞాపక శక్తి అవసరం. ప్లే వెల్ యూ ప్లే...రీడ్ వెల్ యూ రీడ్ అని ఊరికే అన్నారా. అందుకే తను వచ్చిన పని మీదనే తన దృష్టిని కేంద్రీకరించాలి.మధ్య మధ్యలో లావ్ ఆటలు ఆడగూడదు అనుకున్నాడు.

"బాస్ గురించి చెప్పరాదూ ఊరికే కూర్చోకపోతే?" అన్నాడు మౌనంగా కూర్చోలేక. ఆమెనుంచి తన ప్రశ్నకు సమాధానం వస్తుందని ఆశించలేదు. అయినా అడిగాడు.

ఆమె మాట్లాడలేదు. ఆమె దృష్టి గేటుదాటి లోపలకి వస్తున్న వ్యక్తిమీద వుంది. అతడు వీళ్లిద్దరివంకా తీక్ష్ణంగా చూస్తూ పార్కులో ఇంకా పైకి వెళ్లిపోయి గార్డన్ లో కలిసిపోయాడు.

"నీలాంటి అందమైన వ్యక్తి ఈ ఫీల్డ్ లో కెలా వచ్చావ్?" అని అడిగాడు మళ్లీ మౌనాన్ని సహించలేక.

"నీ ప్రశ్న వింటూంటే నేను చదివిన నవలలో విష

యాలు గుర్తుకు వస్తున్నాయ్. ఒక వ్యభిచారిణి వద్దకువచ్చిన ప్రతి పదిమందిలో తొమ్మిది మంది నా ఈ కూపంలో కెందుకు వచ్చి పడ్డావ్ ఇంత అందమయిన దానివి? అని అడుగుతారు. ఆమె కూపంలోనే పడిందనుకో. మరి వీళ్లు మాత్రం వచ్చింది ఎక్కడికి? స్వర్గానికా? కాదే! అదే కూపంలోకి కదా!

"ఇంతకీ నేను ఈ ఫీల్డులోకి ఎందుకు వచ్చానని గదూ అడిగింది? ఇదివరలో నేను లైబ్రరియన్‌గా పని చేస్తుండే దాన్ని. ఆ ఉద్యోగానికి జీతం పెద్దగా ఇవ్వరన్న విషయం నీకూ తెలుసనుకుంటాను? ఆడవాళ్ళకు దుస్తుల క్రిందా అలం కరణాల క్రిందే చాలా ఖర్చవుతుంది. పైగా అప్పులున్నాయ్. ఇవన్నీ తెముల్చుకోవాలంటే ఎక్స్‌ట్రా డబ్బు అవసరం. అందుకే ఈ 'వలయం'లోకి వచ్చాను. ఇప్పుడు పుష్కలంగా డబ్బు ఉంటోంది చేతిలో."

'బాగానే ఉంది. ఇంతకీ ఆ వలయం గురించి చెప్పి చావవేం?' అని తిట్టుకున్నాడు లోలోపల జడ్-6.

ఇదేదన్నా విదేశీ గూఢచారి ముఠానా? వాళ్ళు దేనికోసం ప్రయత్నిస్తున్నారు? ఆటంబాంబుల తయారీ గురించా. లేదు. ఎందుకంటే ఆ ఫార్ములా దాదాపు అన్నిదేశాల వారి దగ్గరా ఉంది ఈ రోజుల్లో. లేదా? అంతరిక్షంలో తిరుగాడే స్పుట్నిక్‌ల గురించా. ఆс. తెలిసింది. ఖండాంతర రాకెట్లూ, వాటిని మధ్యలోనే ఛేదించగల రాకెట్ల గురించి అయ్యుం డచ్చా! అతని ఆలోచనల్ని చీల్చుకుంటూ ఆమె మాటలు వినిపించినయ్.

"ఈ పని చేస్తున్నందుకు నేనెన్నడూ అభిమానపడ లేదు. చట్ట ప్రకారం మనిద్దరం దోషులమే! కాని న్యాయంగా మనం సంపాదించ గలిగిన దానికన్న పదిరెట్లు ఎక్కువ సంపాదించగలం!"

"అవునవును!"

"టైమ్ తొమ్మిదయిందా? నీ టైమ్ కరెక్ట్‌గా ఉందా? ఇంతకుముందు నీ వాచీ పనిచెయ్యటం లేదంటిని గదా?"

"స్టేషన్లో టైమ్ కరెక్ట్ చేసి కీ ఇచ్చాను. అది మూడు గంటలు పనిచేసి ఆతర్వాత ఆగిపోతుంది. అంటే పదకొండు గంటలవరకూ సరిగానే పనిచేస్తుంది."

ఇద్దరూ కాసేపు మౌనంగా కూర్చున్నారు.

"ఎంతసేపూ నేనేనా మాట్లాడేది? కాసేపు ఏవన్నా కబుర్లు చెప్పు!" అంది ఆమె.

"ఏం చెప్పమంటావు?"

"నీ వయసెంత?"

"ఇరవై ఆరు!"

"ఇంత చిన్నవయసులోనే హత్యలు చేశావా?"

తనను హంతకుడుగా ఊహించుకుంటున్నదా? అవును. ఈ ఫీల్డులో అందరూ అలాంటివారే గదా! తను బయటపడ కూడదు. ఏదో కథ అల్లి చెప్పాలి, ఆమె ఇంకా వివరాలడిగితే!

జష్_6 బెంచీమీదకు ఆనుకుని కాళ్లు బారజాపి గర్వంగా నవ్వాడు. తను హంతకుడు. ఇదివరలో కాకపోయినా ఈ గ్యాంగ్‌లో శత్రువుల్ని కొందరికన్నా చంపే అవకాశం రాకపోదు.

"ఇంతకు పూర్వం ఒక మెడికల్ స్టోర్స్‌లో పనిచేస్తుండే వాడ్ని."

"అయితే త్రాగుడుకూడా అలవాటయి ఉండాలే?"

"ఎందుకులేదు. ఇవాళంటే ఇలా ఉన్నా గాని లేకపోతే ఈపాటికి రెండు బాటిల్స్ ఖాళీచేసి ఉండేవాడ్ని?"

"చేసిన హత్యల్ని మరచిపోవటానికా?"

"అబ్బే అదేంలేదు! ఎవరన్నా ఆ పనికి పురమాయించి

నప్పుడు రెండో కంటికి తెలీకుండా ఆ వ్యక్తిని సఫా చెయ్యటం, గుర్తుపట్టలేకుండాచేసి ఆ శవాన్ని పారెయ్యడం. అంతే ఆ తర్వాత ఆ విషయమే గుర్తుంచుకోను."

"మీ ఇంట్లో కలతలున్నాయా?"

"అవును! మా నాన్న ఎప్పుడూ తాగివచ్చి ఇంట్లో కలభా చేసేవాడు. మా అమ్మను చావగొట్టేవాడు. దాంతో నేను ఆలనాపాలనా లేకుండా పెరిగాను."

లక్షలకు అధికారయిన తండ్రిని కాసేపు తాగుబోతుగా, దరిద్రంతో బాధపడే మురికివాడలోని వ్యక్తిగా ఊహించుకున్నాడు జడ్-6.

"తర్వాత?"

"చిన్నతనంలోనే ఏదో నేరంచేసి బోస్టర్ స్కూలుకు పంపబడ్డాను. అక్కడ ఆరేళ్ళుండి బయటకు వచ్చేసరికి నా తల్లీదండ్రీ ఆచూకీయే తెలీలేదు. వాళ్ళిద్దరూ విడిపోయి ఎవరి దోవన వాళ్ళు వెళ్ళిపోయారు అని తెలిసింది. నేను ఏకాకినై పోయాను. ఆ తర్వాత కథ నీకు తెలిసిందే."

"తొమ్మిది దాటింది! మనవాడు ఇంకా రాలేదే? కొంపదీసి మనం అతన్నుంచి తప్పిపోలేదు కదా?"

"ఎందుకంత కంగారు! మనకివ్వబడ్డ ఆదేశాల ప్రకారం నడుస్తున్నాం. చెప్పిన టయిమ్‌కి రాకపోతే బాస్ చేతిలో వాడే తన్నులు తింటాడు! మనకేం?"

"అంతేలే! రాకపోతే ఒకరోజు వృధాగా ఖాళీగా గడిపేశామే అని నా విచారం!"

అంతలో ఎవరో వ్యక్తి అటుగా వాళ్ళవైపే రావటం కనిపించింది.

జడ్-6 హృదయం ఎగిరి గంతేసింది. అతడు నేరుగా వాళ్ళ దగ్గరకువచ్చి "భోజనంచేసి రెండు రోజులయింది. చిల్లరుంటే ఇస్తారా?" అని అడిగాడు.

అతడే తను ఎదురుచూస్తున్న వ్యక్తి అనుకున్నాడు. పైగా అతని వేషం హిప్పీ వేషంలాగే ఉంది. కమలవైపు గూడ చూడకుండా లేచి నిలబడి జేబులోంచి మొఖమల్ పర్సు తెరచి అందులోంచి రెండు రూపాయల కాగితాన్ని ఆ ఆగంతకుడి చేతిలో పెట్టేశాడు.

"చపాతీలు!" అన్నాడు రాము. అదే కోడ్ వర్డ్. రెండు రూపాయలు ఆ వచ్చిన హిప్పీవాడి చేతిలో పెట్టి 'చపాతీలు' అని అనమని అంతకుముందే చెప్పివుంది కమల. తను అలాగే చేశాడు.

"చపాతీలా? అవి నాకు అరగవే! సరే. మీరు చెబుతున్నారు గనుక ఒకరూపాయితో భోజనంచేసి, రేపు చపాతీలు తింటాను. భగవంతుడు మీకు మేలు చేయుగాక!" అంటూ ఆ వ్యక్తి మెరుపులా పరుగెత్తుకువెళ్ళి మాయమయ్యాడు.

జడ్-సిక్స్ ఉరఫ్ రాము తెల్లబోయాడు. అయితే తాను ఎదురుచూస్తున్న వ్యక్తి ఇతడు గాదన్నమాట. తను ఎంత పెద్ద పొరబాటు చేశాడు. ఆదుర్దాలో ఆ రెండు రూపాయల నోటుని- దానిమీద ఏ రహస్య సంకేతాలున్నాయో ఏమో, దాన్ని కాస్త వాడిచేతిలో పెట్టేశాడు. ఇప్పుడేం దారి! అయోమయంగా కమలవైపు చూశాడు.

"నెవర్ మైండ్ మై బోయ్! పొరబాట్లనేవి సహజమే. అందులోను కొత్తలో అయితే మరీను! ఇదే మరొకరయితే నిన్ను నాలుగు తన్నించి వెళ్ళగొట్టేవారు. నేను గనుక ఈ రహస్యాన్ని భద్రంగా దాస్తాను ఎవరికీ చెప్పకుండా" అన్నది ఆమె అతని భుజాన్ని తడుతూ, అనునయంగా.

నిజమే! ధైర్యంగల వ్యక్తి ఎప్పుడన్నా ఓటమిని పొందినపుడు దాన్ని అంగీకరిస్తాడు. తను చదివిన నవలల్లో గూడ అక్కడక్కడ పొరబాట్లు చేసిన ఏజెంట్లు లేకపోలేదు.

వాళ్ళకు మళ్లీనే తను గూడ రాబోయే దాన్ని ఎదుర్కోవటానికి సిద్ధమై వుండటమే కర్తవ్యం!

ఆలోచనల్లో అవమానంతో పరాకుగా ఉన్న రాముని వెన్ను చరిచి అన్నది "అదిగో! అతడే! అతడే!"

రాము ఉలిక్కిపడి అటు చూశాడు. పార్కుగేటు లోంచి మరో హిప్పీగాడు అటుగా వస్తున్నాడు.

"మరి...మరి ... ఇప్పుడెలా?" అన్నాడు కంగారుగా జడ్—6.

"ఫర్వాలేదు. ఏదో ఒక నోటు ఇచ్చెయ్యి" అన్నది కమల.

నిజమే! ఆడదానికున్న పాటి తెలివి తనకు లేకపోయింది.

లేచి నిలబడి జేబులోంచి పదిరూపాయల నోటుతీసి చిన్న పర్సులో కుక్కాడు. తనే ఆ వస్తూన్న వ్యక్తికి ఎదురు వెళ్ళి కలుసుకున్నాడు.

"చపాతీలు!" అన్నాడు.

"చపాతీలు తినాలంటే రెండు రూపాయ లుండాలి!" అన్నాడు ఆ వచ్చిన వ్యక్తి నవ్వుతూ.

రాముకేదో మెరుపులా ఆలోచన తట్టింది. పర్సును అతడి చేతిలో పెట్టాడు. నోటు అయితే వెంటనే గుర్తుపట్టవచ్చు. అందుకని ఆ పర్సు చూస్తే...అందులోగూడ ఏవన్నా రహస్య సంకేతా లుండచ్చు. ఆ పర్సు వల్లన్నా తనను గుర్తించవచ్చు.

అతడు పర్సుని పరీక్షగా చూశాడు. "పర్సు అదే! సందేహం లేదు! మరి నోటు!" అంటూ జిప్ లాగి దాన్ని తెరిచి అందులోనుంచి పదిరూపాయల కాగితాన్ని బయటకు లాగాడు.

"ఇదేమిటి? ఇదెక్కడ సంపాయించావు? రెండు రూపాయల కాగితం అంటే పది కాగితం ఇచ్చి నన్ను మభ్య పెడ

దాచుకొన్నావా? మన దగ్గర ఆ పప్పులేం వుడకవు?'' అంటూ పర్సునీ, కాగితాన్నీ మళ్లీ అతని చేతిలో పెట్టేసి గబాగబా వెళ్లిపోయాడు.

షేక్స్పియర్ ముఖం వేసుకుని కమల దగ్గరకు వచ్చాడు రాము.

అతని ముఖంలో ఓటమి, అవమానం, లజ్జ అన్నీ ద్యోతక మవుతున్నాయ్. సీక్రెట్ ఏజెంట్‌గా తను తగడు. ఇటువంటి చేతగాని పనులు చేస్తుంటే తను తేలికగా పట్టుబడిపోతాడు. ఈ చిన్నపనికే తను తడబడిపోయి తప్పటడుగు వేస్తే ఇక ముందుముందు ఎన్నో బాధ్యతాయుత మైనవీ, ప్రమాదకరమైనవీ గూడ చెయ్యాల్సి రావచ్చును. అవి ఎలా చెయ్యగలుగుతాడు.

తన వెంటవచ్చిన కమలగూడ మంచిదానిలా వుంది. లేకపోతే ఈ పాటికి తనను నకిలీ మనిషిగా గుర్తుపట్టేసి, లాక్స్లీ వాళ్ళ బాస్‌కి అప్పజెప్పారంటే వాడు తనను యముడికి అప్పజెప్పేది ఖాయం!

''అతడు వెళ్ళిపోయాడు! ఇప్పుడిక మనం చేసేది ఏముంది?'' అని బిక్క మొగంతో అడిగాడు రాము.

''అంత మాత్రానికే ఇలా అయిపోతావేం! ఇదివరలో ఎన్నడూ గూఢచారి పనులు చెయ్యలేదా? అవున్లే! నువ్వు చేసినవన్నీ హత్యలే అని చెప్పావు కదూ!''

ఆ మాటకు పౌరుషం తెచ్చుకున్నాడు రాము. నిజమే హత్యలు చేయగల గుండె ధైర్యంగల మనిషి ఇలా బెంబేలు పడిపోవట మేమిటి?

''మరేం ఫర్వాలేదు. మళ్ళీ రేపు రాత్రికి మనకు మరో అవకాశం వుంది!''

''అవునా?'' అన్నాడు ఆనందంతో జడ్—6.

''చాలా పొద్దుబోయింది. ఇక వెడదామా?'' అంది ఆమె

మత్తుగా వళ్ళు విరుచుకుంటూ.

“నీ ఇల్లెక్కడ?”

“నా ఇల్లు చాలా దూరం? పోనీ నీ రూమ్‌లో గడపుదాం ఈ రాత్రికి మనిద్దరం!” అంది ఆమె.

అతను గాభరా పడ్డాడు. ఏ క్లాస్ హోటల్లో తన రూమ్ గనుక ఆవిడ చూసిందంటే తను ఓ లక్షాధికారి కొడుకనీ, అసలు 'రాము' కాదనీ ఇట్టే పసిగడుతుంది.

కనుక ఏదైనా వేరే లాడ్జికిపోతే సరి! ఆమెను ఈ రాత్రికి టూవ్ చేసి ఆ 'బాస్' నిర్వహించే రాచకార్యాలేమిటో కూపీ లాగాలి అనుకున్నాడు.

“దగ్గరలో ఏదైనా లాడ్జి ఉంటే అక్కడ గడిపేద్దాం! నా రూమ్‌లో ఇంకా ఇద్దరు ముగ్గురం కలిసి వుంటాం... నిన్ను అక్కడికి తీసుకువెళ్ళే అవకాశం వుండదు.”

“పోనీ! నేను రిక్షాలో మా ఇంటికి వెళ్ళిపోతాలే!” అన్నది కమల అతనివంక ఓరగా చూస్తూ.

“ఒంటరిగా ఎందుకులే! నాతో వుండటానికి భయమా?”

“భయమా? భయం అంటే ఏమిటో మరిచిపోయి ఆరేళ్ళయింది. ఈ ఫీల్డులో దేనికీ భయపడరాదు.”

“అలా అయితే నాతోరా! ప్లీజ్!” ఎలాగైనా రాత్రే ఆమెనుంచి ఆ 'బాస్' గాడి రహస్యాలు లాగాలని అతడి తాపత్రయం.

# 9

వనితా లాడ్జిలో డబుల్ రూం తీసుకుని ఇద్దరూ టిఫిన్ చేసి రూమ్‌లో జేరారు.

“అబ్బ! నిద్ర వస్తోంది!” అంది కమల ఆవలిస్తూ. చేతులు వెనక్కి విరుస్తూ ఒళ్లు విరుచుకుంది. ఆమె సిల్కు పైట జారి పోయింది. రాముకి ఉద్రేకం వచ్చింది. అయినా తమా

యించుకున్నాడు.

"ఇంతకీ 'బాస్' గురించి ఏం చెప్పలేదు?" అన్నాడు ఆమె వంక చూస్తూ.

ఆమె సూటిగా అతని వంక చూసింది. "తొందరెందుకు. రేపు రాత్రికి ఎటూ నువ్వే చూస్తావుగా!" అంది నింపాదిగా.

"పోనీ ఇవాళ నువు మటుకు చెప్పకూడదా?"

"చెప్పాలంటావా?"

"అనేగా అడిగేది!"

ఆమె రహస్యం చెప్పేదానిలా అతడి దగ్గరకు వచ్చింది. ఆమె పైట జారిపోయింది మళ్ళీ. ఆ ఎత్తుపల్లాలను అతని హృదయానికేసి అదిమింది.

ఆమె చేతులు అతన్ని బంధించినయ్. జడ్-సిక్స్ ఆమెకు లొంగిపోయి ఆమెకు బందీ అయిపోయాడు. ఇద్దరూ బెడ్ మీదకి వాలిపోయారు.

అరగంట తర్వాత వాసుదేవరావు ఉరఫ్ రాము ఉరఫ్ జడ్-6 కళ్ళు తెరిచి చూశాడు.

రెండో బెడ్ మీద కమల పడుకొనివుంది. జడ్-6ని చూసి చిన్నగా నవ్వింది.

"ఇదా నువ్వు చేసేపని రహస్యం చెబుతానని?" అని గట్టిగా అడిగాడు.

"ఏం చేశానని?" ఆమె నవ్వుతూ అడిగింది.

"నన్ను సెడ్యూస్ చేసి పారేసింది చాలక ఇంకా ఏం చేశానని అడుగుతున్నావా?"

"అప్పటికి నువ్వేదో స్త్రీ మొహం ఎరగని వాడిలా?" వెటకారంగా అంది.

అరె ఈమె ఎలా కనిపెట్టింది తను స్త్రీలోలుడని. ఈమె ఎవరో అసాధ్యురాలులావుంది అనుకున్నాడు.

"మనం రోజల్లా కష్టపడ్డాంగదా! రేపు రాత్రిదాకా మనకు రెస్టు! ఈ లోపల మన నరాలకు కాస్త రిలాక్సేషన్ కలిగించాను. అంతేగదా! అయినా నీ అమాయకత్వానికి జాలివేస్తోంది.''

"అదేం? అలాగంటావు?''

"లేకపోతే ఈ మొహమేనా లోగడ హత్యలు చేసిందీ? మానభంగాలు చేసిన వ్యక్తి. కనీసం చెప్పిన పనిగూడ సరిగా చెయ్యలేని వాడివి?''

అతడి ముఖం వివర్ణమయింది. నిజాన్ని చెప్పేసి తన నిజ స్వరూపం ఆమెకి చెప్పేసి అయినా సరే ఆ 'బాస్' గాడి గురించి తెలుసుకోకుండా ఈమెను వదలకూడదు, అనుకున్నాడు.

"నిజమే కమలా! నేను ఈ ఫీల్డుకి కొత్త. నేను నిజంగా పోకిరీని, జులాయి వెధవను కాను. కాస్తో, కూస్తో తినటానికి కలవాడినే. డిటెక్టివ్ పుస్తకాలు చదివి, నేనుగూడ ఏదైనా ఎడ్వంచర్ చెయ్యాల్సి ఇలా బయలుదేరాను. నా గురించి నిజాన్ని నీకు చెప్పేశాను. ఇప్పటికైనా నీ గురించి చెప్పు.''

అంటూ ఆమె ప్రక్కకు వెళ్ళి ఆమె సరసనే కూర్చుంటూ ప్రతిమాలుతున్నట్టుగా అడిగాడు.

ఆమె అతని జుత్తులోనికి వ్రేళ్ళు పోనిస్తూ అంది.

"నీ అమాయకత్వానికి నాకే జాలివేస్తోంది. అందుకని నేనూ నిజం చెప్పేస్తున్నాను. ఈ 'బాస్', ఈ వలయం అంతా బోగస్. పచ్చిఅబద్ధం. మేమంతా ఒక నాటక కంపెనీకి చెందినవాళ్ళం. నా అసలుపేరు సావిత్రి. నాటకాల్లో హీరోయిన్ గా వేస్తుంటాను.

"మా ఆర్గనైజర్ స్నేహితుడు అతడి పేరు రామ్మూర్తి అనుకుంటాను. అతడువచ్చి మాకు డబ్బిచ్చాడు. సరికొత్త

నాటకం సరికొత్త పంథాలో వెయ్యాలన్నాడు. మేం ఒప్పుకున్నాం. మీ దగ్గరకు వచ్చిన అర్జునరావు, అంటే సి. ఐ. డి. వేషంలో వచ్చాడే మీ వద్దకు అతడికిగూడ వేషమే. అతడి అసలు పేరు కాళిదాసు."

వాసుదేవరావు పిడికిళ్ళు బిగించి పళ్ళు కొరుకుతున్నాడు.

"దేనికోసం ఇదంతా?" అని అరిచాడు.

"అదేమో మాకు తెలీదు. రామ్మూర్తి చెప్పిన ప్రకారం మేము మా నాటకాన్ని ఆడుతున్నాం. అంతే!"

"రామ్మూర్తి, రామ్మూర్తి. ఆం. ఆ వ్యక్తి ఇప్పుడు గుర్తుకు వచ్చాడు. ఆయనెక్కడున్నాడు?"

"ఆయన ఇంకా రెండురోజులు ఈ ఊళ్లోనే ఉంటాడట. నేషనల్ లాడ్జి, ఆరో నెంబర్ రూమ్‌లో వున్నాడట!"

"నేషనల్ లాడ్జి. ఆరో నెంబరు రూమ్!"

"అవును!"

వాసుదేవరావు గభాలున లేచి గుడ్డలు వేసుకున్నాడు.

"ఎక్కడికి?" ఆమె ఆదుర్దాగా అడిగింది.

"పనిమీద వెడుతున్నాను. నీ ఇన్ఫర్మేషన్‌కి చాలా థాంక్స్. సెలవు!" అంటూనే గబగబా బయటకు పరుగెత్తాడు.

# 10

ఆరో నెంబర్ రూమ్ముందు నిలబడి వాసుదేవరావ్ తన జేబులోంచి కాగితంపొట్లాన్ని బయటకు తీశాడు.

పిల్లి గడ్డాన్ని తన గడ్డానికి అతికించుకున్నాడు. కోర మీసాల్ని మీసాల మీద వత్తేసుకున్నాడు. నల్లటి గుడ్డదీసి కళ్ళకు గంతలు కట్టుకున్నాడు.

ఆ తర్వాత గబగబ తలుపు తట్టాడు.

రెండుసార్లు తట్టిన తర్వాత తలుపు తెరుచుకుంది.

సుడిగాలిలా తలుపు నెట్టుకుని లోపలకు జొరబడి కాలితో తలుపును నెట్టి మూసేసి చేతిలోని కత్తిని తీసి అతడి గొంతుకు ఆనించాడు.

"అరవకు! అరిచావో! ప్రాణాలు పోతాయ్!" అన్నాడు.

రామ్మూర్తి స్వతహాగా లావుపాటి వాడు. కాని గుండె ధైర్యం లేని వ్యక్తి. తన సర్వీసులో పై ఆఫీసర్లకు కాకాలు పట్టి పైకొచ్చిన వ్యక్తి. ఏనాడూ ఎవరితోనూ గట్టిగా ఘర్షణ కూడ పడి ఎరగని మనిషి. ఈ సంఘటనతో అతడి పై ప్రాణాలు పైనే పోయినయ్.

"బాబ్బాబూ! చంపకు! నీకు పుణ్యముంటుంది! డబ్బు కావాలంటే నా దగ్గరున్నదంతా ఇస్తాను!"

"ఎంత ఉన్నది? నిజం చెప్పు!"

"నా దగ్గర పదిహేను వందలుంది!"

"నాకు రెండు వేలు కావాలి!"

"బాబ్బాబూ! నా దగ్గర అంతే వుంది. అదీ నా స్నేహితుడిది."

"ఏం దొంగతనం చేసి తెచ్చావా నీ స్నేహితుడి దగ్గర?"

"అబ్బే! అదేం కాదు! ఆయన కొడుకు జులాయిగా తిరుగుతుంటే వాడికి బుద్ధి చెప్పేందుకు ఇచ్చాడు!"

"సరే! నీ చావు ఏమన్నా గాని; తే ఆ డబ్బు!"

"నన్ను వదులు! కోటు జేబులో ఉంది ఇస్తాను!"

"ఊఁ...ఆ పప్పులేం ఉడకవ్! నడు మెల్లగా" అంటూ అతని వెనకగా నిలబడి కత్తివున్న చేతిని అతని మెడచుట్టూ వేసి బిగించి ముందుకు నడిపించాడు. కోటు జేబులోంచి పదిహేను వందలూ అందుకుని దాన్ని తన జేబులో కుక్కుకున్నాడు.

"నీ స్నేహితుడి పేరేమిటి?"

"నిరంజనరావు!"

"మంగుల కంపెనీ అతడా?"

"నీకు తెలుసా?"

మాట్లాడకుండా ప్యాంట్ జేబులోంచి చిన్న సీసానుతీసి జేబు గుడ్డపై ఆ ద్రవాన్ని గుమ్మరించాడు. జేబుగుడ్డను అతడి ముక్కుకు అదిమిపట్టాడు. అతడు మత్తుగా వాలిపోయాడు బెడ్ మీద.

"గుడ్ లెసన్! లేకపోతే నాతోనే చెలగాటమా?" అంటూ చిన్న కాగితంమీద "నీ స్నేహితుడు నిరంజనరావుకు చెప్పకో ఫో!" అంటూ రాసి అతని ప్రక్కలో పడేశాడు.

కళ్ళగంతలు, గడ్డమూ, మీసమూ పీకేసి అక్కడే పారేశాడు. తలుపు తెరుచుకుని తాపీగా బయటకు నడిచాడు.

* * *

నిరంజనరావు బెడ్ మీదనుంచి లేస్తూనే తల రెండు చేతులతోను పట్టుకుని అబ్బా! నిద్రలేస్తూనే ఈ తలనొప్పి పట్టుకుందే! రేపు ఇన్ కమ్ టాక్స్ పేపర్లు ఫైల్ చెయ్యాలి. ఆ స్టేట్ మెంట్స్ అవీ దగ్గరుండి చేయించాలి అని విసుక్కుంటూ లేచి కాలకృత్యాలు తీర్చుకొని ఆఫీసుకు బయలుదేరాడు.

దోవలో ఒకరిద్దరు ఆఫీసర్లని కలిసి, వ్యాపారవిషయాలు సేల్స్ టాక్స్ వ్యవహారాలు మాట్లాడి ఆఫీసుకు వెళ్ళాడు.

అప్పటికే ఆఫీసంతా హడావిడిగావుంది. ఎవరో తరుముతున్నట్టుగా కొందరు అటూ ఇటూ తిరుగుతూ తొందరపడుతుంటే, మరికొందరు చకచకా తమ పని చేసుకుపోతున్నారు.

ఏమిటీ హడావిడి! కొంపదీసి ఇన్ కమ్ టాక్స్ వాళ్ళుగాని దాడి చెయ్యలేదు గదా? అని గాభరాగా లోపలకు వెళ్ళాడు!

తన ఆఫీస్ రూమ్ తలుపు తీసేసరికి లోపల దృశ్యం చూసి తనకళ్ళను తనే నమ్మలేకపోయాడు.

ఎదురుగా తనకొడుకు వాసుదేవరావు, బి. కాం; ఎన్నిసార్లు మందలించినా ఆఫీసు వ్యవహారాల్లో తల దూర్చటానికి ఎదురుతిరిగిన కొడుకు, ఈ రోజున తనకంటె ముందరేవచ్చి ఆఫీసులో కూర్చుని ఆఫీసు రన్ చేస్తున్నాడు. అకస్మాత్తుగా వీడికిలాంటి మంచి బుద్ధి ఎలా కలిగిందబ్బా అని విస్తుపోయాడు.

తన స్నేహితుడు రామ్మూర్తి అమలు జరిపిన పథకం తాలూకు ఫలితమేమో అనుకుంటే అదికాదు. ఇందాకనే రామ్మూర్తి త్రోవలో కారాపి తన పథకం అడ్డం తిరిగిందనీ, వాసుదేవరావు తనాడించిన నాటకం మధ్యలోనే అంతర్ధానమైనాడనీ, ఎవరో రౌడీ తనదగ్గర డబ్బు కాజేసిన వైనం మొరపెట్టుకుని లబోదిబోమన్నాడు. అతడ్ని తనే ఓదార్చి కొంత డబ్బిచ్చి పంపాడు.

"గుడ్ మార్నింగ్! డాడీ! వెల్ కమ్!" అన్నాడు వాసుదేవరావు.

అతని చుట్టూ ఎకౌంటెంట్, హెడ్ క్లర్కు, స్టెనో చుట్టూ మూగివున్నారు. అందరికీ అన్నివైపులా అతడే ఎంతో అనుభవజ్ఞుడిలా ఆదేశాలిస్తున్నాడు.

"సూర్యుడు పడమట ఉదయించడం లేదు గదా?" అన్నాడు కొడుకుని చూసి నవ్వుతూ.

వాసుదేవరావు అంతలోనే సీరియస్ అయిపోయాడు. "అడ్డమైనవాళ్ళకీ వేలకి వేలు తగలేస్తుంటే చూస్తూ ఊరుకో బుద్ధి కాలేదు. అందుకే బిజినెస్ నేనే హాండోవర్ చేసుకుందామని వచ్చేశాను," అన్నాడు.

"ఏదీ? మళ్ళీ ఇంకోసారి అను ఆ మాట?"

"ఒకసారికాదు. వెయిసార్లంటాను. అయినా నేనన్న దాంట్లో తప్పేముంది?"

నిరంజనరావు పకపక నవ్వాడు. "నీవు ఈ మాత్రం

ప్రయోజనపడిన వాళ్ళనే వేలవేలు తగలేశాను. తప్పా?''

''తప్పో, ఒప్పో నాకు తెలీదు. ఇకనుంచి అలా జరగటానికి వీల్లేదు.''

''ఒప్పుకున్నా నబ్బా. సరెండర్డ్! సరేనా! ఒరేయ్! ఏ తండ్రైనా కొడుకుముందు చిన్నతనం ఫీల్ కాడు. ఎందుకంటే తన కొడుకు గొప్పవాడు కావాలని ప్రతి తండ్రీ వాంఛిస్తాడు.''

''దెన్. విష్ మి సక్సెస్ డాడీ!''

''ఓకే! సెక్రటరీ! వెంటనే కూల్ డ్రింక్స్ తెప్పించు. మా ఇద్దరికే కాదు. మన ఆఫీసంతటికీ తెప్పించు. అది సరేరా? మరి నీ డిటెక్టివ్ లన్నీ ఏంచేస్తావ్?''

''ఓ అవా? తీరిక సమయాలలోనో, కార్లో దూర ప్రయాణం చేసేటప్పుడో కాలక్షేపం కోసం చదవనూ!''

''గుడ్! ఇప్పుడు నాకు చాలా సంతోషంగా ఉంది. ఈ శుభవార్త మీ అమ్మకుకూడా చెప్పనీ'' అంటూ రిసీవర్ అందుకున్నాడు నిరంజనరావ్.

—: ఐపోయింది :—

# అడుగడుగునా ఆపదలే!

కె. శివరామ్

టెలిఫోన్ మ్రోగింది.

డిటెక్టివ్ యువరాజ్ రిసీవర్ అందుకున్నాడు. "యస్! యువరాజ్ స్పీకింగ్!"

"మీకు ఒక రహస్యం చెప్పాలి" అన్నాడు అవలివైపు వ్యక్తి.

"ఊఁ. చెప్పండి."

"ఫోనులో చెప్పడం అంత మంచిదికాదు. కనక మీరు ఊరుకు రెండుమైళ్ళ దూరంలోగల ఒక నిర్జన ప్రదేశానికి రావాలి," అన్నదా కంఠం.

"మీరెవరు? ఇపుడు ఎక్కడ్నుంచి మాట్లాడుతున్నారు? మీరు చెప్పబోయే రహస్యం దేనికి సంబంధించినది? ప్రత్యే

కించి నాతో చెప్పడానికిగల కారణమేమిటి?" అడిగాడు యువరాజ్ గబగబా.

"నా పేరు సాబర్! నేను హోటల్ ఎంపైర్ నెంబర్ పది గదిలోనుండి మాట్లాడుతున్నాను. నేను చెప్పబోయే రహస్యం ఫలానా దానిని గురించినదని యిపుడు ఫోనులో చెప్పడానికి వీలుపడదు. మీతో చెప్పడానికి గల కారణం మీ గురించి నాకు బాగా తెలియడమే!"

"చూచాయగానైనా చెప్పగలరా?"

"చెప్పలేను."

"మీ సమీపంలో యెవరైనా వున్నారా?"

"లేరు."

"అయితే చెప్పడానికి అభ్యంతరం ఏమిటి?"

"కొందరు రౌడీలు నన్ను అనుసరిస్తున్నారు."

"రౌడీలకు, మీరు చెప్పబోవు రహస్యానికి సంబంధముందా?"

"ఆ విషయాలను మీకు ఏకాంతంగా చెప్పగలను."

యువరాజ్ అయిష్టంగానే బదులు చెప్పాడు. "అలాగే వస్తాను. ఎక్కడికి రమ్మన్నారు?"

"రెండు మైళ్ళ దూరంలోగల కాసర కొండ సమీపాన సముద్రపుటొడ్డుకు!!" చెప్పాడు సాబర్.

## 2

సిత్రన్ ఆగింది. ఆ ప్రదేశం నిర్జనంగా ఉండడమే గాక మనసుకు ఆహ్లాదం కలిగిస్తూంది.

దగ్గరలో కాసర కొండ. కొండకు ఆనుకునివున్న చిన్న అడవి. అడవిలో గల రకరకాల గుబురైన చెట్లు, పొదలు.

రివ్వున వీచే గాలి! ఆ గాలికి యెగిరెగిరి పడే టైని యువరాజ్ పాంటులోకి దోపుకున్నాడు.

అటు యిటు దృష్టిని మళ్ళించి చూచాడు యువరాజ్. యువరాజుకు చాలా దూరంలో ఒక కారుండడం కనబడింది. ఆ కారువద్దకు నడిచాడు.

అది అంబాసిడర్ కారు. ఆకు పచ్చరంగుది! నెంబరు ఎం. ఎస్. జె. 88008.

లోపల చూచాడు. ఖాళీగా వుంది. ఎవరూ లేరు. సీట్ మీద ఏదో టికెట్ కనిపించింది. దాన్ని తీసి చూసి జేబులో వేసుకున్నాడు.

సాబర్ ఎటు వెళ్ళి ఉంటాడు? హారన్ మోగిస్తే?

యువరాజ్ కారు హారన్ అదిమాడు. ఆ ప్రదేశంలో ఆ మోత హోరెత్తిపోయింది.

రెండు మూడుసార్లు హారన్ మోగించిన పిదప యువరాజ్ హారన్ మోతవిని సాబర్ వస్తాడని కారుకి ఆనుకుని సిగరెట్ కేస్ తీసి, సిగరెట్ ముట్టించుకున్నాడు.

సిగరెట్ తాగుతూ ఆ ప్రదేశాన్నంతా తిలకిస్తున్నాడు యువరాజ్.

సాబర్ ఎంత సేపటికి రాలేదు. ఏమైయ్యాడు? ఈ కారు సాబర్ దేనా? ఇంకెవరిదైనానా? సిగరెట్టు పూర్తిగా తాగడం అయింది. అప్పటికీ సాబర్ రాలేదు.

యువరాజ్ కు యేవేవో ఆలోచనలు, అనుమానాలు తల లెత్త నారంభించాయి.

కారు ప్రక్కనే చూశాడు అడుగుజాడల కోసం.

కారునుండి దిగిన నిదర్శనంగా అడుగుజాడలు కనబడినవి. తన అడుగుజాడలూ ఉన్నవి. సాబర్ అడుగుజాడలు పొద వైపుకు వెళ్ళి ఉన్నవి.

యువరాజ్ అటు నడిచాడు. అడుగుజాడలు పొదల మధ్యగుండా వెళ్తున్నవి.

ఒక పెద్ద బండరాయివద్ద కెళ్ళి ఆ అడుగుజాడలు ఆగిపోయి

వున్నై. అంటే ఆ రాయిమీద కూర్చోడానికి సాబర్ నడిచి వచ్చి ఉండాలని అనుకున్నాడు.

అయితే సాబర్ ఏడి? అక్కడా లేడు! ఎటు వెళ్ళి వుంటాడు? ఆలోచిస్తూ ఆ రాయిచుట్టూరా చూశాడు.

యువరాజ్ ఆశ్చర్యానికి అంతులేకుండా పోయింది.

అక్కడ చాలా అడుగుజాడలున్నై.

ఆ అడుగుజాడలను తిలకిస్తూ అనుసరించాడు యువరాజ్. మొత్తానికి యేదో జరిగిందని వూహించాడు. ఫలానా అని నిర్ణయించుకోకపోయినా సాబర్ని ఎవరో ఎత్తుకెళ్ళి ఉండాలని అడుగుజాడల తీరునుబట్టి అర్థం చేసుకున్నాడు.

అడుగుజాడలు నేరుగా యువరాజ్ ని సముద్రంలోకి తీసుకెళ్ళినై! యువరాజ్ ఆశ్చర్య చకితుడైపోయాడు. అక్కడ నుండి అడుగుజాడలు ఎటు వెళ్ళినవో తెల్సుకోడానికి సాధ్య పడలేదు.

సముద్రంలోకి వెళ్ళారా? లేక సముద్రపు ఒడ్డునే నడిచి వెళ్ళారా? ఒడ్డునే నడిచివెళ్ళి వుంటే అడుగుజాడలను సముద్రపు కెరటాలు మాయంచేసి వుంటాయి. జాడలు కనబడవు.

అలా ఒడ్డున కొద్దిదూరం నడిచి వెళ్ళాడు ఆలోచిస్తూ. అక్కడ "ప్రమాదం ఇక్కడ స్నానం చేయకండి. భయంకరమైన సొర చేపలు తిరుగుతూ వుంటాయి!" అని బోర్డుంది.

యువరాజ్ వళ్ళు జలదరించిపోయింది.

ఆ బోర్డు-అడుగుజాడలు, వూహిస్తే సాబర్ని సొరచేపలకు ఆహారంగా యిచ్చి వుండాలని అనుమానం కల్గింది.

సముద్రంలో నెట్టకపోతే ఆ వ్యక్తులు సాబర్ని ఎత్తుకుని నీటివద్దకు ఎందుకు వస్తారు? ఒకవేళ సముద్రంలో నుండి ఏదైనా పడవను ఎక్కారా? ఏమో. అదీ సంభవమే!

## 3

యువరాజ్ వెళ్ళిన తరువాత ఎక్స్ఛేంజికి ఫోన్ చేసి,

యువరాజ్‌కు వచ్చిన ఫోన్ కాల్ ఎక్కడిదో తెలియజేయ మని రిక్వెస్ట్ చేశాడు అసిస్టెంట్ సూరి.

హోటల్ ఎంపైర్ అని తెల్సింది.

సూరి చీటిరాసిపెట్టి ఎంపైర్‌కు బయలుదేరాడు. సాబర్ని గురించి యువరాజ్ తెల్సుకుంటాడని సూరికి తెల్సు. ఏదో రహస్యం చెప్పడానికి సాబర్ యువరాజ్‌ని కాసర కొండ వద్దకు రమ్మన్నాడంటే ఏదో విశేషం వుంటుందని సూరి అనుకున్నాడు. అందుకే సాబర్ని గురించి చాటుగా తెల్సు కోవడం మంచిదని, బయలుదేరుతూ యువరాజ్ తనకు చెప్పి వెళ్ళాడు.

సూరి వోక్స్‌వాగన్ కారు హోటల్ ఎంపైర్ ఆవరణలో ఆగింది.

కౌంటర్ వద్ద కెళ్ళి నెంబర్లున్న బోర్డువంక చూశాడు. పదవ నెంబరు గదిలోవున్న కాగితంలో 'మిస్టర్ సాబర! హాంగ్ కాంగ్' అని వుంది.

సూరికి విచిత్రమేసింది. సాబర్ హాంగ్‌కాంగ్ నుండి వచ్చినవాడా? అతనికి యువరాజ్ యెలా తెల్సింది? యువ రాజ్‌కు చెప్పబోవు రహస్యం ఏమిటి?

"నేను డిటెక్టివ్ యువరాజ్ అసిస్టెంటుని. మిస్టర్ సాబర్ గురించిన విషయాలు కావాలి," అడిగాడు సూరి.

"సాబర్, హాంగ్‌కాంగ్ నుండి విలాసయాత్రకై ఇండియా వచ్చినవాడు. ఆయనవద్ద పాస్‌పోర్టు వీసా వున్నవి" అన్నాడు కౌంటర్.

"ఆయనను గురించి మీకింకేమీ తెలియదా?"

"ఆయన యీ హోటల్‌కువచ్చి ఈరోజుతో నాలుగు రోజులే అవుతూంది. ఈనాల్గు రోజులలోను సాబర్ని గురించి నాకేమీ తెలియదు. పైగా తెల్సుకోలేదు. ఎందుకంటే ఆయన ప్రవర్తనలో అనుమానం కల్గలేదు," చెప్పాడు కౌంటర్.

"ఆయనకోసం ఎవరైనా వచ్చేవారా?"

"లేదు."

సూరి సాబర్ గదికి వెళ్ళాడు. సాబర్ వుండడని తెల్సు. కానీ... వెళ్ళి చూడడం మంచిదనిపించింది. గదిముందు నిలబడి తాళంవంక చూశాడు. తాళం వేసిలేదు.

తలుపు నెట్టి చూశాడు సూరి. లోపల గడియ వేయబడి వుంది. అంటే లోపల ఎవరో వున్నారు. ఎవరది?

కిటికీగుండా చూడబోయాడు. కర్టన్ అడ్డువుంది. చూపుడు వ్రేలితో నెట్టుతూ లోపల చూశాడు. ఎవరో వున్నారు. వున్నవాళ్ళు ఆదరాబాదరా దేనికోసమో వెదుకుతున్నారు. కొన్నివస్తువులు చెల్లా చెదరుగా పడివున్నవి.

సూరి గుండెలు వేగంగా కొట్టుకున్నై.

లోపలున్నది ముగ్గురు. ముగ్గురూ వుద్దండుల్లాగున్నారు. వాళ్ళ శరీరాలు అతిబలశాలురని చెప్పకనే చెప్తున్నై. అయినా ధైర్యంచేశాడు సూరి.

మెల్లగా తలుపుకొట్టాడు మునివ్రేళ్ళతో. నిశ్శబ్దం. మళ్ళీ తట్టాడు.

కాసేపటికి తలుపు తెరుచుకుంది. తెరుచుకున్నదే తడవు ఒకచెయ్యి మెరుపులా బయటకు రావడం, సూరి జుట్టుపట్టుకోవడం, లోపలకు లాగడం, తలుపులు మూయడం జరిగిపోయింది.

అంత క్విక్ గా వాళ్ళు వూనుకుంటారని సూరి వూహించలేదు.

సూరి శరీరాన్ని ధన్ ధన్ మని వాళ్ళపిడికిళ్ళు గుద్దుతున్నై. ఇనపగుండ్లు ఢీకొట్టుకుంటున్నట్టుంది. బాధను ఓర్చుకోలేకపోయాడు.

తన బలాన్నంతా కూడగట్టుకుని విసురుగాతిరిగాడు సూరి. ఆ విసురికి అతనిని పట్టుకున్నతని పట్టు సడలిపోయింది.

తృటిలో సూరి నిలబడి ఎదుర్కొన్నాడు.

కాని అతనిబలం వారిముందు చాల్లేదు. ఆకలిగొన్న బెబ్బులిలా చూచే చూపులు. ఒక్కసారి విరుచుకుపడి సూరిని అదిమి పట్టేశారు.

“ఎవరు నువ్వు?” గదమాయించి అడిగారు సింహ గర్జనతో.

## 4

యువరాజ్ తన సిత్రన్ కారుని హెడ్ క్వార్టర్ ముందాపాడు. క్రైమ్ బ్రాంచ్ డిటెక్టివ్ ఇన్స్పెక్టర్ని కలుసుకున్నాడు. జరిగిన విషయాలను చెప్పాడు.

“ఇంతకీ సాబర్ ఏమైవుంటాడని??” అడిగాడు ధనార్జనరావు.

“నిర్ధారించుకోలేక పోతున్నాను. చంపబడి వుండాలి. సాబర్ చంపబడివుంటె శవం దొరకడం దుర్లభం. ఎందుకంటె అక్కడ సొరచేపలు తిరగడంజాస్తి. చేపలు సాబర్ శవాన్ని మింగేసి వుండొచ్చు” అన్నాడు యువరాజ్.

“ఒకవేళ అపహరించబడి వుంటే?”

“ఏదైనా పడవలో తీసుకువెళ్ళి వుండాలి.”

“ఇంతకీ నన్నేం చేయమంటారు?” అడిగాడు ధనార్జనరావు.

“కాసరకొండవద్ద సాబర్ కారుంది. మీబలగాన్ని పంపి యింకా దర్యాప్తు చేయమనండి. సాబర్ ఎవరు? తెల్సుకోవడానికి ప్రయత్నించండి” అని చెప్పి ఇంటికి బయలుదేరాడు యువరాజ్.

యువరాజ్ యింటికిరాగానే సూరి వ్రాసినది చూచి తనలోతాను నవ్వుకున్నాడు. సూరి హోటల్ ఎంపైర్కు వెళ్ళి సాబర్ని గురించి తెల్సుకుంటాడు.

తనిప్పుడు ఏంచేయాలి? సాబర్ కారులో మాజిక్ ప్రదర్శ

నకు టికెట్ వుంది. మాజిక్ ప్రదర్శన చూడడానికే టికెట్ కొన్నాడా? లేక అక్కడేదైనా గూడుపుఠాణీ వుందా? ఆలోచించి తను ఇంద్రజాలప్రదర్శనకు వెళ్లాలని నిశ్చయించుకున్నాడు.

ప్రదర్శన చేరుకోడానికి ముందు హోటల్ ఎంపైర్‌లో సూరిని కల్సుకుని వెళ్ళాలనుకుని కారులో బయలుదేరాడు యువరాజ్.

కౌంటర్‌లో అడగ్గా సూరి వచ్చాడని తెల్సింది. పదవ నెంబరు గదికి బయలుదేరాడు.

సాబర్ గదిముందు నిలబడ్డాడు.

తలుపులు నెట్టాడు. తెరుచుకున్నవి.

లోపల ఎవరూ లేరు!!

గదంతా చిందరవందరగా వుంది. గదినంతటిని యువరాజ్ పరీక్షగా చూశాడు. ఎవరో దేనికోసమో వెదకిన సూచనలు వుండడమేగాక పోట్లాడుకున్న గుర్తులూ వున్నై.

కొంపదీసి సూరికేమైనా ప్రమాదం సంభవించిందా? ఇక్కడ ఏం జరిగి వుంటుంది?

సూరి ఏదైనా గుర్తు పెట్టాడేమో చూడాలని యువరాజ్ సాబర్ గదిని పరీక్షగా చూడడం ప్రారంభించాడు.

టేబుల్ మీద ఆరోమార్కు వుంది. మార్కుకి ఎదురుగా ఆర్ వ్రాయబడివుంది. అది సూరిపెట్టిన గుర్తేనని యువరాజ్‌కు తెల్సు.

ఆర్ అంటే యెవరు? రాడీలా? యువరాజ్ వూహకందలేదు. హోటల్ ఆవరణలో చూస్తే సూరి వోక్స్ వాగన్ కారులేదు. అంటె దుండగులను కారులోనే అనుసరించి ఉండాలని యువరాజ్ అనుకున్నాడు.

## 5

“నా స్నేహితుడొకడు ఢిల్లీనుండి వచ్చాడు. ఈ హోట

లులో బసచేసినట్లు చెప్పాడు. ఏ గదిలో వుందీ కౌంటరులో అడిగితే ఒకే పేరుగల వ్యక్తులు ఇద్దరున్నారు. ఏ నెంబరో తెలియక చూస్తున్నాను. ఈ గదికి తాళం వేయబడిలేదు. అందుకని'' నసిగాడు సూరి.

"నిజంగానా?'' ఒకడు ఉరిమాడు.

"అక్షరాలా!'' బిక్క మొఖం పెట్టాడు సూరి.

సూరిని వదిలిపెట్టి, "జాగ్రత్త! ఈ విషయం ఎవరితో నైనా చెప్పావా ఛస్తావ్!'' అన్నారు వాళ్ళు.

"మీరెవరండీ?'' అమాయకంగా అడిగాడు సూరి.

"ఎవరైతే నీకెందుకు...! రండ్రా!'' అంటూ అందరూ బయటకి వెళ్ళిపోయారు.

వాళ్ళను చూస్తూంటె రౌడీల్లాగున్నారు. వాళ్లు ఈ గదిలో దేనికోసమో వెదికివున్నారు. రహస్యానికి, వీరికి సంబంధముంది. వాళ్ళని నీడిలా వెంటాడాలని నిశ్చయించుకున్నాడు సూరి.

గబగబా బాల్ పాయింట్ కలాన్ని అందుకుని అరో మార్క్ పెట్టి ఆర్ వ్రాశాడు. యువరాజ్ వస్తే చూస్తాడని సూరికి తెల్సు.

ఆదరాబాదరా సూరి బయటకు వచ్చాడు.

ఆ ముగ్గురు ఒక కారులో ఎక్కడం చూచాడు. సూరి తన వోక్స్ వాగన్ కారెక్కి బయలుదేరాడు. వాళ్ళ కారుని దృష్టిలో పెట్టుకుని అతిజాగ్రత్తగా డ్రైవ్ చేస్తున్నాడు.

రౌడీలున్న కారుసాఫీగా వెళ్తూంది. ఆకారు యెటుతిరిగితే సూరి తనకారునికూడా అటు మళ్ళిస్తున్నాడు. ఆకారు స్పీడందుకుంది.

సూరికి అనుమానం కల్గింది. తనకారు అనుసరించడం ఆ రౌడీలు పసిగట్టి వుండాలని అనుకున్నాడు. అయినా వదలి

పెట్టలేదు.

చాలాదూరంలో పొగలు కనబడినవి. పొగల చుట్టూజనం గుంపుగా చేరివున్నారు.

రాడీలున్న కారు వేగంగాపోతూ జనాన్ని దాటుకుని అవైపుకు వెళ్ళిపోయింది. సూరి కారు జనాన్ని చేరుకుంది.

నడిరోడ్డుమీద ఒకకారు తగులబడి పోతూంది. సూరి ఆదరాబాదరా దిగాడు. తగులబడే కారుని చూచాడు.

అది అంబాసిడర్ కారు. అకుపచ్చరంగు, ఎం. ఎస్. వై 88008!!

ఎవరిదాకారు? ఎందుకు తగులబడుతూంది? గుంపులో ఒకర్ని ప్రశ్నించాడు సూరి.

“ఏమోనండి! అకారుఎవరిదైంది తెలియదు. అది ఎలాతగుల బడుతూందో తెలియదు.తగుల బడుతూంటే. చూస్తున్నాం” అన్నాడొకడు

సూరి ఇంకా మఱి యిద్దర్ని ప్రశ్నించి చూశాడు. అది ఎలా తగలబడుతూందో ఎవరికీ తెలియదు. కారులో ఎవరూ లేరు. ఖాళీకారు మండిపోతూంది. సూరి ఆశ్చర్యానికి అంతు లేకుండా పోయింది

జనం లేనపుడు కారులోనుండి దిగిపోతూ కారుని తగుల బెట్టడం సులభమే! అయితే ఆపని ఎవరు చేశారు? కారుని తగులబెట్టవలసిన అవసరం ఎందుకొచ్చింది?

ఆ సమయానికి అక్కడికి యువరాజ్ వున్న సిత్రన్ కారొచ్చి ఆగింది.

గబగబా సూరి యువరాజ్ ని చేరుకున్నాడు. జరిగినది చకచకా చెప్పాడు.

మండిపోయే కారుని చూడగానే యువరాజ్ ఆశ్చర్యానికి అంతులేకుండా పోయింది. అది సాబర్ కారు!!

యువరాజ్ కారులోవున్న ట్రాన్సిస్టర్ టెలిఫోన్ ని

అందుకని ధనార్జనరావుకు ఫోన్ చేశాడు.

"మిస్టర్ ధనార్జనరావ్! మీ పోలీసులు కాసరకొండవద్ద ఏమైనా విషయాలు తెల్సుకున్నారా?" అడిగాడు.

"అక్కడ మీరు చెప్పినట్టు కారులేదు. మరేవిధమైన అనుమానాస్పద విషయాలు లభించలేదు," అన్నాడు ధనార్జనరావు.

"సాబర్ కారు యిక్కడే తగులబడి పోతూంది..."

"మైగాడ్! యిప్పుడే వస్తున్నాను."

"ఏమిటిసార్! విచిత్రంగావుంది" అన్నాడు సూరి.

"అవును సూరీ, ఈకారు సాబర్ది. కాసరకొండవద్ద వుడడం నాకళ్ళారా నేను చూశాను. ఇక్కడికెలావచ్చింది?"

"దుండగులే తెచ్చివుంటారు."

"నిజం!"

"సాబర్ ఇండియాకువచ్చి నాల్రోజులే అవుతూంది. అటువంటతనికి కారు ఎలా వచ్చింది?" అన్నాడు సూరి.

"హోటల్ ఎంపైర్కు వచ్చి నాల్రోజు లవుతూంది. సాబర్ ఇంతకుముందు ఎక్కడైనా వున్నాడేమో?" అన్నాడు యువరాజ్.

"అదీ సంభవమే. దానిని గురించి నేను తెల్సుకోలేదు."

"ఫరవాలేదు. నువ్వు యీ కారు ఎవరిదైంది ఆరాతీయ్. నువ్వన్నట్టు సాబర్ ఇండియాకు వచ్చి నాల్రోజులే అయితే ఈకారుని అతనికి స్నేహితు లెవరైనా యిచ్చివుండాలి. స్వంతమైనదైతే సాబర్ ఇండియాలో చాల్రోజులనుండి వుండాలి. సాబర్కు ఏదో రహస్యం తెల్సు. ఆ రహస్యాన్ని తెల్సుకోడానికి ఎవరో గట్టిగా ప్రయత్నిస్తున్నారు. సూరీ మాజిక్షోకు టైం అయింది. వెళ్తున్నాను. ధనార్జనరావు రాగానే జరగవల్సిన పనులు చూడు" అంటూ యువరాజ్ కారెక్కాడు.

యువరాజ్ తన సిత్రన్ కారుని మాజిక్ షో జరుగు స్థలంవద్ద ఆపాడు.

అక్కడ రకరకాల కార్లు అనేకం ఆగివున్నవి.

లోపల పిన్నలు, పెద్దలు, యువకులు, యువతులు, స్త్రీ పురుషులు బాగా రద్దీగా వున్నారు. యువరాజ్ తనసీటులో కూర్చున్నాడు.

ప్రదర్శన ప్రారంభమైంది.

వారంట్ ని పరీక్షగా చూశాడు యువరాజ్. ముప్పైఏళ్ళకు మించని వయసు. పొడుగుకు తగినలావు. తెల్లటి శరీరం. బూడిదరంగు వెంట్రుకలు. పిల్లికళ్ళు. లావుగావున్న ముక్కు. దళసరి పెదాలు.

వారంట్ తన ఇంద్రజాల ప్రదర్శనను కొనసాగించాడు. ఒకమనిషి తల నఱకడం, నఱికిన తలను అందరికీ చూపడం ఆశ్యాద్భుతంగా వుంది.

తరువాత ఒక గ్లాసునుండి ఆవైపునుండి ఈవైపుకు అవలీలగా రావడం, మనిషిని మాయం చేయడం. అతని పనులు అత్యంత అద్భుతంగా వున్నై.

యువరాజ్ ఆశ్చర్య చకితుడై తననితాను మఱచిపోయి ప్రదర్శనను తిలకిస్తున్నాడు. ప్రేక్షకులమధ్య నిశ్శబ్దం తాండవమాడుతోంది. వారంట్ చూపే ఇంద్రజాలం గగుర్పాటు కల్గుతూంది.

ఒకజాయిని పందిగా మార్చాడు. పందిని ఏనుగుగా చేశాడు. ఏనుగు ఘీంకరిస్తూ తన తొండమును అటుయిటు ఆడిస్తోంది. ప్రేక్షకులు వూపిరి వుగ్గబట్టి చూస్తున్నారు.

హఠాత్తుగా ఏనుగు మాయమయింది. ఆ చోట రాయి వుంది. అతనిలోని విద్యను యువరాజ్ కొనియాడకుండా వుండలేకపోయాడు.

క్లాప్స్ దద్దరిల్లిపోతూంది. యువరాజ్ చేతులు తట్టకుండా

వుండలేకపోయాడు. ఇంకా వింత వింతగా వారంట్ తన విద్యలను ప్రదర్శించాడు. ప్రదర్శన ముగిసింది. అందరూ తమతమ యిళ్ళకు వెళ్ళు సందడిలో పడిపోయివున్నారు.

యువరాజ్ వారంట్ వున్న గదివైపు బయలుదేరాడు.

అక్కడున్న ప్రజను చూచి ఆశ్చర్యపోయాడు. దాదాపు నలభైమంది దాకా వున్నారు. అందరూ వారంటును దర్శించి అభినందనలు తెలుపాలనుకున్నవారు! కొందరు ఆటోగ్రాఫ్ తీసుకోవాలని కాచుకుని వున్నారు. అక్కడున్నవారే గాక యింకా చాలామందివచ్చి గుమిగూడుతున్నారు. అక్కడున్న వారంతా నిలబడి వారంట్ రాకకై ఎదురుచూస్తున్నారు.

వారంట్ పెద్దగా విష్ చేస్తూ వచ్చాడు. అతడ్ని యువరాజ్ నఖశిఖపర్యంతము చూశాడు. ఉత్సాహం పుట్టిపడే చూపులు. చురుకుదనం గల శరీరం. మనసు విప్పి నవ్వుతూ కొందరికి షేక్ హాండ్ ఇస్తూ వస్తున్నాడు. కొందరికి ఆటోగ్రాఫ్‌లో సంతకం పెట్టున్నాడు.

వారంట్ సంతకం పెట్టేటప్పుడు ఎవరో ఒకతను అతని ప్రక్కగా వెళ్ళి నిలబడ్డాడు. అతను బ్రౌన్ సూటింగులో వున్నాడు.

బ్రౌన్ సూటతను వారంట్ చెవులో ఏదో చెప్పడం యువరాజ్ గమనించాడు. యువరాజ్ కంక చూశాడతను. యువరాజ్ గుండెలు ఝల్లుమన్నవి.

అంతమందిలో బ్రౌన్ సూటతను తనని ఎందుకు చూస్తున్నాడు.

వారంట్ కూడా యువరాజ్‌ని ఎగాదిగా చూశాడు. యువరాజ్ అనుమానం ధృఢపడిపోయింది. దాదాపు యాభైమంది జనంలో తనని గుర్తుగా చూస్తున్నారంటే విశేషం ఉంటుంది. తను తెల్సుకోవాలి.

అక్కడున్న వారందరికీ షేక్ హాండ్ ఇస్తూ పరామర్శిస్తూ

వారంట్ యువరాజ్ వద్ద కొచ్చాడు. యువరాజ్ అభినందిస్తూ వారంట్ కు చెయ్యినందించాడు.

"మీ రెవరు?" అడిగాడు వారంట్.

"యువరాజ్?"

"ప్రయివేట్ డిటెక్టివ్??"

"యస్!"

"నన్ను అభినందించడానికి వచ్చినందుకు థాంక్స్!" అంటూ వారంట్ చేతులు కలిపాడు.

"మీతో ఏకాంతంగా మాట్లాడాలి," అన్నాడు యువరాజ్.

"చూశారా ఎందరున్నారో...!ఇపుడు వీలుపడదు" వినయంగా చెప్పాడు వారంట్.

"ఎప్పుడు కల్సుకోమంటారు."

"మూడు రోజుల తరువాత రండి," అంటూ వారంట్ మిగతా వాళ్ళని పలకరిస్తూ వెళ్ళాడు.

ఇక అక్కడుండీ లాభంలేదు. మూడు రోజుల వరకు గడువు ఎందుకు చెప్పాడో యువరాజుకు అర్థంకాలేదు. ఇంకెక్కడైనా ప్రదర్శన యివ్వవల్సి వుందా? ఏమో?

యువరాజ్ చకచకా బయటకు వచ్చాడు. చెవర్ లెట్ కారాగివుంది. ఆ కారుని చూడగానే వారంట్ దై ఉంటుందని వూహించాడు. కారు డ్రైవర్ అక్కడే వున్నాడు. డ్రైవర్ని పలకరించాడు యువరాజ్.

"డ్రైవర్ మీ వారంటుకి వివాహమైందా?" ప్రశ్నించాడు యువరాజ్.

"అయింది. కానీ మూడు ఘంటలకే విడాకులు యిచ్చేశాడు," చెప్పాడు డ్రైవర్.

"ఎందుకు?" ఆశ్చర్యంగా అడిగాడు యువరాజ్.

"నాకు తెలియదు సార్! వారంటుని పెళ్ళాడి, వెంటనే

విడాకులిచ్చింది సోనియా. ఎందుకో సోనియాను అడిగితే తెలియవచ్చు," అన్నాడు డ్రైవర్.

"సోనియా అడ్రస్ నీకు తెల్సా?"

"అం తెల్సు. నెంబరు డెబ్భై, బహదూర్ స్ట్రీట్!"

యువరాజ్ యింకేదో అడగబోయాడు. అక్కడికి మూకుమ్మడిగా జనం విరుచుకు పడ్డారు. జనాన్ని అదుపులో పెట్టడానికి, పోలీసులు ఇతర సిబ్బంది తంటాలు పడడంతో ఆ ప్రదేశమంతా గందరగోళం అయిపోయింది. ఇక లాభం లేదనుకుని యువరాజ్ బయలుదేరాడు.

# 6

"కారు సంగతి ఏమైంది?" అడిగాడు యువరాజ్.

"ఆ కారు అదే హోటలులో ఉంటున్న గుప్తా అనే అతను ఇచ్చివున్నాడు. సాబర్ అడిగాడట. గుప్తా ఇచ్చాడు. కారు గుప్తాదేనని ట్రాఫిక్ అండ్ లైసెన్సింగ్ డిపార్టుమెంటులో తేలింది," అన్నాడు.

"సాబర్ గురించి గుప్తా ఏదైనా చెప్పాడా?"

"అత్యవసరమైన చోటుకి వెళ్ళాలని, టాక్సీలో వెళ్ళడం మంచిదికాదని, కారు అడిగినట్టు గుప్తా చెప్పాడు. అంతే... సాబర్ గురించి మరేమీ చెప్పలేకపోయాడు," అన్నాడు సూరి.

"సాబర్ ఎవరైంది తేలిందా?"

"విలాస యాత్రికుడిగా హాంగ్ కాంగ్ నుండి వచ్చివున్నట్టు దర్యాప్తు మూలంగా తేలింది."

"కాసర కొండవద్ద మరేవైనా విషయాలు తెల్సాయా?"

"లేదు. కానీ అవైపు సముద్రంలో ఒక మోటర్ బోట్ తిరుగాడుతూ ఉండడానికి ప్రత్యక్షసాక్ష్యాలు లభించాయి."

"ఆ బోట్ ని గురించి ఏవైనా...??"

"ధనార్జనరావు ప్రయత్నించాడు గానీ లాభంలేక

పోయింది. బోట్ ఏ యితర దేశాలకో వెళ్ళి ఉండాలని ధనార్జనరావు అనుమాన పడుతున్నాడు.''

''కారు సాబర్‌ది కాదని తెల్సి ఎందుకు తగుల బెట్టారు? గుప్తాకు యేదైనా సంబంధముందా? గుప్తా ఎవరైంది తెల్సు కున్నావా?'' అడిగాడు యువరాజ్.

''గుప్తా బెంగుళూరు నుండి వచ్చినవాడు. పెద్ద టింబర్ వర్తకుడు.''

''విమానాశ్రయంలో సాబర్ని గురించి విచారించావా?''

''ఆఁ... విలాస యాత్రికుడని తేలింది.''

''వీసాలో ఎన్ని రోజులుంది?''

''రెండు నెలలు.''

''సూరీ! నువ్వు హాంగ్ కాంగ్ వెళ్ళవలసి ఉంటుంది. హాంగ్ కాంగ్ వెళ్ళి సాబర్ గురించి పూర్తి ఘోగట్టా సేక రించుకు రావల్సి ఉంటుంది. వెళ్ళి రాగలవా?''

''రాగలను. మీరు?''

''నేను ఈ సోనియా గురించి, వారంట్‌ను గురించి తెల్సు కుంటాను. సాబర్ చెప్పబోయిన రహస్యమేమిటో వూహాకూ అందడంలేదు. సోనియా యింటికి వెళ్ళివుండే వాడ్ని. ఇంత అర్ధరాత్రిలో వెళ్ళడం యిష్టంలేక వచ్చాను.

''సాబర్ మనకేదో రహస్యం చెప్పడానికి గుప్తా కారులో వచ్చాడు. సాబర్ గదిని రౌడీలు వెదికి వున్నారు. గుప్తాకారు కాసరకొండవద్దనుండి ఎవరో తెచ్చి నగరంలో తగుల బెట్టు కున్నారు. సాబర్ కారులో మాజిక్ షో టికెట్ పడివుంది. వారంట్ సోనియాను వివాహమాడిన మూడుగంటలకే విడాకులు యిచ్చివున్నాడు. ఇవి జరిగిన విషయాలు. ఈ విష యాలను పెట్టుకుని ఏమి ఆలోచించినా అంతుచిక్కడంలేదు. అందుకే నువ్వు హాంగ్ కాంగ్ వెళ్ళడం వుచితమనిపించింది. సాబర్ ఎవరైంది తెలిస్తే మన దర్యాప్తు ముందుకు సాగు

తుంది."

"అలాగేసార్! వెళ్ళివస్తాను"అంటూ సూరి ఏరోడ్రోంకు ఫోన్ చేసాడు.

యువరాజ్ ఆలోచనలలో పడిపోయాడు.

# 7

తెల్లవారింది.

డిటెక్టివ్ లిద్దరూ డ్రెస్ చేసుకున్నారు. సూరి తన ప్రయాణానికి అవసరమైన దుస్తులను సూట్ కేసులో పెట్టుకుని సిద్ధమయ్యాడు. ఇద్దరూ బయటవచ్చి సిట్రన్ కారెక్కారు.

"సూరీ! మన యీ కేసుకు క్లయింట్ లేడు. ఖర్చులన్నీ మనవే! ఇప్పుడు నువ్వు హాంగ్ కాంగ్ వెళ్తున్నావు. అతి జాగ్రత్తగా మెలగవల్సి వస్తుంది. హాంగ్ కాంగ్ లో నేరాలు అధికం! దుష్టులు, దుర్మార్గులు జాస్తి. అక్కడ హత్యలు చేయడం గానీ, దౌర్జన్యం చేయడంగానీ సర్వసాధారణం. ఎవర్నీ నమ్మకు. నిన్ను ఒంటరిగా పంపడం నాకు బాధగానే వుంది. బికేర్ ఫుల్!" అని హెచ్చరించాడు యువరాజ్.

"యస్ సార్! అక్కడ సాబర్ని గురించి తెల్సుకోగానే వెంటనే తిరుగ ముఖం పట్టాను," అన్నాడు సూరి.

సిట్రన్ విమానాశ్రయం చేరుకుంది. సూరి, యువరాజ్ కళ్ళల్లోకి చూస్తూ వీడ్కోలు అందుకున్నాడు.

యువరాజ్ తన సిట్రన్ కారుని మళ్ళించాడు.

సిట్రన్ నెం 70, బహదూర్ స్ట్రీట్ లో ఆగింది.

యువరాజ్ దిగి సోనియా ఇంటిని చూశాడు. చాలా చిన్న ఇల్లు. పాతది కూడాను.

లోపలవున్న సోనియా అప్రయత్నంగా యువరాజ్ ని చూసి, "ఎవరండి? ఎవరు కావాలి?" అడిగింది గౌరవంగా.

సోనియాను చూచి చూడగానే ఆంగ్లో ఇండియన్ అని

అనుకున్నాడు. తెల్లటి దేహచ్ఛాయ. జామపండులాగున్న బుగ్గలు. రంగు పూసుకున్న పెదాలు. తీర్చి దిద్దిన కనుబొమలు. జేగురురంగులోవున్న కత్తిరించిన జుట్టు. చెవులకు రింగులు. గులాబీరంగు మెడ. ఎత్తైన వక్షస్థలం. సన్నటి నడుం. హైహీల్స్ చెప్పులు. ఎడం చేతికి రిస్ట్‌వాచ్. గోళ్ళకు రంగు. మొత్తానికి మిరుమిట్లు గొల్పు అందం.

“మిస్ సోనియా...??”

“యస్ కమిన్...” అన్నది సోనియా. ఆమె స్వరంలో తియ్యదనం పలికింది.

యువరాజ్ లోపల ప్రవేశించాడు. చిన్న ఇల్లైనా చక్కగా పొందికగా డెకరేట్ చేసిన కొద్దిపాటి ఫర్నీచర్. గోడలకు ఏసుక్రీస్తు పటాలు వ్రేలాడుతున్నై.

“సిడౌన్!” అంది సోనియా.

యువరాజ్ కుర్చీలో కూర్చున్నాడు.

“టీ ఆర్ కాఫీ?” అడిగింది సోనియా.

తను ఎవరైంది తెల్సుకోకనే, తను ఎందుకు వచ్చింది అడగకనే మర్యాద యివ్వడం ఆశ్చర్యం కలగలేదు. ఎందుకంటె ఆ సమయం ఉదయం!!

“టీ యివ్వండి చాలు,” అన్నాడు యువరాజ్.

“ఓ. కె. అలాగే” నవ్వుతూ కిచెన్ రూమ్‌లోకి వెళ్ళింది. రెండు నిముషాల్లో టీతో ప్రత్యక్షమైంది. ట్రేలో రెండు కప్పులున్నై. ట్రేని టీపాయ్‌మీద వుంచింది. యువరాజ్‌కు ఒకటి అందించింది. తను ఒకటి తీసుకుని సిప్ చేసింది సోనియా. యువరాజ్ కూడా టీని చప్పరించాడు. చప్పరిస్తూ సోనియా అందాన్ని చూస్తున్నాడు.

సోనియా టీని తాగుతూనే “నాతో ఏం పని? ఎందుకు వచ్చారు? మీ రెవరు?” అడిగింది.

యువరాజ్ ఆమెను అడగడానికి టీని గడగడ తాగే శాడు. కప్పుని టీపాయ్ మీదుంచుతూ, "నేను డిటెక్టివ్ యువరా..." పూర్తిగా చెప్పేలోపునే అతను కుర్చీలో తల వాల్చేశాడు.

సోనియా యువరాజ్ తలపట్టుకుని అటుయిటు ఆడించి చూచింది. స్పృహ పోయిందని నమ్మకం కుదిరిన మీదట తన రెండు చేతులతో చప్పట్లు కొట్టింది.

కిచెన్ రూములో దాగి వుండిన ఇద్దరు వ్యక్తులు యువ రాజు కిరువైపులా వచ్చి నిలబడ్డారు.

"కమాన్! క్విక్," అరిచింది అదిరే పెదాలను అనుపులో పెట్టుకుంటూ సోనియా.

ఇద్దరిలో ఒకడు కిచెన్ రూమ్‌లో కెళ్ళాడు. అక్కడ ఒక పెద్ద పెట్టెవుంది. ఆ పెట్టె బలంగావుంది. చెక్కతో తయారు చేయబడినదైనా ఇనుప చట్రాలతో స్ట్రాంగ్ గా వుంది. ఆ పెట్టెను అతను బలవంతంగా యువరాజ్ వద్దకు తెచ్చాడు.

పెట్టెను తెరచాడు. ఇద్దరూ కల్సి యువరాజ్‌ని ఆ పెట్టెలో వేశారు. పెట్టె మూతవేసి, పెద్ద తాళం కప్పను తగిలించారు. ఒకడు బయటకు వెళ్ళి నిలబడ్డాడు.

నిముషంలో ఒక స్టుడిబేకర్ కారొచ్చి ఆగింది. ఆ కారు డ్రైవర్ దిగి గబగబ సోనియా ఇంట్లోకి వచ్చాడు. ముగ్గురూ కల్సి యువరాజ్ వున్న పెట్టెను ఎత్తుకొన్నారు.

ఆ పెట్టెను తీసుకొచ్చి స్టుడిబేకర్ కారు డిక్కీలోకి ఎక్కించారు. ముగ్గురూ కారులో ఎక్కి కూర్చోగానే కారు బయలుదేరింది.

సోనియా ఆ కారు వెళ్ళేంతవరకు ఇంట్లోనేవుంది. వాళ్లు వెళ్ళగానే యువరాజ్ సిట్రన్ కారును తీసుకెళ్ళి ఒక నిర్జన ప్రదేశంలో వదిలి వచ్చింది.

# 8

విమానాశ్రయంలో సూరి ఎంక్వైరీవైపు అడుగులు వేస్తున్నాడు.

ఆ సమయంలో సూరికి 'కెవ్వు' మంటూ ఒక గొంతు వినబడింది. ఆ గొంతు అపాయంలో వున్నప్పుడు అరచినట్టుంది.

సూరి కంగారుగా తిరిగి చూశాడు. ఏమీ కనబడలేదు. మళ్ళీవినబడింది. నోరుని నొక్కేటపుడు మూల్గినట్టు వినబడింది.

సూరి ఆదరాబాదరా బయటకు వచ్చాడు. యువరాజ్ సిత్రన్ స్పీడందుకుని వెళ్తూంది. కారు పార్కింగ్‌లో ఒక కారు ఆగివుంది. ఆ కారులో ఎవడో ఒక యువతిని వెనుక సీటులో నొక్కిపెట్టున్నాడు. ఆ యువతి కాళ్ళు డోర్ గుండా బయటకువచ్చి గిజగిజ తన్నుకుంటున్నై.

సూరి గుండెలు అదిరాయి. ఎంత ధైర్యం! ఇంత పబ్లిక్ ప్రదేశంలో... మెగాడ్, "శేయ్" అరుస్తూ కారుని సమీపించాడు సూరి. "ఏమిటీ అక్రమం?" అన్నాడు క్రోధంగా.

"నీ కెందుకు? బుద్ధిగా వెళ్ళు" కోపంగా కారులో వున్నతను చెప్పాడు.

సూరి కోపాన్ని అణుచుకోలేకపోయాడు. యువరక్తం ఉరకలు వేసింది. పిడికిళ్ళు బిగించాడు. తటాలున డోర్ తెరచాడు.

డోర్ తెరవగానే సూరిని వెనకనుండి ఎవరో లోపలకు నెట్టేశారు.

సూరి విరుచుకుని లోపలున్న యువతిమీద పడిపోయాడు. సూరి పడీపడగానే ఆ యువతి ఇరికించి పట్టుకున్నది. సూరి లేవలేకపోయాడు.

ఆ యువతి మెత్తటి శరీరం, సెంటు వాసన గుప్పుమంది.

అప్పటికే సూరి తలమీద బరువుగా యేదో పడింది. కప్పగా ఆ యువతిమీద అలాగే వాలిపోయాడు.

ఆ సంఘటనను అక్కడెవరూ తిలకించలేదు. అందుకు అవకాశం లేకపోయింది.

# 9

స్టుడిబేకర్ కారు సుమారు రెండు గంటలసేపు ప్రయాణించి, కాసర కొండను దాటుకుని ఓ మైలుదూరం వరకు వెళ్ళింది. ఒక నిర్జన ప్రదేశంలో ఆగింది.

కొండల మధ్యకు సముద్రతీరం చొచ్చుకు వచ్చివుంది. రహస్య ప్రదేశంలో ఒక మోటర్‌బోట్ ఆగివుంది.

కారులో వచ్చిన ముగ్గురు వ్యక్తులు యువరాజ్ వున్న పెట్టెను అతిశ్రమమీద, జాగ్రత్తగా రాళ్ళమధ్యగుండా, పొదలగుండా బోట్ వరకు మోసుకెళ్ళారు.

పెట్టెను బోటులోకి ఎక్కించారు.

బోట్‌లోకి ఇద్దరు వ్యక్తులు ఎక్కారు.

మూడవ వ్యక్తి స్టూడిబేకర్ వద్ద కొచ్చి కారుని కదిలించాడు.

బోట్ సముద్రంలోకి ఉరికింది. వేగం అందుకుంది. హోరు పెట్టుకుంటూ, సముద్రపు అలలను చీల్చుకుంటూ ఒక గంటసేపు ప్రయాణం కొనసాగించింది. చాలా దూరం వెళ్ళిపోయింది.

"రేయ్ బోటుని ఆపరా!" అన్నాడొకడు.

బోటుని ఆపాడు ఇంకొకడు. ఇద్దరూ కల్సి చుట్టూరా చూశారు. ఎటు చూసినా జలమయం. కెరటాలు. క్రిందకు నెట్టేసేంతటి గాలి! ఆ ఇద్దరు యువరాజ్ వున్న పెట్టెను పట్టుకున్నారు. మెల్లగా సముద్రంలోకి నెట్టేశారు. ఆ పెట్టె దబ్బున నీటిలో పడింది. మెల్లగా సముద్ర గర్భంలోకి జారు

ఉంటూంది. ఆ ఇద్దరూ తృప్తిగా గాలి పీల్చుకున్నారు.

బోటుని స్టార్టుచేశారు. పెట్టె సముద్రం అడుగుకి కొన్ని మైళ్ళలోతుకు వెళ్ళసాగింది.

# 10

సూరి కళ్ళు తెరిచాడు.

తల పగిలిపోయేటంతటి బాధ! వళ్ళంతా నీరసంగా వుంది. తలను తడిమి చూసుకున్నాడు. బొప్పి కట్టివుంది. లేచి కూర్చుని జరిగిందేమిటో గుర్తు తెచ్చుకున్నాడు. ఆశ్చర్యం, భయం కడకడలాడించాయి.

తనని హాంగ్ కాంగ్ వెళ్ళకుండా దుర్మార్గులెవరో అటకాయించి వున్నారు. ఎందుకు? ఏదో బలమైన కారణం వుండి ఉంటుంది. తను హాంగ్ కాంగ్ వెళ్ళితే శత్రువుల ఉనికి తెలుస్తుందని భయపడి ఉండాలి.

తను హాంగ్ కాంగ్ వెళ్ళనున్నట్లు శత్రువులకు యెలా తెల్సింది? తన సంగతి తెల్సుకున్న దుండగులు యువరాజ్ ని గురించి తెల్సుకుని ఉండరా? యువరాజుకు ఏదైనా ప్రమాదం సంభవించి ఉంటుందా?

తమ పరిశోధనలలో తెల్సుకున్నదేమీ లేదు., సాబర్ని గురించి తెల్సుకోడానికి ప్రయత్నం ప్రారంభమైంది. అంత మాత్రానికే శత్రువులు ఎందుకు భయపడుతున్నారు?

ఆ చోటునుండి బయట పడడానికి ఏదైనా మార్గం గోచరిస్తుందేమో వెతకడం ప్రారంభించాడు.

ఆ గది చాలా బందోబస్తుగా ఉంది. తలుపులు, కిటికీలు బలంగావున్నై. తనని ఎందుకు బంధించారో అంతుపట్టడం లేదు. తన మూలంగా శత్రువులకేదైనా లాభం ఉందా?

కొన్ని గంటలు గడిచినై.

తలుపు తెఱచే చప్పుడు వినబడింది. సూరి శరీరం జలద

రించింది.

ఒకతను లోపలకు వచ్చాడు. అతని వెనకాలే మరి ఇద్దరు వచ్చారు.

ముగ్గురూ దున్నల్లాగున్నారు. కరడుగట్టిన శరీరాలు. గళ్ళ లుంగీలు. రంగుబనియన్లు. వెడల్పాగావున్న బెల్టులు. బెల్టుల్లో కత్తులు. భారీ శరీరాలు. కండలు తిరిగిన వళ్ళు. నిప్పులు గ్రక్కే చూపులు. పేరుమోసిన రౌడీల్లాగున్న ఆకారాలు.

వారి రూపాలు సూరికి భయంగొల్పినాయి. వారిని ఎగాదిగా చూశాడు. ఇంతలో ఇంకో అతను వచ్చాడు.

అతను టిప్ టాప్ గా డ్రస్ చేసుకుని వున్నాడు. ఇస్త్రీ మడతలు చెరగని దుస్తులు. ఫాషన్ గా దువ్వుకున్న వెంట్రుకలు. టాయ్ లెట్ చేసుకున్న ముఖం. పొడవుకు తగిన లావు. లావుకు తగిన గంభీరం, ఠీవి, దర్పం వుట్టిపడే చూపులు.

రౌడీలు ముగ్గురూ హోటల్ ఎంపైర్ లో తనని వదలి పెట్టినవారు!!

"ఏయ్ మిస్టర్! ఎవరు నువ్వు?" అడిగాడు గంభీరంగా వున్న వ్యక్తి.

"తెలియకనే నన్నిక్కడకు తెచ్చావా?" పెడసరంగా అన్నాడు సూరి.

"అవును. తెలియకనే నిన్ను తెచ్చాను. ఇప్పుడు చెప్పు. ఎవరు నువ్వు?" అడిగాడతను.

"నీకు చెప్పడం అనవసరం" అన్నాడు సూరి కోపంగా.

అతను తన బూటుకాలితో ఈడ్చి తన్నాడు. భరించలేని బాధ! సూరి క్రిందపడి మూలిగాడు.

సూరి ఉడుకు రక్తంతో వూగిపోయాడు. మళ్ళీ తన్నడానికి అతను కాలెత్తాడు. ఆ కాలుని గురిపెట్టుకుని కాచుకునివున్న సూరి కాలు దగ్గరకగానే మెరుపులా పట్టుకోవడం

విద్యుచ్ఛక్తి వేగంతో మెలితిప్పేయడం చేశాడు.

బాధతో అతను అరుస్తూ దభేలున పడిపోయాడు.

రాడీలు ఆశ్చర్యచకితులై సూరిమీదకు ఏకకాలంలో విజృంభించారు. సూరి స్ప్రింగులా గెంతాడు. ఢీకొన్నాడు. అటువంటి రాడీలకు భయపడే స్వభావం లేదతనికి. ఎన్నో విద్యలలో వృత్తిరీత్యా శిక్షణ పొందినవాడు.

సూరి ఖడ్గమృగంలా విజృంభించాడు. తెగిన ఆనకట్టలా అతనిశక్తి పరవళ్ళు త్రొక్కింది. ముగ్గురు రాడీలూ సూరి ముందు తన్నుకలాడిపోయారు. శక్తివుంటే ప్రయోజనంలేదు. అందుకు తగిన యుక్తీ వుండాలి. ఆ గదంతా ధన్ ధన్ మని అదిరిపోతూంది.

సూరి మెలిపెట్టడం మూలంగా క్రిందపడ్డతను నెప్పితో లేవలేకపోయాడు. సూరి విజృంభణకు ఆశ్చర్యచకితుడై జేబులో చెయ్యిపెట్టి పిస్తోలు బయటకు తీశాడు. గురిపెట్ట బోతున్నాడు.

సూరి అది గమనించి ఆలస్యం చేయలేదు. ఆ వ్యక్తిమీద విరుచుకుపడిపోయాడు. సూరి భారానికి అతని గుండెలు అదిరిపోయాయి.

సూరిని వెనకనుంచి రెండు ఇనుపహస్తాలు యిరికించి పట్టేసినై. కదలలేకపోయాడు.

వెంటనే ఆ ముగ్గురు రౌడీలు తమ బెల్టులలోవున్న కత్తులను దూసి సూరిమీదకు మదపుటేనుగుల్లా పడిపోయారు.

ఇక తను బ్రతకడం కష్టం. వాళ్ళు తన శరీరాన్ని కత్తులతో తూట్లుచేస్తారు. కత్తులు దగ్గరయ్యాయి.

కళ్లుమూసుకున్నాడు సూరి.

## 11

పెట్టెలోవున్న డిటెక్టివ్ యువరాజ్ మెల్లగా కళ్ళు తెరచాడు. చీకటిగావుంది. ఏమీ కనిపించడంలేదు. కదల

బోయాడు. 'ధన్'మని తల కొట్టుకుంది. అప్పుడు గ్రహిం
చాడు తను ఒక పెట్టెలో వున్నాడని!!

కదలకుండావుండి గమనించాడు. పెట్టె అంతా చల్లగా వుంది. భయంకరమైన నిశ్శబ్దంగావుంది. పెట్టె చాలా కొద్దిగా అటుయిటు వూగడం పసిగట్టాడు యువరాజ్. అంటె??

పెట్టె క్రిందకు దిగుతూండాలి. ఎక్కడికి??

అర్థమైపోయింది. నీటిలో దిగుతూంది. నీటి అడుగుభాగమైన పూడిక (నేల) తగిలేవరకు పెట్టె దిగుతుంది. తన అదృష్టం పెట్టెలోకి నీళ్ళు జొరబడలేదు. ఈ పెట్టెను బావిలో పడేశారా? ఏదైనా చెరువులో పడవేశారా? ఏదైనా కాల్వలోకి నెట్టారా?

కాలువలోకైతే పెట్టె దొర్లివుండాలి. లేదా పొర్లి వుండాలి. అలా జరగలేదు. కనక కాలువకాదు. బావిలోనా? బావిలో అయినా, చెరువులో అయినా పెట్టె యింతసేపు దిగివుండదు. ఈపాటికి నేల చేరుకుని వుండాలి. మరి?

సముద్రమా?? యువరాజ్ గుండెలు ఝల్లుమన్నవి.

ఆ పెట్టెను మింగేయగల చేపలు, ఇతర సముద్ర జంతువులు వుంటాయి. అలా మింగితే తను వాటి శరీరంలో జీర్ణంచుకుపోతాడు. ఏనుగును సైతము అమాంతం మింగేయగల చేపలున్నాయని యువరాజుకు తెల్సు.

పెట్టెలోవున్న యువరాజుకు చెమటలు పట్టేసినై. పైగా పెట్టెలో వుండిన ఆక్సిజన్ అయిపోయింది కాబోలు, వూపిరి తీసుకుంటూంటే శ్వాసకోశాలు యిబ్బందికి గురవడంస్పష్టంగా తెలుస్తూంది. గడగడలాడిపోయాడు.

పెట్టెమూత తెరవడానికి తన బలాన్నంతా వుపయోగించాడు. ససేమిరా కదలలేదు.

కాళ్ళతో చేతులతో ఆ పెట్టెను బాదితే, పెట్టె పగిలి

నీళ్లు జొరబడతాయి. నీళ్లు చేరితే వెంటనే మరణించి తీరుతాడు.

ముఖానికి పట్టిన చమటను ఎడమచేతితో తుడుచుకున్నాడు. ఆ సమయంలో చేతి వ్రేలికున్న వుంగరం గట్టిగా తగిలింది. అప్పుడు యువరాజుకు ఏదో గుర్తుకొచ్చింది. ఆదరాబాదరా వ్రేలికున్న ఉంగరాన్ని తీశాడు. కొంత ధైర్యం కల్గింది.

ఆ ఉంగరంలో మినిబాంబ్ వుంది. చాలా చిన్నదైనప్పటికి శక్తివంతమైనది. ఉంగరపురాయి ఉండవలసినచోట బాంబువున్నది. తన వృత్తిరీత్యా అటువంటి బాంబులు ఉపయోగపడతాయని దగ్గర ఉంచుకుని వున్నాడు. దాని జ్ఞాపకమే లేదు. కారణం అప్పుడు కల్గిన ప్రాణభీతి అటువంటిది.

మెల్లగా ఆ బాంబుని తీశాడు. పెట్టె పైభాగంలో అమర్చాడు.

బాంబు పేలితే పెట్టెలోవున్న తనకు ప్రమాదం సంభవించవచ్చు. ఆ బాంబు ఒకవైపుకు ఫోర్సుగా ప్రేలుతుందని తెల్సు. అయినా భీతిగానేవుంది.

బాంబుని ప్రేల్చివేశాడు.

తను గిరుక్కున బోర్లాతిరిగి పెట్టెకు అతుక్కుపోయాడు యువరాజ్. తన రెండు చెవులను గట్టిగా మూసుకున్నాడు.

"ఢాం!!"

యువరాజ్ క్షణమూ ఆలస్యం చేయలేదు. శబ్దంతో పాటు నెట్టుకుంటూ పైకిలేచాడు. పెట్టె పైభాగం పూర్తిగా నీటిలో కల్సిపోయింది. యువరాజ్ నీటిలోకి వచ్చేశాడు.

పైకి తేలడానికి చేతులను కాళ్ళను తన శక్తినంతటినీ ఉపయోగించాడు. యువరాజ్ రివ్వున పైకివస్తున్నాడు.

యువరాజ్ ఊపిరి బిగపట్టివున్నాడు. చేపలు తనని

మింగేస్తాయేమోనని భయంగావుంది. ఎంతదూరం పైకి తేలడానికి వెళ్ళాలి? పైకితేలేంతవరకు శ్వాసను బిగపట్టి వుండగలడా? కాలం గడుస్తూంది. యువరాజ్ సముద్ర గర్భంలో నుండి పైకివస్తున్నాడు.

యువరాజుకు శ్వాసను ఆపగలశక్తి క్షీణించిపోయింది. తనిక బ్రతకలేడని భయకంపితుడైపోయాడు. గాలి పీల్చని కారణంగా గుండెబాధకు గురైంది. హృదయం పగిలిపోతుందేమో నన్నంత ఎద్దడి ఏర్పడిపోయింది.

యువరాజ్ ఊపిరి బిగపట్టి ఉండలేకపోయాడు. ప్రాణాలుపోయే పరిస్థితి ఏర్పడింది. తప్పనిసరిగా కొద్దిగా సముద్రపునీటిని మింగాడు. తన యావత్శక్తినీ ఉపయోగించి పైకిరావడానికి ప్రయత్నించాడు.

గుటక వేయగానే వూపిరితిత్తులకు ఏదో శక్తి వచ్చింది. ఆ శక్తి ఉన్నంతలో పైకితేలి తీరాలి. లేనిచో మరికొన్ని గుటకలువేస్తే ప్రాణాలు పోతాయని యువరాజుకు తెల్సు.

## 12

“సార్! వైద్యనాథ అయ్యర్ స్ట్రీట్‌లో ఓరగా డిటెక్టివ్ యువరాజ్ గారి సిట్రన్ కారు ప్రొద్దుటినుండి ఆగివుంది. ఎవరూ రాలేదు” అన్నాడు బీట్ కానిస్టేబుల్.

“అక్కడంతా విచారించావా?” అన్నాడు ధనార్జనరావు కాస్త ఖంగారుగా.

“ఆఁ విచారించాను సార్. ఎవరో ఒక యువతి దిగి వెళ్ళడం కొందరు చూచినట్టు చెప్తున్నారు. కానీ ఆ యువతి ఆనవాలు చెప్పలేకపోతున్నారు,” చెప్పాడు బీట్ కాన్‌స్టేబుల్.

ధనార్జనరావుకు అయోమయం అయిపోయింది. డిటెక్టివ్‌లిద్దరూ ఏమైనట్టు? తనకు ఏ విషయమూ చెప్పలేదు. ఫోనూ

చేయలేదు. కనబడనూలేదు. కారుమాత్రమే ఆగివుందంటే యువరాజ్ ఏమైయ్యాడు? సూరి ఏమైయ్యాడు? ధనార్జన రావు గుండెలు వేగంగా కొట్టుకున్నై.

"నేనక్కడకు వస్తున్నాను" అంటూ ఫోన్ని క్లిక్ చేసి యువరాజ్ యింటికి డయల్ చేశాడు. "యువరాజైనా, సూరైనా యింట్లోవున్నారా?" అడిగాడు ధనార్జనరావు.

"సూరిగారు హాంగ్ కాంగ్ వెళ్ళడానికి యువరాజ్ గారి సిత్రన్ కారులో బయలుదేరి యిద్దరూ వెళ్లారు" అన్నాడు నౌఖరు.

"సూరి హాంకాంగ్ వెళ్లాడా?! నాతో చెప్పనేలేదు" అంటూ తిరిగి ధనార్జనరావ్ విమానాశ్రయానికి డయల్ చేశాడు.

"నేను క్రైంబ్రాంచ్ నుండి మాట్లాడుతున్నాను. ఈ ఉదయం హాంగ్ కాంగ్ వెళ్లు విమానంలో సూరి అనే వ్యక్తి ప్రయాణించాడా తెల్సుకుని చెప్పాలి," అన్నాడు ధనార్జనరావు.

"జస్ట్ వెయిట్ ఆన్ ది లైన్!" అంటూ రెండు నిముషాలాగి, "లేదు సార్! సూరి అనే వ్యక్తి ప్రయాణించలేదు. విమానం బయలుదేరే సమయానికి గిరి అనే వ్యక్తి హాంగ్ కాంగ్ వెళ్ళివున్నాడు," అన్నాడవతలి వ్యక్తి.

"బాగా తెల్సుకునే చెప్తున్నారా?"

"ఆఁ ఖచ్చితంగా, కావాలంటే మీరొచ్చి చూచుకోవచ్చు."

"ఓయస్" అంటూ ఫోన్ రిసీవర్ పెట్టేశాడు. ఆలోచనలలో పడిపోయాడు. సూరి హాంకాంగ్ ఎందుకు వెళ్ళవలసి వచ్చింది? సూరి_గిరి అని పేరు మార్చుకుని ప్రయాణించాడా? లేక సూరికి బదులు గిరి అను శత్రువులలోని వ్యక్తి ప్రయాణించాడా?

ధనార్జనరావు వైద్యనాథ అయ్యర్ వీధికి తన జీపు కారులో బయలుదేరాడు. అంతదూరానికి సిత్రన్ కనబడుతున్నది. ఆ కారుప్రక్కనే తన జీపు నాపాడు. అక్కడుండిన బీట్ కానిస్టేబుల్ అటెన్షన్‌లో నిలబడి సెల్యూట్ చేశాడు.

"ఈ కారుని యిక్కడొదిలి వెళ్ళిన యువతిని గురించి భోగట్టా సేకరించావా?"

"వీలుకాలేదు సార్!" నసిగాడు.

"ఈ చుట్టుప్రక్కల యిళ్ళల్లో విచారించావా?"

"విచారించాను సార్. ఈ వీధి నిర్మానుష్యంగా వుండడం మూలంగా కార్లోనుండి దిగిన యువతిని ఆ రెండు ఇళ్ళల్లోని వారు చూచారుగానీ సరిగా గుర్తించలేదట."

"ఊఁ... సరి ఆ జీపుని తీసుకుని నువ్వు హెడ్‌క్వార్టర్స్‌కు పద," అంటూ ధనార్జనరావు సిత్రన్ కారులోకి ఎక్కి కూర్చున్నాడు.

కారులో యువరాజ్ ఏదైనా గుర్తులు,ఆచూకీ తెలుపడానికి వదిలిపెట్టి వెళ్ళాడేమో పరీక్షించాడు. ధనార్జనరావు ఏమీ తెల్సుకోలేకపోయాడు. కారుని స్టార్టుచేశాడు. బయలుదేరింది సిత్రన్.

యువరాజ్ తనకు బాల్యస్నేహితుడేగాక, ప్రాణమిత్రుడు కూడా. తలాతోకలేని కేసులో తలదూర్చి ప్రమాదానికి గురైపోయాడు. ఇపుడు తనేం చేయాలి? యువరాజ్ ఎక్కడ ఎలావుండేది తను తెల్సుకోవడం ఎలా? ఆలోచిస్తూ ధనార్జనరావు సిత్రన్ కారుని విమానాశ్రయానికి మళ్ళించాడు.

ఎంక్వైరీలో తన హోదాని ఉపయోగించి సూరిని గురించి విచారించాడు. గిరిని వాళ్ళు వర్ణించి చెప్పారు. ఆ వర్ణన సూరికి సరిపోలేదు.

ఇంకా వివరంగా తెల్సుకొన్నాడు. మొత్తానికి సూరి

హాంగ్ కాంగ్ వెళ్ళలేదని తెల్సుకున్నాడు. సూరి ఏమై పోయాడు?

సిత్రన్ ఇక్కడకు వచ్చింది అంటె సూరిని డ్రాప్ చేసి వుంటుంది. దిగిన సూరి విమానం ఎక్కలేదు. కనక ఇక్కడే సూరికి శత్రువులకు ఘర్షణ జరిగివుండాలి. ధనార్జనరావు అలా వూహించి అక్కడ దర్యాప్తు ప్రారంభించాడు. అక్కడ ప్రతి ఒక్కర్ని ఇంటరాగేషన్ చేయడం ప్రారంభించాడు.

సూరిని ఒక కారులో బలవంతాన తీసుకెళ్ళిన సంగతి తెల్సుకున్నాడు. ఆ కారు ఎటు వెళ్ళింది? ఇక్కడనుండి యువరాజ్ ఎటు వెళ్ళాడు? ఓపిగ్గా విమానాశ్రయం నుండి విచారిస్తూ బయలుదేరాడు. మధ్యలో తన బలగానికి టెలిఫోన్ చేశాడు.

పోలీసులు ముమ్మరంగా కృషిచేశారు. చివరకు సిత్రన్ ఆగిన చోటు అయిన సోనియా యింటిని కనిపెట్టేశారు.

సోనియా యింటి తలుపులకున్న తాళం వెక్కిరించింది. ధనార్జనరావు సందేహించ లేదు. తాళాలు తీసి లోపల చూశాడు. ఖాళీగావుంది. అంతేకాదు. టు లెట్ బోర్డు తలుపులకు పైభాగాన ఉండడం చూడనందుకు నొచ్చుకున్నాడు.

సూరిని తీసుకెళ్ళిన కారు ఎటు వెళ్లిందోకూడా ఎంత ప్రయత్నించినా తెల్సుకోలేకపోయారు.

## 13

"ఆగండి!" అరిచాడు క్రిందపడ్డతను.

సూరి కళ్ళు తెరచి అతన్ని చూశాడు. ముగ్గురు రౌడీలు క్రిందపడ్డ వ్యక్తివైపు చూశారు.

"అతన్ని చంపకండి. కాసేపు బ్రతక నివ్వండి" అంటూ నోటినుండి కారిన నెత్తురును తుడుచుకుంటూ, బాధను ఓర్చుకుంటూ మూల్గుతూ, మూల్గుతూ లేచి నిలబడ్డాడు.

"ఇకనైనా చెప్పు! ఎలాగూ చావబోతావు. చావడానికి ముందు నేనడిగిన ప్రశ్నలకు జవాబులివ్వు?" ప్రాధేయపూర్వకంగా వుందతని స్వరం.

"నువ్వెవరు? నీ పేరేమిటి?" అడిగాడు సూరి.

"నా పేరు సర్దార్!" అన్నా డతను.

సూరిని పట్టుకున్న రౌడీలు ఎప్పుడెప్పుడా అని వురుముతున్నారు. సూరి శరీరంలోకి దిగబడడానికి కత్తులు సిద్ధంగా వున్నై.

"నేను చెప్పడానికిముందు నన్నెందుకు బంధించి తెచ్చావో చెప్పాలి," అన్నాడు సూరి.

"అఁ... నువ్వు హోటల్ ఎంపైర్‌లో పదవనెంబరు గదికి ఎందుకు వచ్చావు? వచ్చిన నువ్వు మా వ్యక్తులను ఎందుకు అనుసరించి వచ్చావు? సాబర్ని గురించి నీకేదైనా తెల్సునేమోనని నిన్ను బంధించవలసి వచ్చింది," అన్నాడు సర్దార్.

"నువ్వు చెప్పేది అబద్ధం! నేను విమానాశ్రయం వెళ్ళగానే సాబర్ని గురించి తెల్సుకోడానికి నేను హాంగ్ కాంగ్ వెళ్తున్నానని తెల్సుకుని బంధించావు," అన్నాడు సూరి.

"అవును. నీ బదులు నీలాటి వ్యక్తి హాంగ్ కాంగ్ వెళ్ళి వున్నాడు. వెళ్ళినతను రేపో ఎల్లుండో రావచ్చు. సాబర్ని గురించి తెల్సుకోవడంలో నీ ఇంటరెస్ట్ ఏమిటి?" అడిగాడు సర్దార్.

"నేను డిటెక్టివ్ యువరాజ్ అసిస్టెంటు సూరిని!"

"నీవు యు. యు... యువరాజ్ అసిస్టెంటువా? అయితే సాబర్ని గురించి నీకు తెల్సివుంటుంది," అన్నాడు సర్దార్ ఆశ్చర్యాన్ని అణచుకుంటూ.

"అవును తెల్సు. యువరాజ్‌కూ తెల్సు. ఇక కాసేపటిలో యిక్కడకు వస్తాడు," అన్నాడు సూరి బెదిరింపుగా.

సర్దార్ నవ్వాడు. "మీ యువరాజ్ యీ పాటికి సముద్రంలో మరణించి వుంటాడు."

సూరి గుండెలు ఝల్లుమన్నవి. మనసు కీడుని శంకించింది.

"మిస్టర్ సూరీ! యువరాజ్ మరణించాడు. మరణించిన యువరాజువు సాబర్ని గురించి ఏం తెల్సు?" అడిగాడు సర్దార్.

"ఒక రహస్యం చెప్పాడు."

"ఏమిటా రహస్యం?" ఆతృతగా, ఆశగా అడిగాడు సర్దార్.

సూరి బదులు చెప్పలేదు. మౌనంగా వుండిపోయాడు.

## 14

సముద్ర గర్భంనుండి పైకి తేలుతున్న యువరాజ్ కు ఊపిరాడటంలేదు. అప్పటికే చాలా నీళ్ళు త్రాగివేశాడు. మరో గుటక వేయబోయాడు. ఆ సమయానికి జిమ్మున పైకి వచ్చేశాడు. వేగంగా నోటితో, ముక్కుతో గాలిని పీల్చుకుని వూపిరితిత్తులనిండా నింపుకున్నాడు. అలలమీద ఎత్తెత్తి పడుతున్నాడు.

ఫ్రీగా గాలిని పీల్చుకొని శరీరానికి ఉపశమనం కల్గించాడు. తన చుట్టూతా చూశాడు. అంతా జలమయం! తీరం కనబడడంలేదు.

ఏవైపుకు యీదాలి? ఈదుతూ గట్టు చేరుకోగలడా? గట్టు చేరేంతవరకు తను ఈదగలడా? గడచిన గండం పోగా ఎదురైన గండం గడగడలాడించింది. ఎటు ఈదాలి? ఈదేటప్పుడు సొఱచేపలవాత పడతాడేమో? భయంగా వుంది.

దేదీప్యమానంగా మండుతున్న సూర్యుడు నడినెత్తిన వున్నాడు. సరిగ్గా నెత్తిమీద వుండడం మూలంగా దిక్కులు

వూహించడం అసంభవంగావుంది. సూర్యుడు ఏవైపుకు వాలుతాడు? వాలినవైపు పడమర! పశ్చిమదిశవైపు తను ఈదాలి.

తను తీరానికి ఎన్ని మైళ్ళ దూరంలో వున్నాడో? అంత దూరం యీదగలడా? దారీ తెన్నూ కానక యువరాజ్ అక్కడే ఆగి అలసట కలగని రీతిగా యీదుతూ నిలిచాడు. భయకంపితుడైవున్న యువరాజ్ చుట్టుతా చూస్తున్నాడు. ఎండ తీవ్రంగావుంది.

అలాంటి సమయంలో ఒకవైపు పొగ కనబడింది. పొగ కనబడగానే యువరాజుకు సంతోషం కల్గింది. పొగవచ్చే వైపు తీరం వుంటుందని ఆశించాడు. మళ్ళీ నిరాశ జనించింది. పొగ తీరం వుంటేనే రాదు. ఆవైపు ఏదైనా స్టీమర్ వస్తుండినా పొగ కనబడవచ్చు. పొగ కనబడిన వైపు తీరం వచ్చినా, నౌక వచ్చినా తను తన ప్రాణాలను కాపాడుకోవచ్చు అనుకుని యువరాజ్ ఆవైపు యీదడం మొదలెట్టాడు.

ఈదగా ఈదగా నౌక జెండా, తరువాత పొగ గొట్టం కనబడింది. యువరాజ్ పైకి చేతులెత్తి వూపుతూ, బిగ్గరగా కేకపెట్టాడు. కేకవేస్తూ, చేతులూపుతూ యువరాజ్ యీదుతున్నాడు.

నౌకలోని వారు బైనాక్యులర్స్‌తో చూస్తే తనని గుర్తిస్తారు. అసలు ఆ నౌకలో ఎవరు వుంటారు? శత్రువులా? మిత్రులా?

అలాగే యువరాజ్ యీదుతున్నాడు. నౌక దగ్గరవుతూంది. ఆనౌక దగ్గరకాగానే అది ఎక్సైస్ అధికారులు స్మగ్లర్స్‌కోసం గస్తీ తిరుగు నావని గుర్తించాడు యువరాజ్. ఎక్కడలేని ధైర్యం కల్గింది.

యువరాజ్ ప్రక్కకు రాగానే నౌకనుండి తాళ్ళనిచ్చెన

దింపబడింది. నిచ్చెన అందుకుని సురక్షితంగా నౌకలోకి వచ్చిపడ్డాడు యువరాజ్. యువరాజుని విచిత్రంగా చూస్తూ నౌకలోని సిబ్బంది యాశత్తూ చుట్టుముాగిపోయారు.

"ఎవరు నువ్వు? నడిసముద్రంలోకి ఎలా వూడిపడ్డావు?" అడిగాడు ఓ అధికారి ఆశ్చర్యంగా.

"నేను ప్రయివేట్ డిటెక్టివ్‌ని. నా పేరు యువరాజ్!" చెప్పాకుని అక్కడున్న అందరివంకా చూశాడు యువరాజ్.

యువరాజ్ రొప్పుతున్నాడు. శరీరం బాగా అలసిపోయి వుంది. మృత్యువు వాతనుండి దైవబలం వుండడం మూలంగా బ్రతికినవాడు.

"ప్లీజ్! నాకు ముందు పొడిగుడ్డలు ఏవైనా వుంటే యివ్వండి. తరువాత కాఫీయో, టీయో వేడిగా నాగొంతులో పోయండి," వేడుకున్నాడు.

"మీరు ప్రయివేట్ డిటెక్టివ్ యువరాజ్ అని చెప్పుకుంటున్నారు. మేమెలా నమ్మేది?" అన్నాడు ఒకఅధికారి.

యువరాజ్ విచిత్రపోతూ వారివంక చూశాడు. వారి అనుమానం అర్థమైంది.

యువరాజ్ గబగబా తన తడిసిన బట్టలలోనుండి మనీ పర్సు బయటకు తీశాడు. మనీపర్సునుండా నీళ్ళు కారుతున్నవి. దానిని అధికారికి అందించాడు. అధికారి పర్సులోని కాగితాలను పరీక్షించాడు.

"వి ఆర్ వెరీసారీ మిస్టర్ యువరాజ్! గ్లాడ్ టు మీట్ యూ," అంటూ షేక్‌హాండ్ యివ్వబోయాడు అధికారి.

"నాకొకావల్సింది షేక్‌హాండ్ కాదు. ముందు పొడి గుడ్డలు. తరువాత వేడి కాఫీ!" అన్నాడు యువరాజ్ బాధగా.

అధికారి హుకుం నౌకలో మారు మ్రోగింది.

# 15

"నేను యస్. యు. జె. మాట్లాడుతూంట!" అన్నాడు యువరాజ్.

"మైగాడ్! బ్రతికేవున్నారా... నా ప్రాణాలు కుదుట పడ్డాయి. మిమ్మల్ని పెట్టెలోపెట్టి స్టుడిబేకర్‌లో పెట్టినట్టు అనుమానించాను. స్టుడిబేకర్ కాసర కొండవైపు వెళ్ళినట్టు తెల్సుకుని కాసర కొండవద్ద గాలించి యిప్పుడే వచ్చాను" అన్నాడు ధనార్జనరావు, జరిగిన విషయాలు చెప్తూతూ.

"సూరిని గురించి ఏమైనా తెల్సుకున్నారా?"

"సూరి హాంగ్ కాంగ్ వెళ్ళలేదు. శత్రువులు అతనిని బంధించి తీసుకెళ్ళినట్టు సాక్ష్యాలు లభించాయి. మరో విశేషం ఏమిటంటే సూరికి బదులు గిరి అనేవ్యక్తి హాంగ్ కాంగ్ వెళ్ళినట్టు ఏరోడ్రోమ్‌లో తెల్సుకున్నాను. సూరి, గిరి అనే మారుపేరుతో బయలుదేరాడా?" అడిగాడు ధనార్జనరావు.

"లేదు. సూరి పేరుతోనే!"

"నాకేదో సూరినిగూర్చి భయంగావుంది. మీరు వెంటనే రండి," అన్నాడు ధనార్జనరావు.

"అలాగే వస్తున్నాను," అని చెప్పి రిసీవర్ పెట్టేశాడు యువరాజ్.

యువరాజుకు ఏమీ అంతు చిక్కడంలేదు. సూరిని ఎవరు బంధించి వుంటారు? వారంట్ బంధించి వుంటాడా? తను తెల్సుకోవటం ఎలా? ఎంత ఆలోచించినా యువరాజుకు ఏమీ బోధపడడంలేదు. తను నౌక దిగగానే మొదట ధనార్జనరావుకు ఫోన్ చేశాడు.

టాక్సీ ఆ దరిదాపుల్లో కనబడనందున నడవసాగాడు. ఆ సమయంలో ఒక షాపులోనుండి ఒక యువతి పేవ్ మెంటు

మీదకు వచ్చింది. ఆమెను చూశాడు.

ఆమె సోనియా!! ఆమె తనకు టీ యిచ్చింది. ఆమె కళ్ళ జోడు పెట్టుకున్నంత మాత్రాన తను గుర్తించలేకపోలేదు. అవే బుగ్గలు. అవే వెంట్రుకలు. అవే పెదాలు. అదే మెడ. అదే వళ్ళు. అదే విగ్రహం.

ఆమెను చూస్తుంటే యువరాజుకు కోపం నసాళమంటింది. తనని చావుకు వెంద్రుకవాసి దూరానికి తీసుకెళ్ళిన రాక్షసి. ఆమెను పట్టుకోవాలి. బంధించాలి. పోలీసులకు అప్పగించాలి.

"మిస్ సోనియా!" అరిచాడు యువరాజ్.

గిరుక్కున తిరిగి చూసింది. యువరాజ్‌ని చూచి, "హు ఆర్ యూ?" అడిగింది అమాయకంగా.

ఆమె అమాయకతనానికి – అలా నటించడం చూచిన యువరాజుకు వళ్ళు మండిపోయింది. కోపాన్ని అణచుకోలేక ఆమె భుజాన్ని గట్టిగా అదిమి పట్టుకున్నాడు.

"రా పోలీస్ స్టేషనుకు!"

సోనియా గడగడలాడిపోయింది. ఆమెలో కోపం చెల రేగింది. అటువైపు నడిచేవారు, దగ్గరగా వెళ్లేవారు అందరూ వారిరువుర్నే చూస్తున్నారు.

పేవ్‌మెంటు జనంతో కిటకిటలాడుతూంది. అటువంటి పరిస్థితులలో ఆమెను ఒక మగాడు పట్టుకోగానే తోక తొక్కిన త్రాచులా బుస్సుమంది.

"ఏయ్ మిస్టర్! ఎవరు నువ్వు?" అని అంటూ తన కూలింగ్ కళ్ళజోడును తీసింది. ఆమె కోపంగా యువరాజ్ వంక చూసింది.

ఆమె కళ్ళను చూడగానే యువరాజ్ అదిరిపడ్డాడు. త్రుళ్ళిపోయాడు.

ఆమెకు పూర్తిగా మెల్లకన్ను!!

అచ్చగా సోనియాలా గేవుంది. సోనియాను తాను పరికించి

చూశాడు. చూచినది గుర్తుచేసుకున్నాడు. ఆమెకు మెల్లకన్ను లేదు. తనికి టీ యిచ్చినప్పుడు, మాట్లాడినపుడు మెల్లకన్ను ఉండివుంటే చూచి ఉండేవాడు. గుర్తు ఉండివుండేది.

# 16

రౌడీలను ఉద్దేశించి, "వీడిచేత నిజం చెప్పించడానికి ప్రయత్నం చేయండి. ప్రాణాలు పోకూడదు. జాగ్రత్త!" హెచ్చరించాడు సర్దార్.

సూరిని రౌడీలు బరబర ఈడ్చుకెళ్ళారు. ఒక గదిలోకి నెట్టారు. చేతులను వేరువేరుగా బంధించారు.

ఆ దుర్మార్గులు ఏంచేస్తారో తెలియడంలేదు. వారివంక సూరి అయోమయంగా చూస్తున్నాడు.

నలుగురు కాంక్రీట్ కట్టడాల్లా నిలబడి వున్నారు. అందులో ఒకడు, "చెప్తావా? చెప్పాలా"అని ఉరుముతూ అడిగాడు.

సూరి జవాబివ్వలేదు.

రౌడీలు అగ్గిగుగ్గయిపోయారు.ఒకడు గబగబా ఒకగదిలోకి వెళ్ళాడు. మరుక్షణం తిరిగివచ్చాడు. అతని చేతిలో బొగ్గుల పొయ్యి వుంది. ఆ పొయ్యిలో నిప్పులు కణకణమని మండుతున్నై.

"చెప్పకుంటె ఛస్తావ్!"

"చచ్చినా ఫరవాలేదు."

"అయితే చావు" అంటూ ఒకడు కొన్ని మిరపకాయలు తీసుకొచ్చాడు. అవి ఎండు మిర్చి! ఆ మిరపకాయలను మండే నిప్పులలో పోశాడు. పోయగానే అందరూ బిలబిలమంటూ ఆ గదిలో నుండి బయటకు వచ్చేస్తూ తలుపులు మూసేశారు.

సూరి గుండెలు గడగడలాడిపోయాయి. ఆ గదికి కిటికీ సైతములేదు. నిప్పులమీద మిర్చి పడగానే ఆ గదిలో ఘోరు ప్రారంభమైంది. మిర్చిఘోరు వూపిరితిత్తులకు పోతే దగ్గలేక

చావాలి.

భయంకరమైన దగ్గు... కొర్‌కొర్‌మని దగ్గుతున్నాడు సూరి. అల్లల్లాడి పోతున్నాడు దగ్గలేక. శరీరమంతా ముచ్చెమటలు పట్టేసినై. నరాలన్నీ బిగదీసుకుని దగ్గుతున్నాడు.

మిరపకాయలు నిప్పుల్లో మండేకొలదీ కోరు అధికమవుతూంది. సూరి నిభాయించుకోలేక, దగ్గలేక సతమతమవుతున్నాడు.

దగ్గిదగ్గి స్పృహతప్పి పడిపోయాడు.

# 17

"ఎక్స్‌క్యూజ్ మి మాడమ్! మీ పేరు?" భయ భక్తులున్నట్టు నటిస్తూ అడిగాడు.

"మిస్ సోనియా!" చెప్పిందామె చురచురలాడుతూ.

"వారంట్‌ని వివాహం చేసుకున్నది మీరేనా?" అడిగాడు యువరాజ్.

ఆమె అదిరిపడింది. యువరాజ్‌ని యెగాదిగా చూసింది. ఆమె పెదాలు అదిరాయి. ఆమెలో కల్గిన భయాన్ని యువరాజ్ గ్రహించాడు.

"మీరెవరు?" అడిగింది సోనియా.

"నేను డిటెక్టివ్‌ని... మీతో మాట్లాడాలి" అంటూ ఒక టాక్సీని కేకేశాడు.

"నే నడిగిన ప్రశ్నలకు అరమరికలు లేకుండా నిజం చెప్పాలి" అన్నాడు యువరాజ్. సోనియా తల వూపింది.

టాక్సీ పరుగెత్తుతూంది!

"వారంట్‌ని వివాహమాడిన మూడుగంటలకే విడాకు లిచ్చిన మాట నిజమేనా?" అడిగాడు యువరాజ్.

అవునన్నట్టు తలూపింది సోనియా.

"ఎందుకలా చేశావు?"

"నేను చేయలేదు. మిస్టర్ వారంట్ నాకు విడాకు లిచ్చాడు."

"కారణం?"

"నాకు మెల్లకన్ను వుండడం వివాహానంతరం గమనించాడు వారంట్!"

"కేవలం మెల్లకన్ను వుండడం మూలంగా నిన్ను పెళ్ళాడిన భర్త విడాకులిచ్చాడంటే నమ్మమంటావా? అదీ మూడు గంటలలో..." అన్నాడు యువరాజ్ ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

"అవునండి. నిజమే చెప్తున్నాను."

"నిన్ను వివాహమాడబోయే భర్త నీ కళ్ళు చూడకుండా ఎలా పెళ్ళిచేసుకున్నాడు."

"ఆ విషయం నాకు తెలియదండి. మా అక్కయ్య ప్రోద్బలం మీద జరిగిందీ పెళ్ళి."

"మీ అక్కయ్య పేరు?"

"సలీమా!"

"సలీమా నీలాగే వుంటుందా?"

"అచ్చగా నా పోలికలే, కళ్ళు తప్ప!"

యువరాజ్ మనసు పరిపరి విధాలయింది. సలీమా తనకు టీ ఇచ్చి స్పృహ పోగొట్టింది. అంటె సలీమాకు వారంట్‌తో సంబంధముంది. అయితే ఈ సోనియాకు వుండదా?

ఇంతలో టాక్సీ హెడ్ క్వార్టర్స్ ముందు ఆగింది. అక్కడ యువరాజ్ కోసం ఎదురు చూస్తున్న ధనార్జనరావు ఆదరాబాదరా టాక్సీవద్ద కొచ్చాడు.

యువరాజ్ దిగగానే, "నిన్నిక చూడనేమోనని భయపడి చచ్చాను," అంటూ ఉప్పొంగిన ఆనందంతో ఆలింగనం చేసుకున్నాడు.

కారునుండి దిగుతూన్న సోనియాని చూచిన ధనార్జనరావు,

"ఎవరామె?" ప్రశ్నించాడు. ఆమెకున్న కళ్ళజోడు కొట్ట వచ్చినట్టు దర్శన మిస్తూంది.

"ఈమె పేరు సోనియా! వారంట్‌ని వివాహమాడిన మూడు గంటల్లో విడాకులిచ్చింది," అన్నాడు యువరాజ్.

"ఎందుకు?" ఆశ్చర్యపోయాడు ధనార్జనరావు.

"వారంట్‌ని భారత పౌరునిగా చేయడానికని అనుమా నిస్తున్నాను," అంటూ వివరాలు చెప్పాడు యువరాజ్.

"వాట్ మిస్! వాటీస్ దిస్? యూ, యూ ఫూలిష్ డాగ్... క్రూర మృగాలను ఇంట్లోకి రానిస్తావా?" గర్జిం చాడు ధనార్జనరావు.

"నో, నో... ఐనో నథింగ్!" అంటూ సోనియా గజగజ లాడిపోయింది.

"సూరిని గురించి మీరు తెల్సుకున్న విషయాలేమిటి?" అడిగాడు యువరాజ్ బల్లముందున్న కుర్చీలో కూర్చుంటూ.

"సూరి హాంగ్ కాంగ్ వెళ్ళలేదని రూఢీ అయిపోయింది. ఆ సమయానికి గిరి అనే అతను ఎంక్వైరీలోకి అధికారుల కాళ్ళా వేళ్ళా బడి సీటు సంపాదించుకుని వెళ్ళాడు" చెప్పాడు ధనార్జనరావు.

"విచిత్రంగావుంది" ఆలోచనలో పడ్డాడు యువరాజ్.

"ఇంతకీ ఈ గందరగోళమంతా ఏమిటి?"

జరిగిన విషయాలను విపులంగా వివరిస్తూ, "వారెంట్ మీద నాకు అనుమానంగావుంది," అన్నాడు యువరాజ్.

"ఈ వారంట్ మాజిక్‌షోలు ప్రదర్శన లివ్వడానికి హాంగ్ కాంగ్ నుండి వచ్చాడని తెల్సింది," చెప్పాడు ధనా ర్జనరావు.

"అలా వచ్చినవాడైతే సోనియాని పెళ్ళెందుకు చేసు కున్నాడు?"

"ఏమిటి పిచ్చిప్రశ్న? పెళ్ళెందుకు చేసుకుంటాడు?

సోనియాది బ్యూటిఫుల్ ఫిగర్! కళ్లు గాక."

"ఇందులో ఏదో విశేషం వుంది మిస్టర్ ధనార్జనరావ్! నేను వారంట్‌ని కల్సుకోడానికి వెళ్ళినప్పుడు యాభై మందిలో నన్ను పరీక్షగా చూశాడు. సోనియా అక్క సలీమా నన్ను చంప ప్రయత్నించింది."

"సూరిని హాంగ్ కాంగ్ వెళ్ళకుండా చేయడంకూడా గమనించవలసిన విషయం," అన్నాడు ధనార్జనరావు.

"అవును. ఆ విషయాలన్నీ తెలియాలంటే వారంట్‌ని అడగాలి. రండి వెళదాం. సోనియానికూడా వెంటబెట్టుకు వెళదాం. వారంట్ అసలు స్వరూపం తెలియవచ్చు. అంతే గాక ఈ కేసు రహస్యం ఏమిటో బోధపడుతుంది," చెప్తూ లేచి నిలబడ్డాడు యువరాజ్.

# 18

"మిస్టర్ వారంట్! మీరు సోనియాని వివాహమాడిన మూడుగంటలకే విడాకులు ఎందుకు యిచ్చారో చెప్పాలి," అన్నాడు అధికార హోదాతో ధనార్జనరావు.

వారంట్ తటపటాయించాడు. సోనియాని విచిత్రంగా చూశాడు. సోనియా తన కళ్ళజోడును తీసేసి వారంట్ వంక చూసింది. ఆమె మెల్లకన్ను వెక్కిరిస్తూంది!

"ఆమెకు మెల్లకన్ను," అసహ్యించుకున్నాడు వారంట్.

"మెల్లకన్ను వున్నంతమాత్రాన ఎవరైనా విడాకులు యిస్తారా?" వ్యంగ్యంగా అడిగాడు ధనార్జనరావు.

"అందానికి కళ్లు ఎంతో ముఖ్యం! అటువంటి కళ్ళకు 'మెల్ల' వుండటం సహించలేకపోయాను. మోసపోయానని గ్రహించాను."

"ఆమె కళ్ళను చూడక నే ఎలా పెళ్ళికి ఒప్పుకున్నారు?"

"ఆమె కళ్ళను చూడ్లేదు."

"కళ్ళను చూడకపోవడం ఏమిటి?" నవ్వాడు ధనార్జన రావు.

"అవును నేను చూచినపుడు ఆ నల్ల కళ్ళజోడుతోనే వుంది. కళ్ళు కనబడలేదు," చెప్పాడు వారంట్.

"మీ మాటలు నమ్మశక్యంగా లేవు. మీరు హాంగ్ కాంగ్ నుండి మాజిక్ ప్రదర్శనలు యివ్వడానికి వచ్చారని విన్నాం. గనక మీ వీసా పత్రాలు, పాస్ పోర్టు చూపండి. మీరు భారతదేశ పౌరసత్వాన్ని పొందడానికి సోనియాని వివాహ మాడినట్లు నటిస్తున్నారని అనుమానిస్తున్నాం," చెప్పాడు యువరాజ్.

"కారణం?"

"తరువాత చెప్తాం. ముందు మీ వీసాను, పాస్ పోర్టును చూపండి," అన్నాడు ధనార్జనరావు.

"అలాగే" అంటూ వారంట్ ప్రక్కనున్న గదిలోకి వెళ్ళాడు. ధనార్జనరావు, యువరాజ్ ఒకర్నొకరు చూసుకున్నారు. సోనియా తలవంచుకునివుంది.

మూడునిముషాలు గడిచాయి. వారంట్ గదిలోకి వెళ్ళిన వాడు యింకా రాలేదు. అంతలో ఒక మూలుగు వినబడింది.

యువరాజు అనుమానిస్తూ లేచి నిలబడ్డాడు. ధనార్జన రావుని రమ్మని సైగ చేస్తూ ముందుకు కదిలాడు. ఇద్దరూ ఆ గదిలోకి అడుగెట్టారు.

ఆశ్చర్యం! వారంట్ రక్తపు మడుగులో గిజగిజ తన్నుకుంటున్నాడు.

కత్తి గుండెల్లో దిగబడివుంది. కత్తి పిడిని వారంట్ గట్టిగా పట్టుకుని వున్నాడు. కత్తిని లాక్కుంటున్నాడా? యువరాజ్, ధనార్జనరావులు క్షణకాలంపాటు నిర్వీర్యులై పోయారు.

ఒక్కంగలో ఇద్దరూ వారంట్ ని కల్సుకున్నారు. యువ

రాజ్ వారంట్‌కు ఆర్టిఫిషియల్ రెస్పిరేషన్ చేయబోతూ "ఎవరీ ఘాతుకం చేసింది?" అని ప్రశ్నించాడు.

వారంట్ గుడ్లు తేలవేసేశాడు.

ధనార్జనరావు తన పిస్తోలును అందుకుని, "డామిట్ హంతకునికి ఎంత ధైర్యం?" అని పళ్ళు పటపట కొరుకుతూ ఆదరాబాదరా ఆవేశంతో తనకు తోచిన వైపుకు దూసుకు పోయాడు హంతకుణ్ణి పట్టుకోడానికి.

హంతకుడికి ఎంతో వ్యవధిలేదు. పొడవబడ్డ వారంట్ చావబోతున్నాడు. అంటే హంతకుడు ఆ ఇంట్లోనే వుండి వుంటాడు. తను ఆలస్యంచేస్తే హంతకుడు పారిపోవచ్చు.

యువరాజ్, వారంట్ వంక చూస్తే బ్రతకడనితోచింది. కత్తి గుండెల్లో దిగబడివుంది. వారంట్‌ని ఎవరైనా చంపారా? లేక ఆత్మహత్య చేసుకున్నాడా?

తను యిక దొరికిపోవచ్చని భయపడి వారంట్ ఆత్మ హత్య చేసుకుని ఉండొచ్చు. లేదా అసలు విషయాన్ని పొక్కతాడన్న భీతితో అతని అనుచరులెవరైనా చంపి ఉండొచ్చు.

ఆలోచిస్తూ యువరాజ్ పిస్తోలు పట్టుకుని ధనార్జనరావు వెళ్ళినవైపుగాక మరోవైపుకు అడుగులు వేశాడు. తప్పక హంతకుడు ఉన్నట్టయితే అక్కడే వుండివుండాలన్న నమ్మకం యువరాజుకుంది.

చకచక చూసుకుంటూ పిస్తోలును సిద్ధంగా పట్టుకుని వెదుకుతున్నాడు.

వారంట్ వున్న యింట్లో గదులన్నిటినీ, కర్టెన్ల వెనుక చూస్తున్నాడు. గుండెలు దడదడలాడుతున్నై.

ఒక గదిలోకి అడుగుపెట్టాడు యువరాజ్. ఆశ్చర్యం! నల్గురు వ్యక్తులు ప్రవాహంలావచ్చి మీదపడిపోయారు. ఆ నలుగురూ ఆంబోతుల్లాగున్నారు. వారి బలంముందు యువ

రాజ్ నిలబడలేక తూలిపోయాడు. పిస్తోలు పేల్చడానికి అవకాశం లేకపోయింది.

యువరాజుని ఇరికించి పట్టేశారు. అందరివంకా క్రోధంగా చూశాడు. అందులో ఒకడు డ్రైవర్! తనని మోసంచేసి సలీమావద్దకు పంపి చంపడానికి ప్రయత్నించిన వాడు.

"ఎవరు నువ్వు?" అడిగాడు యువరాజ్ అతనిని.

"నా పేరు సర్దార్!" చెప్పాడతను. విస్తుపోయి అతనిని చూశాడు. ఆ చూపుల్లో కాఠిన్యముంది. "మిస్టర్ యువరాజ్! వారంటుని అసలు సోనియా వివాహమాడలేదు. మీతో అబద్ధం చెప్పాను. ఎందుకంటే మిమ్మల్ని బంధించడానికి," అన్నాడు సర్దార్.

యువరాజుకు మతిపోయినట్లుంది.

"అవును. ఈ ముగ్గురే మిమ్మల్ని సముద్రంలో పడేశారు. ఈ ముగ్గురు పేరుమోసిన రౌడీలు. జాగ్రత్త!" సర్దార్ హెచ్చరించాడు.

"అంత పెద్ద చావునుండి ఎలా తప్పించుకున్నావ్?" ప్రశ్నించాడు సామ్సన్. సామ్సన్ని ఉరిమిచూశాడు యువరాజ్.

"ఉఁ తీసుకురండి," అన్నాడు సర్దార్.

ధనార్జనరావు ఏమైయ్యాడు? తనలాగే అతనినీ...ఏమో? యువరాజ్ గుండెలు ఢమఢమలాడిపోయాయి.

వారంట్ పడివున్న చోటుకి వచ్చారు.

"లేవండి," అన్నాడు సర్దార్.

నవ్వుతూ పడివున్న వారంట్ లేచి నిలబడ్డాడు!! నిలబడ్డ వారంట్ యువరాజుని హేళనగా చూశాడు!!!

యువరాజుకు అప్పుడు అర్థమైంది, వారంట్ మోసం చేశాడని! వారంట్ చేసేదే మోసం. మాజిక్ విద్య ఒక

విధమైన మోసం. ఆ మోసంతోటే ప్రజలను వంచించి బ్రతికేవాడు. అందుకే రష్యా ప్రభుత్వం ఇంద్రజాలికులను మంత్రగాళ్ళను చెరసాలలోకి నెట్టున్నారు.

తనముందు వారంట్ చనిపోయినట్లు నటించాడు. నటనని తనా సమయంలో తెల్సుకోలేకపోయాడు.

"మిస్టర్ యువరాజ్, ఐయామ్ వెరివెరి సారీ! వేరే గత్యంతరంలేక చచ్చినట్లు నటించి మిమ్మల్ని మోసం చేశాను," అన్నాడు వారంట్ రంగు పులుముకున్న కోటును విప్పుకుంటూ.

"ఏమిటీ కుతంత్రం?" గర్జించాడు యువరాజ్.

"మీకిక తెలుస్తుంది," అన్నాడు సర్దార్.

ఇంతలో అవైపు గదిలో కూర్చుని వుండిన సోనియా వయ్యారంగా నడిచివచ్చి యువరాజ్ ముందు నిలబడింది. యువరాజుని వెటకారంగా చూస్తూ, ఆమె తన కళ్ళ జోడును తీసేసింది. ఆశ్చర్యం.

ఆమె కిప్పుడు మెల్లకన్ను లేదు!!

యువరాజ్ స్తంభించిపోయి ఆమెవంక తదేకంగా చూశాడు. సోనియాకు వాస్తవంగా మెల్లకన్ను లేదు. మెల్లకన్ను వున్నట్లు తన కళ్ళను, జోడు తీసినపుడు సర్దుకుంది. తను నిజమని భ్రమ చెందిపోయాడు. ఎంత మోసపోయాడు తను?!

వారిముందు తనేకాదు ధనార్జనరావూ మోసపోయాడు. ఇంతకీ ధనార్జనరావు ఏమైయ్యాడు? యువరాజుకు ముచ్చెమటలు పట్టేసినై.

"ధనార్జనరావుని ఏంచేశారు?" జీరగొంతుతో ప్రశ్నించాడు యువరాజ్.

"ధనార్జనరావుని చంపాలని కొట్టలేదు. కొట్టాము. చచ్చాడో, బ్రతికాడో మాకు తెలియదు," అన్నాడు సర్దార్.

యువరాజ్ గుండెలు దడదడ లాడిపోయాయి. తను అంతమంది మధ్యనుండి తప్పించుకోవడం దుర్లభం. ధనార్జనరావుకు ప్రాణాపాయం సంభవించిందా? సోనియా కుతంత్రం మూలంగా ధనార్జనరావునీ యీ వూబిలోకి లాగవలసి వచ్చింది.

"నన్నెందుకు బంధించారు? నాతో మీకేం పని? సూరి మీకేం ద్రోహం చేశాడు?" యువరాజ్ కంఠం బొంగురు పోయింది.

"మిస్టర్ యువరాజ్! సాబర్ మీకు తెలుసు అనుకుంటాను" అన్నాడు వారంట్.

"సాబర్ని నేనెప్పుడూ చూళ్ళేదు. నాకు టెలిఫోనులో తన పేరు సాబరని చెప్పుకున్నాడు!" చెప్పాడు యువరాజ్.

"సాబర్ మీకు ఫోనులో ఏం చెప్పాడో మేము వినలేక పోయాం. ఒక రహస్యాన్ని గురించి చెప్పాడని అనుకుంటున్నాం. అతను చెప్పిన రహస్యం ఏమిటి?" అడిగాడు సర్దార్.

"సాబర్ నాకు రహస్యం చెప్పదలచి నన్ను కాసర కొండవద్దకు రమ్మన్నాడు. వెళ్ళాను కానీ సాబర్ని కల్సుకో లేదు."

"మీరు కల్సుకోలేదని మాకు తెల్సు. కానీ సాబర్ అతని వద్ద వుండిన రహస్యాన్ని మీ కొక్కరికే చెప్తానని మొండిపట్టు పట్టాడు. కనక మీకు తప్పక చెప్పివుంటాడు," అన్నాడు వారంట్.

"లేదు. చెప్పలేదు. అడిగాను. చూచాయగానైనా చెప్ప లేదు. రహస్యం దేనికి సంబంధించినదని ఎంతడిగినా చెప్ప లేదు. నన్ను కాసరకొండ వద్దకు రమ్మన్నాడు. అంతే!" అన్నాడు యువరాజ్.

"అబద్ధం! అంతా అబద్ధం" అరిచాడు వారంట్.

"అవును మిస్టర్ యువరాజ్. మీ అసిస్టెంటు సూరి సాబర్ చెప్పిన రహస్యం గూర్చి తెల్సని ఒప్పుకున్నాడు. మీరు బుకాయించి లాభంలేదు. నిజం చెప్పండి," సర్దార్ నోటినుండి హెచ్చరిక వినబడింది.

యువరాజుకు ఆశ్చర్యమేసింది. సూరి ఎందుకలా అబద్ధం చెప్పాడు? నిజానికి సాబర్ చెప్పబోయిన రహస్యం తమ ఇద్దరికీ తెలియదు. సూరి ఎందుకు తెల్సని చెప్పుకున్నాడు? యువరాజ్ కు అంతుచిక్కలేదు.

"సాబర్ నా కెటువంటి రహస్యమూ చెప్పలేదు. నా కేమీ తెలియదు," అన్నాడు యువరాజ్.

"మిస్టర్ యువరాజ్! మీరు పేరుమోసిన డిటెక్టివ్ లు. అంటే శిక్షణ పొందినవారు. మిమ్మల్ని యెంత హింసించినా నిజం చెప్పరని మాకు తెల్సు" అంటూ వారంట్, సర్దార్ చెవులో యేదో చెప్పాడు రహస్యంగా.

అంతలో అక్కడికి ఒకతను వచ్చి, హాంగ్ కాంగ్ నుండి గిరి వచ్చినట్లు చెప్పాడు. అందరి కళ్ళల్లో సంతోషం వెల్లివిరిసింది. యువరాజ్ ను ఎటో తీసుకెళ్ళసాగారు.

# 19

చాలాసేపు ప్రయాణించిన కారు ఒకచోట ఆగింది. అందరూ దిగారు. యువరాజునీ క్రిందకు దింపారు. ఆ ప్రదేశాన్ని చూచిన యువరాజ్ గుండెలు ధమధమ లాడిపోయాయి.

అది బీచ్ ప్రాంతం! అల్లంత దూరంలో సముద్రం భీకరంగా గోచరిస్తూంది.

వారంట్, సర్దార్, గిరిలు యువరాజుని పట్టుకుని ఇసుకలో నడిపించుకు వెళ్తున్నారు.

యువరాజు వుండబట్టలేక, "ఎక్కడికి?" అని అడిగాడు.

"సముద్రంలోనికి!" చెప్పాడు వారంట్.

"ఎందుకు?" భయంతో అడిగాడు యువరాజు.

"ఎందుకేమిటి? పిచ్చి ప్రశ్న! చావడానికి," అన్నాడు సర్దార్.

యువరాజుకు అయోమయంగా వుంది. సముద్రంలోనికి ఎందుకు? మళ్ళీ ఏం చేస్తారు? యువరాజు తల్లడిల్లిపోతున్నాడు.

అందరూ సముద్రపు జలాలవద్దకు చేరుకున్నారు. అలలు వువ్వెత్తున లేచి మీద పడేటట్టున్నవి. గంభీరమైన సముద్రం భీకరంగా గోచరిస్తూంది.

ఆ సమయంలో అక్కడికి ఒక మోటర్ బోటు వచ్చింది. బోటు చాలా పెద్దదిగా వుంది. ఆ బోటులోనికి అందరూ ఎక్కి కూర్చున్నారు. గిరి డ్రైవ్ చేయగా బయలుదేరింది. మోటర్ బోటు అలలను చీల్చుకుంటూ ముందుకు ప్రయాణిస్తూంది.

భూ ప్రదేశం మీదైతే తప్పించుకోవచ్చు. జల ప్రదేశంలో ఎలా తప్పించుకోవడం? నడిసముద్రంలో బోటులో నుండి తప్పించుకుని ప్రాణాలతో బయటపడడం అసాధ్యం! యువరాజు శరీరమంతా వణికిపోతూంది. తప్పనిసరి తనని చంపేస్తారేమో?

చాలా దూరం ప్రయాణించిన బోటు ఆగింది. చుట్టూ ఎటు చూచినా గంభీరమైన సముద్రం. భూప్రదేశం లీలగానైనా గోచరించడం లేదు. బోటు అలలమీద వూగిపోతూంది.

బైనాక్యులర్స్ పెట్టుకుని వారంట్, సర్దార్ తిలకించారు. కనుచూపు మేరలో ఎటువంటి నౌకలు గోచరించలేదు.

యువరాజ్ బిక్కుబిక్కుమంటున్నాడు. ఆ దుర్మార్గులు ఏం చేయబోతారో అనూహ్యంగా వుంది.

"మిస్టర్ గిరీ! ఊ...ఇక చెప్పు. హాంగ్ కాంగ్ లో నువ్వు తెల్సుకున్న దేమిటి? సాబర్ వద్ద వుండిన రహస్యం ఏమిటో తెల్సుకున్నావా?" ప్రశ్నించాడు వారంట్.

సర్దార్ యువరాజులు గిరి ఏం చెప్తాడో వినడానికి చెవులు రిక్కించి పెట్టారు. సముద్రపు గాలి రివ్వున వీస్తూంది. అక్కడి వాతావరణం అతిభయానకంగా వుంది.

"ఒక పత్రికా విలేఖరి పాకిస్తాన్ లో దొంగచాటుగా తిరుగుతూ బంగ్లాదేశ్ కు సంబంధించిన కొన్ని రహస్యాలను సేకరించాడు. పైగా నిక్సన్ ఉత్తర వియత్నాం మీద ప్రయోగించబడు ఆయుధాలను పాకిస్తాన్ కు యెలా సరఫరా చేయబడేది తగిన ఆధారాలతో, ఫోటోలతో సేకరించాడు," చెప్పాడు గిరి.

"తర్వాత?" అడిగాడు సర్దార్.

"ఆ విలేఖరి సంపాదించిన సాక్ష్యాధారాలు ప్రపంచానికి తెలిస్తే యాహ్యాఖాన్ ని కాల్చి బూడిదచేసి గాలిలో తూర్పారపెట్టారట!" అన్నాడు గిరి.

అవును. అటువంటి నియంతల చరిత్ర తిరగవేస్తే బోధపడుతుంది. హిట్లర్ ప్రపంచ అధినేత కావాలని రెండవ ప్రపంచ యుద్ధాన్ని సృష్టించాడు. చివరకు చావడానికి విషం తాగాడు. తాగిన విషం తనని చంపుతుందో చంపదో నని పిస్తోలుతో కాల్చుకుని మరీ చచ్చాడు. అలా చచ్చిన హిట్లర్ శవాన్ని కాల్చి బూడిద చేశారు. ఆ బూడిదను గాలిలోకి వదిలి తూర్పారబట్టారు ప్రజలు. యువరాజ్ మనసు వికలమైపోయింది.

"ఊఁ చెప్పు," అన్నాడు వారంట్.

"పాకిస్తాన్ లో సంపాదించిన ఆధారాలను తీసుకుని బయట ప్రపంచానికి రాలేక సతమతమైయ్యాడు. అక్కడ నుండి తప్పించుకుని చైనాలోకి వెళ్ళాడు. చైనాలో ఆ విలే

ఖరి అతి సాహసం చేశాడని చెప్పాలి. చైనా రాజకీయాల గురించిన భోగట్టాను సేకరించాడు. ముఖ్యంగా మావో సేటింగ్ గూర్చి విచిత్రమైన వివరాలను తెల్సుకున్నాడు. అందుకు తగిన ఆధారాలు, ఫోటోలు సంపాదించాడు. మావో సేటింగ్ చాలారోజుల క్రితమే మరణించాడని, అతని స్థానంలో నకిలీ మావో యిప్పుడు అధికారంలో ఉన్నాడని విలేఖరి తెల్సుకున్న విషయాలలో విశేషమైనది!!" అన్నాడు ఆశ్చర్య పడుతూ గిరి.

యువరాజ్ ఆశ్చర్యానికి అంతులేకుండా పోయింది. చైనా అధినేత మావో మరణించాడా? అతని స్థానంలో మరొకరు మావోలా నటిస్తూ చైనాని పాలిస్తున్నాడా? యువరాజుకు నమ్మశక్యం గాకపోయింది. ఆ బోటులోవున్న వారంతా గట్టిగా గాలి పీల్చుకున్నారు. కాసేపు గుండెలు కొట్టుకోవడం ఆగిపోయాయి అందరికి.

"ఆ విలేఖరి హాంగ్ కాంగ్ ఎందుకు వచ్చాడు? ఎలా వచ్చాడు? అతనివద్ద నున్న రహస్యాలు సాబర్ కు ఎలా వచ్చాయి?" ప్రశ్నించాడు వారంట్.

"చైనాలో అతనిని కొందరు గూఢచారులు అనుమానించి వున్నంటారు. ఎలాగో తప్పించుకుని హాంగ్ కాంగ్ చేరు కున్నాడు. ఎంత నేర్పుగా తప్పించుకున్నా ఆ విలేఖర్ని ఏజెంట్లు వదిలిపెట్టలేదు. 'హాంగ్ కాంగ్ లేడీ' అనే హోటల్లో బసచేశాడు. అతనివద్ద వున్న రహస్యాన్ని సంపాదించడానికి చాలామంది తాపత్రయ పడ్డారు. ఆ ఘర్షణలో చావుదెబ్బ తిన్నాడు.

"చనిపోవు సమయంలో తప్పించుకుని ప్రక్కగదిలో వున్న సాబర్ని రహస్యంగా పిలిచి అతనికి తనవద్దనున్న రహస్యానికి సంబంధించిన కాగితాలను అందిస్తూ, 'మీరు

ఇండియాలో డిటెక్టివ్ యువరాజుకు ఈ కాగితాలను అందించండి" అని చెప్పి, మరణించాడు.

"సాబర్ ఆ సమయంలోనే ఇండియాకు ప్రయాణమవుతున్నాడు. సురక్షితంగా అతను విమానాశ్రయం చేరుకుని క్షేమంగా ఇండియా చేరుకున్నాడు," అని వివరంగా చెప్పాడు గిరి.

యువరాజు ఆశ్చర్యానికి అంతులేకుండా పోయింది. ఆ విలేఖరి ఎవరు? తన పేరును ఎందుకు సూచించాడు? అంత పెద్ద రహస్యం తనకు అప్పగించమనడంలో ఆంతర్యం ఏమిటి? ఆ విలేఖరి తనకు తెల్సినవాడా? లేక తనని గురించి తెల్సిన విలేఖరా?? యువరాజుకు మనసంతా గజిబిజి అయిపోయింది.

"మిస్టర్ యువరాజ్! విన్నారుగా. మీరు చెప్పనంత మాత్రాన తెల్సుకోలేమని భ్రమ చెందకండి. రహస్యం దేనికి సంబంధించినదో అర్థమైపోయింది. ఇక ఆ రహస్యాన్ని సాబర్ ఎక్కడ దాచాడో మీరు చెప్పాలి," అని హుంకరించాడు వారంట్.

"నిజం చెప్తున్నాను. నమ్మితే నమ్మండి-సాబర్ రహస్యం చెప్తాను, రమ్మని చెప్పాడేగానీ ఫలానా రహస్యంగానీ, దానిని దాచిన స్థలముగానీ నాతో చెప్పలేదు. అలా చెప్పి వుంటే నా కేమిటి అభ్యంతరం మీతో చెప్పడానికి? ఆ రహస్యం నా దేశానికి సంబంధించినదికాదు. నాకూ సంబంధించినదికాదు," చెప్పాడు యువరాజ్.

వారంట్, గిరిని చూశాడు. గిరి సర్దార్ని చూశాడు.

ముగ్గురూ కల్సి యువరాజుని లేపి నిలబెట్టారు. యువరాజ్ చేతులను శరీరానికి చేర్చి బలంగా బంధించివున్నారు. కట్లను విప్పారు. అదను చిక్కితే తిరగబడాలని యువరాజుకుంది. కాని చిక్కడంలేదు.

యువరాజు చేతుల రెంటిని దండం పెట్టినట్టు కలిపి

గట్టిగా పట్టుకున్నాడు సర్దార్. ఆ చేతులను కలిపి గిరి బంధించాడు. తాడు ఒక చివరను గట్టిగా పట్టుకున్నాడు. కాళ్ళకు వారంట్ బంధాలు బిగించాడు.

యువరాజ్ చివరిసారిగా తనకేమీ తెలియదని వేడుకున్నా ఎవరూ వినిపించుకోలేదు.

డిటెక్టివ్ యువరాజుని పూర్తిగా సముద్రంలోకి దింపేశారు.

నీటిలో మునిగిపోయి వున్న యువరాజ్ యెంతసేపని వూపిరి బిగపట్టి వుండగలడు? మళ్ళీ పైకి లేపారు. గాలి పీల్చుకునే లోపు మళ్లీ దింపారు. యువరాజ్ ఉక్కిరి బిక్కిరై పోయాడు. తన చావు ఇక ఎంతో సేపు లేదు. తప్పించుకోవడం అసంభవం..

అసంభవం అన్నది మందబుద్ధుల నిఘంటువులోనిది. ఏదో ఎత్తు వేయాలి. చావునుండి రక్షించుకుంటూ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు యువరాజ్.

యువరాజుని ముంచి ముంచి లేవనెత్తుతున్నారు. ఊపిరాడక సతమతమై మృత్యువుతో పోరాడుతున్నాడు.

యువరాజుని నీటి పైకి లేపి, "చెప్పు" అరిచాడు.

"చెప్తాను" బిగ్గరగా కేక పెట్టాడు యువరాజ్.

"ఊఁ చెప్పు!" గర్జించాడు వారంట్.

"కాస్త అలసట తీర్చుకోనివ్వండి," ప్రార్థించాడు యువరాజ్. అన్నాడే గానీ ఏం చెప్పాలో అర్థంకావడం లేదు.

యువరాజుని పైకి లాగి బోటులోనికి కుదేశారు. గట్టిగా వుచ్ఛ్వాస నిశ్వాసలు విడుస్తున్నాడు. ఆ ముగ్గుర్ని పరకాయించి చూశాడు. తనని ఆవురావురుమని చూస్తున్నారు. తనా సమయంలో యేదో ఒకటి చెప్పాలి లేదా తప్పించుకోడానికి ప్రయత్నించాలి. ఎలా?

తను చెప్పినా, చెప్పకపోయినా తన ప్రాణాలు పోవడం ఖాయం! గనక తన శక్తి యుక్తులను వుపయోగించాలి. శరీరాన్ని నిగడదీశాడు. నరనరాలు జివ్వుమన్నవి. ప్రాణ రక్షణార్థం ప్రతి జీవిలోని వెన్నుముకకు ఎనలేని బలం చేకూరుతుంది.

ఆ ముగ్గురూ యువరాజుని సంతోషంతో చూస్తున్నారు. సాబర్ రహస్యాన్ని ఎక్కడ దాచాడో యువరాజు యిక చెప్పేస్తాడని ఆత్రుతగా చూస్తున్నారు.

యువరాజు మెల్లగా లేచి నిలబడ్డాడు. కాళ్ళకుబంధాలు వున్నప్పటికీ సమాళించుకోగల్గాడు. యువరాజుని విచిత్రంగా చూస్తూ "చెప్పు, చెప్పు" ఆదుర్దాగా అడిగారు.

యువరాజు ముందుగా సర్దార్‌కి గురి చూసుకున్నాడు. అంత అలిసిపోయిన యువరాజు తమను ఏమీ చేయలేడన్న నమ్మకం వుంది వారిలో.

కట్టివేయబడి వున్న కాళ్ళూ చేతులతో ఆ ముగ్గుర్ని జయించడం దుర్లభం అని తెల్సికూడా తెగించాడు. తెగించి తీరాలి. లేనిచో తనని అష్టకష్టాలకు గురిచేసి చంపుతారు.

సర్దార్ ముందుకు-బంధాలున్న కాళ్ళతో గెంతుతూ, దండం పెట్టినట్టున్న చేతితో అతని మెడమీద రాక్షసంగా కొట్టేశాడు యువరాజ్. ఆ దెబ్బకు విరుచుకు పడబోతూ బోటు చివరన పడి సముద్రంలోనికి దొర్లి పడిపోయాడు సర్దార్.

యువరాజ్ పడబోతూ సమాళించుకునే సమయంలో గిరి వెనుక నే వచ్చి మీద పడిపోబోయాడు. ఆ అదనులో తన మోచేతితో కర్కశంగా అతని గుండెలమీద గుద్దాడు. ఆ దెబ్బకు 'కిక్' మంటూ గిరి కూడా సముద్రంలోకి దొర్లి పోయాడు.

వారంట్ ఆశ్చెరువు చెందిపోయి యువరాజుని బెదు

ఈగా చూస్తూ తటాలున పిస్తోలును అందుకుని గురి పెట్టబోయాడు. యువరాజ్ క్షణమూ ఆలస్యం చేయలేదు. వారంట్ మీద విరుచుకు పడిపోయాడు. పడుతూ తన చేతులతో అతని వద్దవుండిన పిస్తోలును యెగుర కొట్టేశాడు.

యువరాజ్ శరీరభారానికి తాళలేక వారంట్ మొదలు నరికిన చెట్టులా దభేలున సముద్రంలోనికి పడిపోయాడు.

యువరాజ్ చకచక నోటితో చేతిబంధాలను విప్పుకున్నాడు. కాళ్ళకున్న బంధాలను తొలగించాడు.

ఆదరాబాదరా వెళ్ళి ఇంజన్ స్టార్ట్ చేశాడు.

# 20

మోటర్ బోటు బయలుదేరింది.

వెనుక కేకలు వినబడుతున్నాయి. వారంట్, గిరి, సర్దార్లు నడిసముద్రంలో అలల మధ్య కొట్టుకులాడుతూ ఈదుతున్నారు. అక్కడనుండి తీరాన్ని చేరుకునేలోపు ఈదలేక చస్తారు. యువరాజ్ వెళ్ళితే ఆ నడిసముద్రంలో చావక తప్పదు.

చావుకు భయపడ్డ ఆ ముగ్గురు పొలికేకలు పెట్టున్నారు.

తిరిగి చూశాడు. యువరాజ్ మనసు చివుక్కుమంది. ఆయన మనసు ఒప్పుకోలేదు.

వాళ్ళెంతటి దుర్మార్గులైనా యువరాజ్ మనసు కరిగిపోయింది. తను బోటులో వెళ్ళిపోతే తప్పక చచ్చి తీరుతారు. అంత దారుణం తను తెల్సీ చేయలేదు. వాళ్ళను సురక్షితంగా గట్టుచేర్చి ప్రభుత్వానికి అప్పగించడమే న్యాయం, ధర్మం!—అదే మానవత్వం కూడా!!

యువరాజ్ బోటుని వెనుతిప్పి వాళ్ళ సమీపానికి వచ్చాడు.

ఆ ముగ్గురూ భయాందోళనలకు లోనై ఉప్పునీళ్ళను

గుటకలు వేస్తూ యువరాజుని దీనంగా చూస్తూ అలలమీద ఎగిరెగిరి పడుతున్నారు.

యువరాజుకు జాలేసింది. ఆ ముగ్గురి చుట్టూ బోటును రౌండ్ కొట్టించాడు.

బోటులోనికి ఎక్కడానికి ఆత్రుత చెందిపోతున్నారు. వాళ్ళు బాగా అలిసిపోయిన తరువాత ఎక్కించుకోవాలని యువరాజ్ వుద్దేశం. అలిసిపోతే తనకు లొంగి పడివుంటారు. అందుకే వాళ్ళను చాలా సేపు ఈదనిచ్చాడు.

బోటు వాళ్ళ కందకుండా తిప్పుకుంటూ కాలాన్ని వెళ్ళబుచ్చాడు. అలిసిపోయారని అనుకున్న పిదప, "ఒక్కొక్కరే రావాలి," అన్నాడు.

ముగ్గురూ తలలూపారు.

తాళ్ళనిచ్చిన దింపగానే వారంట్ పైకి వచ్చాడు ఛస్తూ. వెంటనే యువరాజ్ బంధించాడు. ఆ విధంగా ముగ్గుర్ని బంధించి బోటును నడుపుకుంటూ బయలుదేరాడు.

"ఫూల్స్!! సాబర్ నాకసలు రహస్యం గురించో, దానిని దాచిన సంగతో చెప్పనే లేదు," అన్నాడు యువరాజ్.

"మరి ఆ రహస్యం ఏమైంది?" అడిగాడు వారంట్.

"ఏమో? నాకేం తెల్సు? ఎలా తెలుస్తుంది? సాబర్ని చంపేసి నా వెంటబడి అడుగడుగునా ఆపదలకు గురి చేశారు. ఇడియట్స్! అర్థం పర్థం లేకుండా అఘోరించారు," అసహ్యించుకున్నాడు యువరాజ్.

ముగ్గురూ సిగ్గుతో తలలు వంచుకున్నారు.

బోటు తీరం చేరుకుంది. ముగ్గుర్ని జాగ్రత్తగా బంధించి దింపాడు. ఇసుకలో నడుస్తున్నారు. ఆశ్చర్యం.

ఆ సమయంలో సోనియా తన బలగమైన రౌడీమూకతో చుట్టు ముట్టేసింది. యువరాజ్ అవాక్కై నిలబడిపోయాడు.

అల్లంత దూరంలో బంధితుడైవున్న సూరిని ఇద్దరు రౌడీలు

ఇసుకలో ఈడ్చుకొస్తున్నారు. యువరాజ్ గుండెలు గడగడ లాడిపోయాయి.

గబగబ వారంటుని, గిరిని, సర్దార్ ని విడిపించారు.

యువరాజ్ కి ఏం చేయాలో పాలుపోలేదు. నూరి బంధితుడై వున్నాడు. తను ఒక్కడూ అంతమందిని జయించడం అసాధ్యం.

"మిస్టర్ యువరాజ్ ఆ రహస్యాలను సాబర్ ఎక్కడ దాచి ఉంటాడని మీ అనుమానం?" అడిగాడు వారంట్.

"ఏమో?" అన్నాడు యువరాజ్.

"మీరు పేరుమోసిన డిటెక్టివ్ లు. అంతమాత్రం తెల్సుకోలేరా?" అన్నాడు సర్దార్ వ్యంగ్యంగా.

"దద్దమ్మల్లారా! గూఢచారులని చెప్పుకోడానికి మీకు సిగ్గులేదూ!? వెళ్ళండి. కనుక్కోండి. అదే మీ ప్రజ్ఞ!!" అని ఇసుకలో పడివున్న నూరి గర్జించాడు.

"ఊఁ తీసుకురండి," అన్నాడు వారంట్. అందరూ బయలుదేరారు.

ఆ సమయంలో పొంచివున్న పోలీసు బలగం గాలిలోకి తుపాకులు పేల్చుతూ రౌడీమూకను, గూఢచారులను చుట్టుముట్టి అందరినీ బంధించారు.

"మీరెలా వచ్చారు?" ఆశ్చర్యపడుతూ అడిగాడు నూరి.

"మన సార్జంటు సత్యం నేర్పు, అనుమానంతో సోనియాని, రౌడీమూకను వెన్నంటుతూ వచ్చాడు. బీచ్ లో మకాం వేసి యెవరి కోసమో యెదురు చూడడం పసిగట్టి, నాకు ఫోన్ చేశాడు" అన్నాడు ధనార్జనరావు.

"వెరి మనీ థాంక్స్. అండ్ కంగ్రాచ్యులేషన్స్!!" చెప్పుకున్నాడు నూరి.

"మిస్టర్ యువరాజ్, ఇంతకీ వాళ్ళంతా యెవరు?" అడిగాడు ధనార్జనరావు.

"పాకిస్తాన్, చైనాకు చెందిన గూఢచారులు. వాళ్ళు ఏకమై సాబర్ వద్ద ఉండిన రహస్యాలను చేపట్టడానికి కృషి చేసి ఉన్నారు. కానీ రహస్యాలు చేజిక్కలేదు..." అంటూ వివరంగా చెప్పాడు యువరాజ్.

"అయితే ఆ రహస్యాలు ఏమైనట్టు?"

"ఆ విషయమే నాకు అంతు చిక్కటంలేదు. సాబర్ బసచేసిన హోటలు గదిలోను, సాబర్ని చంపేటప్పుడు అతని శరీరంమీద వాళ్ళకు రహస్యాలు లభ్యంకాలేదు," చెప్పాడు యువరాజ్.

"అయితే ఏమైవుంటాయి? సాబర్ వాటిని యెక్కడ దాచి వుంటాడు?" అడిగాడు ధనార్జనరావు.

"ఏమో మనం ఇక కనుగొనాలి" ఆలోచనలలో పడ్తూ అన్నాడు.

"నా వూహ సరైనదైతే ఆ రహస్యాలు కాసర కొండవద్ద లభించి తీరాలి. రండి" అంటూ బయలుదేరాడు యువరాజ్.

ధనార్జనరావు, సూరీలు, ఆశ్చర్యచకితులై పోయారు.

జీపు కాసర కొండవైపు పరుగులు తీస్తూంది.

కాసర కొండను అందరూ చేరుకున్నారు.

యువరాజ్ దిగి సరాసరి ఆ బండరాయివద్ద కెళ్ళాడు. సాబర్ కూర్చుని ఉండాలని యువరాజ్ వూహ. సాబర్ కూర్చుని తనని ఎదురుచూచు సమయంలో శత్రువులు చుట్టు ముట్టి ఉండాలి. ఆ క్లిష్ట పరిస్థితులలో సాబర్ ఏంచేసి ఉంటాడు? ఆలోచిస్తున్నాడు యువరాజ్.

సాబర్ తనకు చెప్పాలని పిలిచాడు. పిలిచినవాడు తప్పక రహస్యాలను తనతో తెచ్చుకొని వుంటాడు. అలా తెచ్చుకొన్నవాటిని శత్రువుల చేతుల చిక్కకుండా ఆ బండరాయి వద్ద దాచి ఉండాలని యువరాజ్ అనుమానించాడు.

మరో సందేహం కల్గింది. సాబర్ ఆ కాగితాలను కాళ్లో కి

ఉంచాదేమో? కారుని తగుల బెట్టేశారుగా!!

బండరాయిని ముగ్గురూ చుట్టిచుట్టి వచ్చారు. కనబడలేదు. సరికదా ఎటువంటి ఆచూకీ కన్పడలేదు.

యువరాజ్ మళ్ళీమళ్ళీ చూశాడు.

యువరాజు కేదో అనుమానం కలిగింది. ఒకదగ్గర మట్టి వుంది. ఆ మట్టి రాతిని అతుక్కుని వుంది. ఆ మట్టిని పట్టుకున్నాడు. పొడిపొడిగా చేతికి వచ్చింది.

"సూరీ! సాబర్ తనవద్దవున్న కాగితాలను క్రిందపడేసి కాలితో రాతిక్రిందకు నెట్టివున్నాడు." అంటూ ఇంకా పెకలించాడు తన మునివ్రేళ్ళతో.

"అయితే దొరికాయన్న మాట!" అన్నాడు ధనార్జనరావు ఆతృతగా చూస్తూ. యువరాజ్ పెదవి విరిచాడు. సూరి సంభ్రమాశ్చర్యాలకు లోనైపోయాడు.

అక్కడున్న కాగితాలను పూర్తిగా చెదలుపట్టి వుంది. చెదపురుగులు కాగితాలను సాంతం తినేసినై. కాగితాలకు బదులు చెదమట్టి గూడు కట్టుకు వుంది!! చెదపురుగులు చెల్లాచెదురై తిరుగుతున్నాయి.

అందరూ ఒకరి ముఖాలు మరొకరు చూసుకున్నారు. వారి ముఖాలలో నిరుత్సాహం నిండిపోయింది. మాట్లాడడానికి నోరు పెగలలేదు.

"మీ జీవితంలో ఇది విచిత్రమైన కేసు, మిస్టర్ యువరాజ్!" అన్నాడు ధనార్జనరావు.

"అవును. ఉల్లిపాయలో ఏమో ఉంటుందని భ్రమపడి పొరలను విప్పుకుంటూ వెళ్ళగా ఏమీ లేదు" అన్నాడు సూరి.

"ఆ విలేఖరి సంపాదించిన సాక్ష్యాల మూలంగా కమ్యూనిస్ట్ రాజ్యాల అసలు స్వరూపాన్ని చూడొచ్చనుకున్నాను" బాధగా అన్నాడు యువరాజ్.

—: ఐపోయింది :—

# చివరిపేజీ వినోదం

తండ్రి:- ఒరే, బాబూ! మీ అమ్మనడిగి మరో కప్పు కాఫీ తీసుకురా!

కొడుకు:- అమ్మని మరోసారి కాఫీ యివ్వమంటే తిడుతుంది. నే వెళ్ళను?

తండ్రి:- ఏం తిట్టదు. ఈవేళ జీతాలిచ్చే రోజు, రెండు కప్పు లిమ్మన్నా యిస్తుంది.

*  *  *

"పక్కింటి వాళ్ళ కుక్కకి అన్నం నువ్వు పెట్టటం దేనికే!"

"ఓం చేయను మరి? వాళ్ళేమో దానికి తిండి పెట్టరు. తిండి లేక అది తెల్లార్లూ మొఱుగుతుంది. అది అరుస్తుంటే నాకు నిద్ర పట్టదు."

*  *  *

ఆఫీసర్:- ఏవయ్యా! మొన్న మీ అబ్బాయి బారసాలకి లీవు తీసుకున్నావు కదా: ఇవాళ పెళ్ళికి లోను తీసుకుంటున్నావేమిటీ?!

ఉద్యోగి:- అదాండీ!....నా పెళ్ళికని నాలుగేళ్ళ క్రితం లోనుకు దరఖాస్తు పెట్టుకున్నా! అది యిప్పుడు శాంక్షన్ అయింది.

*  *  *

ఒక అమాత్య శేఖరుడు ఒక బహిరంగ సభలో ఉపన్యాసం దంచేస్తున్నాడు.

"మహాజనులారా! నేడు జనాభా విపరీతంగా పెరిగిపోతున్నది. దీనిని అరికట్టకపోతే ఆహారధాన్యాల కొరత ఎక్కువవుతుంది. కాబట్టి, జనాభా తగ్గడానికి మీరంతా కృషి చేయాలి."

"చిత్తం! ఈ ధరలు, కరువ యిలాగే వుంటే మళ్ళీ యీ రోజుల్నాటికి ఎవరూ కృషిచేయకుండానే జనాభా తగ్గిపోతుంది." అన్నదో గొంతు వెనుక మంచి.

—జమ్ము సత్యనారాయణ, వేడంగి.

మొదటివాడు:- (పైకి చూస్తూ) విమానం అంత పైకి ఎగురుతుంది గదా. దాంట్లో మనుషులకి ఎండవేడి ఎక్కువగా వుండదూ?

రెండవవాడు:- అందుకనే దానిముందు అంతపెద్ద పంకా ఉంచారు మరి!

* * *

ఏడవ తరగతిలో వ్యాసరచన పోటీ జరుగుతోంది.

"క్రికెట్ ఆట గురించి ఓ చక్కటి వ్యాసం రాయండి. 30 నిమూషాలు టైమ్ ఇస్తున్నాను" అని ఉపాధ్యాయుడు విద్యార్థులను హెచ్చరించి, అటూ ఇటూ తిరుగుతున్నాడు.

విద్యార్థులు దీక్షగా రాస్తున్నారు. అయిదు నిముషాలు గడిచాయి. ఇంతలో ఓ విద్యార్థి పేపరిచ్చేసి బయటకు ఠీవిగా వెళ్ళిపోయాడు. ఇంతత్వరలో ఏంరాశాడో చూద్దామని ఉపాధ్యాయుడు కాగితాన్నితీసి చూసాడు. అందులో ఇలా వుంది—

"వాతావరణం సరిగా లేనందున క్రికెట్ ఆట వాయిదా వేయబడింది."

* * *

ఎస్. ఐ:- రాత్రి 12 గంటలకు హత్య జరిగిన సమయంలో ఎక్కడున్నావ్?"

రాజు:- నేను, నా రాణిదగ్గర వున్నాను.

ఎస్. ఐ:- అయితే! నీ రాణి ఎక్కడుంది?

రాజు:- నా దగ్గరే వుంది.

ఎస్. ఐ:- (కోపంగా) అడిగాడు। మీ రిద్దరూకలిసి ఎక్కడున్నారు?

రాజు:- అదా సంగతి। మేము అప్పుడు నిజంగా......... స్వర్గంలో వున్నాము।।

—నీలా లక్ష్మణగుప్తా, అలీసాగర్.

ఒక బేంక్ మేనేజర్, తమ గుమాస్తా డబ్బుతో సహా పారిపోయాడని, పోలీస్ రిపోర్టు చేసాడు.

"అతనెలా ఉంటాడు. పొడుగా? పొట్టా?" ఇన్ స్పెక్టర్ గుర్తు లడిగాడు.

"అదెలా చెప్పగలనండి। పొట్టివాళ్ళ దగ్గర పొడుగ్గాను, పొడుగువాళ్ళ దగ్గర పొట్టిగాను ఉంటాడు" అన్నాడతను.

* * *

తండ్రి:- (కొడుకుతో కోపంగా) ఒరేయ్। నీ అల్లరి చాల హెచ్చుగా ఉంది. వస్తువులన్నీ ఇలా పాడుచేస్తే తంతానీసారి?

కొడుకు:- (పెంకెగా) ఓసోస్। అమ్మ కళ్లబ్బు కెళ్ళినంత మాత్రాన ఇంటి పెత్తనమంతా నీదిలాగే నటించక్ఖర్లేదు.

* * *

తలకు కట్టు కట్టుకొని హాస్పిటల్లో ప్రవేశించిన పెద్దమనిషిని, ఫారం పిలప్‌చేస్తున్న నర్సు ప్రశ్నించింది.

"మీకు వివాహమైందా?"

"లేదండి, రాయి తగిలిందంతే।"

* * *

హరికథ దగ్గర దొంగతనం చేసిన ఇద్దరు వ్యక్తులిలా అనుకుంటున్నారు.

"నువ్వేం తెచ్చావురా," ఒకడడిగాడు.

"ఒక బూట్ల జత. నువ్వు?" రెండవత నడిగాడు.

"ఒక అకు చెప్పు. ఒక బూటూ" మొదటివాడు చెప్పాడు.

"అదేమిటిరా," అన్నాడు రెండవవాడు.

"అవునురా! ఒక్కొక్క జోదే ఉండటంతో ఆ వున్నవి కూడా అక్కడే పడవేసి వెళ్ళిపోతారు. మిగిలినవి కూడా మనమే తెచ్చుకోవచ్చు." అన్నాడు మొదటివాడు తెలివిగా.

—డి. వి. కుమారి శశికిరణ్, ఖుర్దారోడ్.

రచయిత:- ఎడిటర్‌గారూ! నేనోకథను సరికొత్త పంధాలో వ్రాశాను. దీన్ని మీ పత్రికలో ప్రచురిస్తారా?

ఎడిటర్:- క్షమించండి. మా పత్రికను పాతపంధాలోనే నడుపుతున్నాం.

* * *

కలం, కాగితం ముందేసుకుని ఆలోచిస్తున్న భర్తతో, భార్య—

"ఏమండీ! మన పెళ్ళయినప్పటినుండి చూస్తున్నా. మీరు వ్రాసి పంపిన కథ ఒక్కటీ ఏ పత్రికలోను పడదే?"

"అదే నేను ఆలోచిస్తున్నా! మన పెళ్ళయినప్పటి నుండి నీ పేరుమీద పంపే కథ ఒక్కటీ అచ్చువలేదు!"

* * *

భార్య:- ఎందుకండీ అస్తమానం ఆ "అపరాధపరిశోధన" చదువుతూ కూర్చుంటారు!

భర్త:- ఉద్యోగం ఎలాగూ వచ్చేటట్లులేదు. కనీసం పోటీల లోనైనా నాలుగు బహుమతులు పొందుదామని!

—హెచ్. వి. యస్. సుబ్రహ్మణ్యం, మౌలాలి.

క్రొత్తగా వచ్చిన ప్రైవేటు మాస్టారు గోపీతో:- బాబూ! నీకు అ ఆ లన్నీ వచ్చా? రాసి చూపించు....?

గోపీ:- ఏం? మీకు రావా?

మాస్టారు:- (ముద్దుగా)రావు. మరి రాసి చూపించు నాకు!

గోపీ:- అయితే, మా బళ్లో చేరండి నేర్పిస్తారు.

* * *

డిటెక్టివ్:- అసిస్టెంటూ! ఇంక నువ్వు నా అసిస్టెంటుగా పనికి రావోయ్!

అసిస్టెంట్:- అవున్సార్! నాకా సంగతి ముందే తెల్సు. ఇకనుంచీ నేను డిటెక్టివ్వూ, మీరు అసిస్టెంటూ అవుదాం సార్?

డిటెక్టివ్:- షటప్! బ్రూట్?

అసిస్టెంట్:-మీ రెందుకు తిడుతున్నారో అర్థమయిందిలెండి?

డిటెక్టివ్:- (కోపంగా) ఎందుకోయ్?

అసిస్టెంట్:- నా కసిస్టెంటుగా మీరు పనికిరారని, మీ రను మాన పడుతున్నట్టున్నారు సార్!

* * *

ఒక రాజకీయనాయకుడు సభలో ప్రసంగిస్తున్నాడు ఎలక్షన్ల ముందు. టొమాటోలు విసురుతున్నారు జనం గోలగా.

రాజకీయనాయకుడు:- చూసారా! ఇక్కడి ప్రజల్లో నా ప్రిస్టేజీ ఎంతగా పెరిగిందో? మొదటిసారి ఎలక్షన్లో నాపై రాళ్లు విసిరారు. ఆ తర్వాత రెండోసారి చెప్పులు విసిరారు. మూడోసారి అంటే ఇప్పుడు టొమాటాలు విసురుతున్నారు. నా కెంతో సంతోషంగా వుంది!

—'ఉమశ్రీ', విశాఖపట్టణం.

హిట్లరు జర్మనీలో ఒక పిచ్చాసుపత్రికి వెళ్ళినప్పుడల్లా పిచ్చి వాళ్ళందరూ ఆయనకు శాల్యూట్ చేయడం నేర్పించాడు డాక్టర్.

ఒకసారి పిచ్చాసుపత్రిలో అందరూ హిట్లర్‌కు శాల్యూట్ చేశారుగాని, ఒక్కడు మాత్రము చేయలేదు.

హిట్లర్ అతని వంక తిరిగి, "నువ్వెందుకని నాకు శాల్యూట్ చేయలేదు" అని అడిగాడు.

"నేను యీ హాస్పిటల్లో కొత్తగా వచ్చిన డాక్టరును. పిచ్చి వాడ్ని గాదు" అన్నాడు.

*　　　　*　　　　*

ఒకాయన సర్వరు తెచ్చిపెట్టిన కాఫీలో ఈగను స్పూన్‌తో తీసి సర్వరుకు చూపించి, ఇంకో కాఫీ పట్టుకురమ్మన్నాడు.

సర్వరు వెళ్ళిపోగానే ఆయన ఎదురుగా కూర్చుని ముప్పాతిక భాగం కాఫీ త్రాగిన ఆయన "ఆ ఈగను ఇలా ఇవ్వండి" అన్నాడు.

*　　　　*　　　　*

ఒక కంపెనీ డైరక్టర్ సెక్రటరీతో "రేపు శనివారం నీకేమైనా సొంత పని వుందా" అని అడిగాడు.

"ఏమీలేదు," అన్నది.

"ఆదివారం పనివుందా?:"

ఏమీలేదని చెప్పింది వుత్సాహంతో.

"అయితే, సోమవారం పెందరాళే ఆఫీసుకి రావడానికి నీకే ఇబ్బంది వుండదనుకుంటాను" అన్నాడు.

*　　　　*　　　　*

ఒక మతిమరుపు పరంధామయ్య తన స్నేహితుడైన డాక్టరు వద్దకు వెళ్లి, ఓ రెండు గంటలు పిచ్చాపాటి మాట్లాడి ఇంటికి పోవడానికి బయలుదేరాడు.

డాక్టరు అలవాటు ప్రకారము "ఇంట్లో అందరూ కులాసానే కదూ?" అన్నాడు.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది, తన భార్య ప్రసవవేదన పడుతుంటే డాక్టరును తీసుకెళ్ళడానికి తాను వచ్చానని.

—నందనవనం జయలక్ష్మి, విజయవాడ.

"ముల్లు అరిటాకుమీద పడినా, అరిటాకు ముల్లుమీద పడినా

ఆరిటాకుకే నష్టం! దీనికి ఉదాహరణం చెప్పరా?"

"ఏముంది? ఎడిటర్‌గారికి రచయితలమీద కోపం వచ్చినా, రచయితలకి ఎడిటర్‌గారిమీద కోపంవచ్చినా నష్టం రచయితలకే!"

* * *

"నా ఈ నెల జోక్స్ తిరిగొచ్చాయిరా!"

"ఏం ఫర్వాలేదులే!"

"అది కాదురా, నా పేరు చూడగానే కవరుకూడా ఓపెన్ చేయకుండా పంపేశారు!!"

* * *

"ఎక్కడకండి వెళ్తున్నారు?"

"ఈ వీధి చివర ఎవరో జోకర్ ఉన్నాట్ట. నాలుగు జోకులు చెప్పిచ్చుకొని వస్తాను. సప్లిమెంట్ ఫ్రీగా పంపుతారట!!"

—పొన: శ్రీ బదరీనారాయణరావు, విజయవాడ-

